

GRT
JEWELLERS
Since 1964




జీవితకాలం
నిలిచి ఉండే అనుబంధాలకు
కాలాతీతమైన
వివాహ ఆభరణాలు.

అద్భుతమైన డిజైన్.
ఆశ్చర్యకరమైన ధరలో.

అమూల్యమైన
వజ్రాల
నెక్లెస్ ధర కేవలం
₹ 99,900*

మేము UPI
చెల్లింపులను
అంగీకరిస్తాము.

*నిబంధనలు వర్తిస్తాయి.

| GUNTUR | TIRUPATHI | VISAKHAPATNAM | | HYDERABAD | | |
|---|---|---|---|---|---|---|
| BRODIPET<br>Ph: 0863-221 1515 | PRAKASAM ROAD<br>Ph: 0877-228 1515 | SAMPATH VINAYAGA TEMPLE ROAD<br>Ph: 0891-253 1515 | GAJUWAKA<br>Ph: 0891-257 1515 | CHANDA NAGAR<br>Ph: 040-4020 1515 | KUKATPALLY<br>Ph: 040-4025 1515 | SOMAJIGUDA<br>Ph: 040-2333 1515 |

TAMIL NADU | PUDUCHERRY | KARNATAKA

Dubai | Singapore

Shop online at: www.oriana.com | mail@grtjewels.com










పూర్తిస్థాయి సరికొత్త శ్రేణి డైపర్లు. ఫీడింగ్ బాటిల్స్‌ను ప్రవేశపెట్టడంద్వారా కుకుంబర్ తన ప్రేమను, సురక్షితను ప్రదర్శిస్తోంది. అత్యుత్తమస్థాయి పరిశుభ్రత కలిగివుంటాయి. మరియు ఇప్పటికేగల శ్రేణిలో రంగురంగుల పిల్లల దుస్తులూ వున్నాయి.

సకల కుకుంబర్ శ్రేణులు, అన్ని ప్రముఖ షాపుల్లోనూ లభిస్తాయి. మీ చిన్నారుల బాల్యం మధురస్మృతిగా సాగేందుకు వీలయినవి.




Kids Wear | Feeding Bottle | Baby Diaper

For trade enquiries, fax @ +91-33-2262 2104
email : info@hpgroup.org



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

# స్వాతి

సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM


## ఒక్క మంచి పని చాలు

ప్రజల మనస్సులు లెక్కలేనన్ని కోరికలతో నిండి ఉంటాయి.ఆ కోరికల్ని తీర్చుకోడానికి ఎంత కష్టపడి ప్రయత్నించినప్పటికీ చివరికి వాటిని మీరు తీర్చుకోలేరు.

ఎప్పుడూ, జనం తమ అపజయాల గురించే దుఃఖపడుతూ కాలాన్ని వృథాచేస్తూ ఉంటారు; దీనివల్ల మనశ్శాంతినీ, ఆరోగ్యాన్ని పోగొట్టుకుంటారు. మనకు కావలసింది మనశ్శాంతి. అది అన్నిటికన్నా గొప్ప సంపద.

ప్రతి భౌతిక లక్ష్యానికీ మన జీవితాల్లో తగిన స్థానాన్ని మనం అర్థంచేసుకున్నట్లైతే, దానిప్రకారం జీవించినట్లైతే,దుఃఖానికి కారణం ఉండదు. ఈ లోకంలో ఎన్ని అడ్డంకులు ఎదురైనా తృప్తిగా ఎలా బతకాలో నేర్పేదే ఆధ్యాత్మిక జ్ఞానం.

అన్నిటికన్నా మొట్టమొదట మనం సంపాదించవలసింది ఇది. విషయాల మంచి చెడ్డలను రెంటినీ కనక మనం ఎరుకలో ఉంచుకుంటే శాశ్వతానందానికి చేర్చేదారిని ఎన్నుకోవచ్చు.

జీవితంలోని భౌతికావసరాలకోసం మీరు బ్యాంకులో డబ్బు వేసుకున్నట్లుగానే, మీరు శారీరకంగానూ, మానసికంగానూ తగినవిధంగా ఉన్నప్పుడే శాశ్వత సంపత్తిని కూడబెట్టుకోవాలి. దైవ నామాల్ని జపించడంవల్లా మంచి పనులుచేయడం వల్లా మీరిది సాధించగలుగుతారు.

ఎవరైనా వంద మంచి పనులు చేసి ఒకే ఒక చెడ్డపని చేసినట్లయితే జనం అతన్ని ద్వేషిస్తారు, కాని ఎవరైనా వంద తప్పులు చేసి ఒకే మంచి పని చేసినట్లైతే భగవంతుడు అతన్ని ప్రేమిస్తాడు.అందుచేత భగవంతునికి కట్టుబడి ఉండండి.

-శ్రీ మాతా అమృతానందమయి దేవి



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 35 | 5.10.2018 | సంచిక 14

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Before you can score, you must have a goal

### సీరియల్స్



### కథలు





ముఖచిత్రం ప్రియా సుమన్

### స్పెషల్ ఫీచర్స్



### శీర్షికలు




చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు

E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076

విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM

Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad

Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433

## విజయానికి చేరుకొనే మార్గం అంటే సరైన సంస్థ నుండి సరైన అర్హతను పొందటమే..!




నా పేరు సినీ మంగత్. నేను బ్యూటీ ఫీల్డ్‌లో స్థిరపడాలని నిర్ణయించుకున్నాను. ఒక మంచి నాణ్యత కలిగిన స్టాండర్డ్ సెలూన్‌ని స్టార్ట్ చేయాలంటే ఈ ఫీల్డ్‌కి సంబంధించిన వివరాలు తెలుసుకోవాలని చాల వెతికాను. ఆ సమయంలో అనూస్ ఇంటర్నేషనల్ బ్యూటీ స్కూల్ గురించి తెలిసింది. ఇక్కడ ఎం.ఎస్.సి. కాస్మెటాలజీ ప్రోగ్రాం నన్ను ఆకర్షించింది, ఎందుకంటే ఇది ఇండియాలోనే ఈస్తటీషియన్స్ కోసం అత్యంత అధికమైన అర్హతలు గల కోర్సు. అనూస్ బ్యూటీ స్కూల్‌లో మాస్టర్ ప్రోగ్రాంతోపాటు సెడెస్కో ఇంటర్నేషనల్ సర్టిఫికేషన్ కోర్సు కూడ చేశాను. ఈ రెండు కోర్సులు నాకు బ్యూటీ రంగంలో కావలసిన జ్ఞానాన్ని సంపాదించుకొనేలా చేయడమే కాక నాకిష్టమైన బ్యూటీ రంగంలో స్థిరపడడానికి చాల ఉపయోగపడ్డాయి. ఈ కోర్సుల వల్ల నేను బ్యూటీ రంగంలో అతి తక్కువ సమయంలో స్థిరపడే అర్హతను పొందాను. ఇపుడు నేను కొచ్చిన్‌లో ఒక సెలూన్‌ను స్టార్ట్ చేశాను. కేరళలోని కొచ్చిన్‌లో అత్యంత అధునాతనమైన సెలూన్‌లలో ఒకటి అయిన ఈ సెలూన్ **"సినీ మంగత్ ఈస్తటిక్స్ ప్రైవేట్ లిమిటెడ్"**గా మంచి పేరును సంపాదించుకుంది. దీనికి మేనేజింగ్ డైరెక్టర్ అయిన నేను అనూస్ ఇంటర్నేషనల్ బ్యూటీ స్కూల్ స్టూడెంట్‌ని అని చెప్పుకోవడానికి గర్విస్తున్నాను. బ్యూటీ ఫీల్డ్‌లో స్థిరపడాలనుకునే ప్రతి ఒక్కరికి అనూస్ ఇంటర్నేషనల్ బ్యూటీ స్కూల్‌ని రికమెండ్ చేస్తున్నాను. సరైన సంస్థ నుండి సరైన అర్హతను పొందటం మీ విజయానికి చేరుకోవటానికి కావలసిన మార్గాన్ని మీకు చూపిస్తుంది. **– సినీ మంగత్, అనూస్ బ్యూటీ స్కూల్ స్టూడెంట్.**


Sini Mangath
Anoo's International Beauty School Student

**మంగత్ గురించి అనూస్ సిస్టర్స్:** సినీ మంగత్ అనూస్ ఇంటర్నేషనల్ బ్యూటీ స్కూల్ స్టూడెంట్. ఆమె చాల శ్రద్ధగా మరియు రెగ్యులర్‌గా క్లాసెస్‌కి హాజరయ్యేది. ఎంతో పట్టుదల, కృషితో చక్కగా ప్రతి విషయాన్ని తెలుసుకొని మంచి పేరు తెచ్చుకొంది. అనూస్ బ్యూటీ స్కూల్‌లో కోర్సు చేయడం వల్ల సబ్జెక్ట్స్‌తో పాటు ఎవరితో ఎలా మెలగాలి, క్లయింట్స్‌తో మరియు తోటివారితో ఎలా మాట్లాడాలి, సెలూన్‌ను ఎలా హైజెనిక్‌గా ఉంచుకోవాలి వంటి ఎన్నో విషయాలను అనూస్‌లో తెలుసుకోవడం వల్లనే ఇపుడు ఒక అధునాతనమైన సెలూన్‌ను నేను సొంతంగా నడపగలుగుతున్నానని మంగత్ చెబుతుంటుంది. వియ్ విష్ హెర్ ఎ గ్రేట్ ఫ్యూచర్... **అనూస్ బ్యూటీ స్కూల్ మేనేజ్‌మెంట్**

### అనూస్ ఇంటర్నేషనల్ బ్యూటీ స్కూల్ కోర్సులు

- ఎం ఎస్ సి కాస్మెటాలజీ
- సెడెస్కో (ఇంటర్నేషనల్ సర్టిఫికేషన్ కోర్సు)
- అడ్వాన్స్ డిప్లొమా ఇన్ కాస్మెటాలజీ
- స్కిన్ థెరపీ • పారామెడికల్ • బ్యూటీ
- హెయిర్ • మేకప్ • స్పా • ఆరోమా థెరపీ



### షార్ట్ టెర్మ్ బ్యూటీ కోర్సులు

- పర్సనల్ గ్రూమింగ్
- పర్సనల్ మేకప్
- శారీ డ్రేపింగ్
- నెయిల్ ఆర్ట్
- మెహందీ

For Black Xpert & Henna Applications Scan Here






https://www.facebook.com/AnoosBeautyIndia

మా సేవలకై మీ ప్రశ్నలను ఈ నంబరుపై 99596 16106 సంప్రదించండి - అనూస్ సిస్టర్స్

అనూస్ వీడియోస్‌కై మీ వాట్సప్ నంబరును ఈ 91000 34054 కు షేర్ చేయండి, ఆన్‌లైన్‌లో కొనాలంటే www.anoos.com

అనూస్ హెర్బల్ ప్రొడక్ట్స్ మీ దగ్గరలోని సూపర్ మార్కెట్స్‌లోగాని, షాపులోగాని పొందాలంటే, పదే పదే అడిగి ఒత్తిడి పెంచండి.



TELANGANA | ANDHRAPRADESH
KARNATAKA | USA

Watch Anoo's Programme
Every Saturday in HMTV at 1.30 PM.
Every Saturday in V6 at 3.30 PM.
Every Sun & Mon in Zee Cinemalu at 9.00AM.

*International Beauty School & Services :* 99596 16106
*Product Enquiries:* 9100034054

## అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక






**21.9.2018**

స్వాతి వార పత్రిక నిత్యయవ్వని. వినూత్న పంథాలతో ముందుకు సాగుతున్నది. తెలుగువారి అభిమానాన్ని సొంతంచేసుకున్నది.

'డబ్బులెవరికీ ఊరికే రావు' సీరియల్ చక్కగా ఆకట్టుకుంటున్నది.

*జి.ఎల్.పంచాక్షరీశ్ రెడ్డి నిజామాబాద్*

బొజ్జ గణపయ్య ముఖచిత్రంతో వెలువడిన స్వాతి ముచ్చటగొలిపింది. 'తుండము నేకదంతమును', 'శ్రీ గణేశవైభవం' వ్యాసాలు, 'సత్యాన్వేషణ' శీర్షిక చదివి తరించాం.

'బతుకులో వెన్నెల' కథ చాలా సాఫ్ట్‌గా సాగింది. యవ్వనంలో వున్న, పెళ్ళికాని యువకుల మనస్తత్వాన్ని చక్కగా విశ్లేషించింది. అంతే కాదు అప్పుడే పెళ్ళైన నవదంపతుల ఆత్రుతను కళ్ళకుకట్టినట్టుగా చూపెట్టింది.

*పి.నరసయ్య హైదరాబాద్*

చిత్రకారుడు వడ్డాది పాపయ్యగారి గణపతి ముఖచిత్రం దివంగత ఆ చిత్రకారుడ్ని జ్ఞప్తికి తెచ్చింది.

'ఒక చిన్నమాట' శీర్షికలో చెప్పినట్లు... నవజోత్‌సింగ్ సిద్దూ ఉదంతంతో, స్నేహభావంతో వ్యవహరించిన దాన్ని విభేదించనవసరంలేదు.

'అప్పరు బెర్తు' కథ బావుంది.

'సత్యాన్వేషణ' పేర్కొన్నట్లు గ్రహబలంకన్నా దైవానుగ్రహమే మిన్న అన్న అభిప్రాయం ఉన్నతమైనది.

'చివరిరోజుల్లో...' శీర్షికలో బెర్ట్రెండ్ రస్సెల్ కమిట్‌మెంట్ ఎంత గట్టిదో అవగతమైంది.

*ఎస్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం*

గాలిలో కలిసివస్తూ వినిపించబోతున్న ఆ ఎదుటి వ్యక్తి మాటల్నికూడా మనకి వినిపించేలా చేస్తున్న అంతఃకరణం అని 'తుండము నేకదంతమును' విశ్లేషణలో తెలుసుకున్నాం.

పిల్లలకు అన్నం తినిపించడంకోసం వారిని తిట్టికొట్టకుండా ఆసక్తికరమైన విషయాలను చెబుతూ తినిపించేప్రయత్నాలు చేయాలి అని పెద్దలకు మంచి విషయాలను తెలిపింది 'అనిల్' పేజి.

'అప్పరు బెర్తు', 'బతుకులో వెన్నెల' కథలు చాలా బాగున్నాయి.

*జి.వి.ఎమ్.మోహన్‌రావు రామచంద్రపురం*




'తుండమునేక దంతమును' వ్యాసంలో విఘ్నేశ్వరుడి విశిష్టత తెలియజెప్పినందుకు అభినందనలు.

'ముందస్తు తెలంగాణ' వ్యాసంలో విశ్లేషించిన ప్రతి అంశమూ అక్షరాల వాస్తవం. 'వరఫలం', 'ఇది మంచి సమయం' శీర్షికలు చాలా ప్రయోజనకరంగా ఉంటున్నాయి.

'చివరిరోజుల్లో' శీర్షికలో బెర్ట్రెండ్ రస్సెల్ గురించి తెలుసుకున్నాం.

'B హ్యాపీ' జోక్స్ బాగున్నాయి.

*ఎ.వి.సోమయాజులు కాకినాడ*

# ఇది మంచి సమయం



**27.9.2018 నుండి 3.10.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, శరదృతువు, భాద్రపదమాసం, కృష్ణపక్షం.**

**27.9.2018 గురువారం**
తిథి: భాద్రపద బహుళ విదియ ప. 9.03 వరకు
నక్షత్రం: అశ్విని రా. 2.23 వరకు
వర్జ్యం: రా. 10.18-11.56 వరకు
దుర్ముహూర్తం: ప. 9.58-10.47 వరకు. మ. 2.54-3.43 వరకు
రాహుకాలం: మ. 1.33-3.05 వరకు
మంచి సమయం: ఉ. 7.55 నుండి 9.25 వరకు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.53కి
ఉండ్రాళ్ళ తద్ది

**28.9.2018 శుక్రవారం**
తిథి: తదియ ప. 8.45 వరకు
నక్షత్రం: భరణి రా. 2.28 వరకు
వర్జ్యం: మ. 12.01-1.37 వరకు
దుర్ముహూర్తం: ప.8.19 నుండి 9.08 వరకు. మ. 12.25-1.14 వరకు
రాహుకాలం: మ. 10.29-12.01 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.53కి

**29.9.2018 శనివారం**
తిథి: చవితి ప. 8.04 వరకు
నక్షత్రం: కృత్తిక రా. 2.14 వరకు
వర్జ్యం: మ. 2.22-3.57 వరకు
దుర్ముహూర్తం: ఉ.5.50-7.29 వరకు
రాహుకాలం: ప. 8.58-10.30 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.54కి
సూర్యాస్తమయం: 5.53కి

**30.9.2018 ఆదివారం**
తిథి: పంచమి ఉ. 7.04 వరకు. షష్ఠి తె. 5.45 వరకు
నక్షత్రం: రోహిణి రా. 1.41 వరకు
వర్జ్యం: సా. 5.52-7.25 వరకు
దుర్ముహూర్తం: సా.4.36-5.26 వరకు
రాహుకాలం: సా. 4.41-6.13 వరకు
మంచి సమయం: ప.10.55-11.30 వరకు
సూర్యోదయం: 5.54కి
సూర్యాస్తమయం: 5.52కి

**1.10.2018 సోమవారం**
తిథి: సప్తమి తె. 4.09 వరకు
నక్షత్రం: మృగశిర రా. 12.51 వరకు
వర్జ్యం: ఉ. 7.06-8.39 వరకు
దుర్ముహూర్తం : మ. 12.16 నుండి 1.04 వరకు. మ. 2.39-3.27 వరకు
రాహుకాలం: ఉ. 7.25-8.54 వరకు
మంచి సమయం: సా. 4.25 నుండి 5.00 వరకు. రా. 7.00-8.20 వరకు
సూర్యోదయం: 5.54కి
సూర్యాస్తమయం: 5.51కి

**2.10.2018 మంగళవారం**
తిథి: అష్టమి రా. 2.17 వరకు
నక్షత్రం: ఆర్ద్ర రా. 11.45 వరకు
వర్జ్యం: ప. 8.52-10.24 వరకు
దుర్ముహూర్తం: ప. 8.17-9.05 వరకు రా. 10.40-11.28 వరకు
రాహుకాలం: మ.2.50-4.19 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.54కి
సూర్యాస్తమయం: 5.50కి
గాంధీ జయంతి

**3.10.2018 బుధవారం**
తిథి: నవమి రా. 12.10 వరకు
నక్షత్రం: పునర్వసు రా. 10.24 వరకు
వర్జ్యం: ప. 11.04 నుండి 12.34 వరకు. తె. 5.52 లగా....
దుర్ముహూర్తం: ప. 11.27 నుండి 12.15 వరకు
రాహుకాలం: ప. 11.52-1.21 వరకు
మంచి సమయం: ఉ. 7.50 నుండి 9.00 వరకు. తె.3.00-4.45 వరకు
సూర్యోదయం: 5.54కి
సూర్యాస్తమయం: 5.49కి

* మంచి భవిష్యత్ మీకు ఆహ్వానం పలుకుతోంది.

# ఒక చిన్నమాట



ఈ మధ్య అలహాబాద్‌లో ఒక నాలుగురోడ్ల కూడలివద్దనున్న జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిమను తొలగించారు. ఈ సంఘటన ఎందరికో కోపకారణమయింది. నెహ్రూ కుటుంబంతో ముడిపడిన అలహాబాద్‌లో, పూర్వీకుల భవంతులున్న అలహాబాద్‌లో నెహ్రూ ప్రతిమను తొలగించటమా! అని ఎవరైనా వ్యతిరేకిస్తారు.

ప్రాంతీయంగా అధికారులు చెప్పే మాటలకు అందరూ శాంతించక తప్పదు. జనవరి 2019లో అక్కడ కుంభమేళా జరగనుంది. నగరాన్ని సుందరంగా మార్చటంతోపాటు పెరగనున్న ట్రాఫిక్‌కు అనుగుణంగా రోడ్లు వెడల్పు చేయుటం, కూడళ్ళకు మరింత స్థలం ఏర్పాటుచేయుటం జరుగుతోంది.

నెహ్రూ ప్రతిమ తొలగించిన కూడలిలో దీన్ దయాల్ ఉపాధ్యాయ ప్రతిమ, హేమవతీనందన్ బహుగుణ ప్రతిమలు కూడా ఉన్నాయి.

నెహ్రూ ప్రతిమ ఉన్నచోటే పునర్నిర్మాణం జరుగుతోంది. ప్రస్తుతానికి పక్కనున్న పార్కులో ప్రతిమను పెట్టి, పనిపూర్తయ్యాక యథాస్థానంలో పెడతామంటున్నారు. వీరి మాటలు నమ్మదగినవిగా ఉన్నాయి కదా!



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

నెహ్రూ విధానాలను,ఆయన తీసుకున్న కొన్ని నిర్ణయాలను ఈనాడు తప్పుపట్టవచ్చు. విమర్శించవచ్చు. కాని పరాయి పాలననుండి ముక్తి చెంది ఆధునిక పాలన దిశలో, ఆధునికీకరణ దిశలో దేశం అడుగులువేస్తున్నప్పుడు ఆ క్లిష్ట పరిస్థితిలో దిశానిర్దేశంచేస్తూ దేశాన్ని నడిపిన ఘనతను తక్కువ చేయలేము.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు ఆనాటి బ్రిటీష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ ఆ స్వాతంత్ర్యం ఎంతో కాలం ఉండదని దేశం పన్నెండు ముక్కలవుతుందని జోస్యం చెప్పారు.

కాని భారత రాజ్యాంగం తయారయింది. కాన్‌స్టిట్యూషనల్ అసెంబ్లీ కార్యక్రమాల్లో జవహర్‌లాల్ నెహ్రూ అత్యంత ఆసక్తి కనబరచారు.

రాజ్యాంగాన్ని రూపొందించే కమిటీకి అధిపతిగా డాక్టర్ అంబేద్కర్ ఉన్నారు. గొప్ప గొప్ప మేధావులు రాజ్యాంగం రూపొందటానికి శాయశక్తులా పని చేశారు. మన రాజ్యాంగం జవహరల్‌లాల్ నెహ్రూ ఆదర్శాలను పొందుపరచుకొంది.

సంస్థానాలను భారతదేశంలో విలీనం చెయ్యటమూ నెహ్రూ ఆలోచనకు అనుగుణంగా జరిగింది. నేటి ఆర్థిక వ్యవస్థను రూపొందించటానికి అనువైన సంస్థలు, ఉన్నత విద్య, సాంకేతిక నైపుణ్య సంస్థలు ఆయన దార్శనీయతకు ప్రతిబింబాలే. మతాల రూఢివాదము, సాంప్రదాయక వాదాల నుండి దేశాన్ని అతీతంగా చూపి సెక్యూలరిజానికి ప్రాముఖ్యమిచ్చిందీ నెహ్రూనే. సునిశిత విదేశీ విధానంతో అభివృద్ధి చెందుతున్న దేశాలలో అగ్రనాయకునిగా నెహ్రూ నిలిచారు.

అలీన దేశాల ఉద్యమానికి నాయకత్వం వహించారు. జమ్ము, కాశ్మీరు రాజు భారతదేశంతో విలీనం అవటానికి ఒప్పుకున్న తర్వాత పాకిస్తాన్ సేనలను, గిరిజనుల పేరుతో జరుగుతున్న ఆక్రమణను వెనక్కు మళ్ళించగలిగారు. కాని ఆక్రమిత కాశ్మీరు విషయంలో ఐక్యరాజ్యసమితిదాకా వెళ్ళటాన్ని ఈనాటికీ అందరూ విమర్శిస్తుంటారు.

తన ఆదర్శాలవల్లే అంతర్జాతీయ సంస్థ దాడి జరిపినవారిని గుర్తించి తగిన చర్యలు తీసుకుంటుందనుకున్నారు. ఉదాత్తంగా ఆలోచించిన ఆయనను తప్పుపట్టలేము కదా! పరిస్థితులననుసరించి సరిఅనుకున్న నిర్ణయాన్ని తీసుకునే అధికారం ఆయనకుంది కదా!

జమ్ము, కాశ్మీరు రాజాహరిసింగ్ కొడుకు డాక్టర్ కరణ్‌సింగ్ ఈనాటికీ నెహ్రూను ఎంతగానో అభిమానిస్తారు. ఆయన ఆదర్శాలను గౌరవిస్తారు.

జూలియస్ సీజర్ నాటకంలో సీజర్ బ్రూటస్ గురించి చెప్పిన "ఆయన జీవితం మృదువైనది. ఆయనలో ప్రాకృతిక విషయాలు ఎలా మేళవించాయంటే ప్రకృతే నిలబడి "ఇతనూ మనిషంటే" అని చెప్పగలదు" అనే మాటలను నెహ్రూకు అన్వయిస్తారు. నెహ్రూ మరణించినప్పుడు దేశమంతా రోదించింది. అప్పటివరకు ప్రధాని నివశించిన తీన్ మూర్తి భవన్ ఒక దేవాలయమయింది.

ఆ తర్వాత ప్రధానమంత్రి అయిన లాల్ బహదూర్ శాస్త్రికి ఆ ఇంట్లో అడుగుపెట్టే ఆలోచనే రాలేదు. "అటువంటి వ్యక్తి తిరిగి ఆ భవనంలో నివశిస్తారని నేననుకోను" అని వాజ్‌పేయి అన్నారు.

భారత సైన్యాల అధిపతి ఆ ఇంట్లో ఆగష్టు 1948 సంవత్సరంవరకు,అప్పటి తీన్‌మూర్తి హౌస్‌లో నివాసముండేవారు.ఆనాటి వైస్రాయి భవనానికి (నేటి రాష్ట్రపతి నివాసానికి) అది దగ్గరలో ఉండేది.

జవహర్‌లాల్ నెహ్రూ 1948 సంవత్సరంవరకు ఇతర మంత్రుల లాగే మోతీలాల్ నెహ్రూ మార్గ్‌లో ఒక భవనంలో ఉండేవారు.

జవహర్‌లాల్ నెహ్రూ ప్రధాని నివాసంగా సైన్యాధిపతి భవనాన్ని కోరుకున్నారు. ఆయన మరణం తర్వాత అది ప్రధాని నివాసం కాకుండా ఆయన పేరుతో మ్యూజియంగా మారాలని ప్రభుత్వం నిర్ణయించింది. దానికి అనుబంధంగా లైబ్రరీ ఏర్పడింది. ఆ ఆవరణలోనే ప్లానెటోరియం వచ్చింది.

ఇరవై ఐదు ఎకరాలకు మించిన ఈ ఆవరణలో ఇతర ప్రధానమంత్రుల జ్ఞాపకార్థం మ్యూజియం ఏర్పాటుచేయాలనే ప్రతిపాదన రావటం చాలామందికి నచ్చలేదు. జవహర్‌లాల్ నెహ్రూ ఘనతను తగ్గించటానికి, ఆయనను చిన్నబుచ్చటానికి ఇదొక పథకమని కొందరు భావిస్తున్నారు. ఏ దేశాలలోనూ ప్రధానమంత్రులకు మ్యూజియంలు లేవు.

మన దేశంలో ఏ ఇంట్లోవారు నివసిస్తే ఆ ఇంటినే మ్యూజియంగా మార్చే పద్ధతి ఒకటి వచ్చింది. దీనికి 2000లో స్వస్తి చెప్పారు. మరణించిన ప్రముఖుల సమాధులకు ఎకరాలు, ఎకరాలు కేటాయించటమవుతోంది. ప్రధానమంత్రులందరూ దేశనిర్మాణానికి పాటుపడ్డారా! అనేది మౌలిక ప్రశ్నగా నిలుస్తుంది.

ఐదేండ్లు పాలన పూర్తిచేసిన వారెందరు? కొన్ని నెలలే ఆ పదవిలో ఉన్నవారెందరు? ఈ లెక్కలు చేసి ఒకరిని ఎక్కువ, మరొకరిని తక్కువ చేయలేము గనుక, ఒకరిద్దరు ప్రధానమంత్రులకే మ్యూజియంలు ఉండటం తగదు గనుక అందరి జ్ఞాపకార్థం మ్యూజియంలు ఏర్పడితే 25 ఎకరాలకు మించిన ఆవరణ ఉన్న నెహ్రూ మెమోరియల్ మ్యూజియం అండ్ లైబ్రరీలో దానిని స్థాపిస్తే ఎవరికి నష్టం?

నెహ్రూకున్న గొప్పతనం ఎలా తగ్గుతుంది? ఆవరణ వైశాల్యాన్నిబట్టి గొప్పతనం లెక్కకడతామా? కొండంత దేవునికి కొండంత పత్రా?

**2017** నవంబరు 8. సాయంత్రం ఎనిమిది గంటల ప్రాంతంలో టెలివిజన్‌ల ముందున్న భారత ప్రజానీకం ఉలిక్కిపడే ప్రకటన ప్రధానమంత్రి నరేంద్రమోడీ నుండి వెలువడింది. ఈ అర్ధరాత్రి నుండి దేశంలోని ఐదు వందల, వెయ్యి రూపాయల నోట్లు అన్నీ పనికిరాని కాగితాలే" అన్నది ఆ ప్రకటన సారాంశం. ఒకే ఒక్క ప్రకటనతో దేశ ఆర్థికవ్యవస్థకు షాక్ ఇచ్చే పెద్దనోట్ల రద్దు అమలులోకి వచ్చింది.

# పెద్దనోట్ల రద్దుకు రెండేళ్ళు

పెద్దనోట్ల రద్దు తర్వాత ఎవరు ఎన్ని రకాల కష్టాలు పడింది వారికి తెల్సు.ఎ.టి.ఎమ్.ల ముందుక్యూలు. బ్యాంకుల ముందు క్యూలు కట్టిన వారి అనుభవాలు ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

డబ్బుండి వాడుకోలేని పరిస్థితి నాడు ఎదుర్కొన్నారు. తను దగ్గర మిగిలిపోయిన పెద్దనోట్లు బ్యాంకులలో కట్టినవారు, కడితే ఏమవుతుందో తెలియక కంగారుపడి దానధర్మాలు చేసినవారు ఉన్నారు.

2016 నవంబరు తర్వాత జరిగిన పలు రాష్ట్ర ఎన్నికలలో నరేంద్రమోడీ నాయకత్వంలోని బి.జె.పి. విజయం సాధించింది.ఫలితంగా పెద్దనోట్లరద్దు ప్రభావం రాజకీయంగా లేదని బిజెపి భావించింది. దాదాపుగా పలువురు నిపుణులు, రాజకీయ ప్రముఖులు కూడా పెద్దనోట్ల రద్దు సమంజసమేనన్నారు.

అలా పెద్దనోట్ల రద్దు జరగాలని కోరుకున్నవారిలో, అసలు ఆ ఆలోచన ప్రధానికి తానే ఇచ్చానని చెప్పుకున్నవారిలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కూడా వున్నారు.

పెద్దనోట్ల రద్దు ఆలోచన ఒక సంస్థ అందించిన సలహా అని ఆ సంస్థని గొప్ప ఆలోచనలు కలిగిన సంస్థగా నాడు కొనియాడారు. ప్రజలు కూడా కొత్త రంగుల నోట్లు, రెండు వేల రూపాయిల నోటుకు అలవాటుపడుతున్నారు. డిజిటల్ లావాదేవీలు బాగా ఊపందుకున్నాయి.

పనిచేయని ఎ.టి.ఎమ్.లను చూసినప్పుడుమాత్రం బ్యాంకులను, ప్రభుత్వాన్ని తిట్టుకుంటున్నారు తప్ప మిగిలిన సమయంలో ఆర్థిక వ్యవహారాలు బాగానే సాగుతున్నాయి. 'అంతా బాగానే వుంది' అనే భరోసా ఏలినవారిలో ఏర్పడింది.

ఫలితంగానే జి.ఎస్.టి.ని అమలులోకి తెచ్చింది. ప్రభుత్వానికి ఆదాయం పెరిగింది. అమ్మకపు పన్ను కట్టేవారి సంఖ్య పెరిగింది. 'నిజాయితీతో వ్యాపారం' అనే నినాదం పుంజుకుంది.

దీనితో మోడీ కొత్త ఆర్థికవిధానాలు మరింత ముందుకు తీసుకువెళ్ళాడన్నారు. 'మోడీనామిక్స్' అనే కొత్త పదం ప్రచారంలోకి తెచ్చారు కూడా.

తాను తీసుకున్న నిర్ణయం దేశానికి మేలుచేస్తుందని ప్రధాని మోడీ ప్రజలకు చెప్పారు. నలభై రోజుల పాటు ఇబ్బందులుంటాయని, దయచేసి భరించమని విజ్ఞప్తి చేశారు. 2017 జనవరి 1కల్లా అన్ని సర్దుకుంటాయన్న నరేంద్రమోడీ హామీని ప్రజలు విశ్వసించారు. జాతి మేలుకోసం తమ వంతుగా కష్టాలు ఎదుర్కొంటామన్నారు. అందుకే ఇప్పుడు జాతికి కలిగిన మేలు ఏమిటన్న ప్రశ్న వస్తున్నది.

ఒకవైపు దేశంలో ఎన్నికలవాతావరణం వేడి అందుకుంటున్నది. పాలిత, ప్రతిపక్షాలు రెండూ ప్రజలలోకి వెళ్ళేందుకు అనువైన అంశాలను వెతుక్కుంటున్నారు. సరిగా ఆ సమయంలో రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఆర్.బి.ఐ.) పెద్దనోట్ల రద్దు విషయంమీద విడుదల చేసిన నివేదిక విడుదలైంది.



సోషల్ మీడియా ప్రభావంవల్ల యుద్ధ విమానాల పైలెట్లు కూడా నిద్రకు దూరమై వారి సామర్థ్యం క్షీణిస్తోంది. -ఎయిర్ చీఫ్ మార్షల్ ధనోవా, భారత వైమానికదళాల చీఫ్

ఇప్పుడు ఆ నివేదిక ఆధారంగానే 'మోడీనామిక్స్' గురించి ప్రశ్నలు సంధిస్తున్నారు. 2019 ఎన్నికలకు వెళ్ళే వేళ నరేంద్రమోడీ సమాధానం చెప్పవలసిన అంశాలు పెరుగుతున్నాయి. ప్రజల మధ్య చర్చకు నరేంద్ర మోడీ ఆర్థికవిధానాలు వస్తున్నాయి.

ఇటీవలికాలంలో అదుపు లేకుండా పెరుగుతున్న పెట్రోల్, డీజిల్ ధరలు, పతనమవుతున్న రూపాయి అంశాలు ప్రజలలోకి బాగా చేరుకున్నాయి.

కాబట్టి నేటివరకు మోడీ ప్రభుత్వం అనుసరించిన ఆర్థికవిధానాలన్నీ చర్చలో భాగం అవక తప్పటం లేదు. ఆ వరసలోనే పెద్దనోట్ల రద్దు అంశం ముందు నిలుస్తున్నది.పెద్దనోట్లరద్దు అనే ఒకకీలక నిర్ణయం తీసుకునేముందు సరైనచర్చ జరిగిందా,

సంప్రదింపులు వివిధ స్థాయిలో జరిగాయా! రద్దు ఫలితం ఎలా వుంటుంది! రద్దు నిర్ణయం తర్వాత వచ్చే అంశాలను ప్రభుత్వం పరిగణనలోకి తీసుకుందా! అనే అంశాలమీద సరైన వివరణ లేదు.

ఆర్థికమంత్రికి కూడా తెలియకుండా ఈ రద్దు నిర్ణయం జరిగిందన్న ఊహాగానాలు వచ్చాయి. అది మంత్రివర్గ నిర్ణయం కాదని విమర్శ వచ్చింది.ప్రధానమంత్రి కార్యాలయమే మొత్తం వ్యవహారం నడిపిందన్న కథనాలూ వినిపించాయి.

ఆ అంశాలన్నీ పక్కనపెట్టినా పెద్దనోట్ల రద్దు నిర్ణయం ద్వారా సాధించాలనుకున్నది సాధించారా! అనే ప్రశ్న మాత్రం వెంటాడుతూనే వుంది.

రెండేళ్ళక్రితం పెద్దనోట్ల రద్దు నిర్ణయం ప్రకటన వేళ ఆ నిర్ణయం వెనుక మూడు లక్ష్యాలను మోడీ ప్రకటించారు.అందులో ఒకటి నల్లధనంమీదఅదుపు సాధించడం. అప్పటికి దేశంలో చలామణి అవుతున్న నల్లధనం తిరిగి ఆర్థికవ్యవస్థలోకి తీసుకురావటం.

రెండవలక్ష్యం భారతదేశంలోకి అదుపు లేకుండా వస్తున్న నకిలీనోట్లను ఏరిపారేయుటం.ఆ సమయంలో చైనా సహకారంతో పాకిస్తాన్ భారతదేశ కరెన్సీని ముద్రించి ఆ నకిలీనోట్లను బర్మా, నేపాల్, బంగ్లాదేశ్‌లోకి ప్రవేశ పెడుతున్న విషయం వాస్తవం.

కొత్తనోట్లను తేవటంద్వారా ఆ నకిలీనోట్లప్రవాహం ఆపగలమన్నది నాటి ఆలోచన. ఇక మూడవది దేశంలో పేట్రేగిపోతున్న ఉగ్రవాదులకు అది మాహోయిస్తు

లైనా, మతఛాందసవాదులైనా, నిధులు సరఫరా ఆగిపోయేలా చెయ్యగలం అనుకున్నారు.

2016 నవంబరు నాటికి దేశంలో 17.97 లక్షల కోట్ల కరెన్సీ అందుబాటులో వుండగా అందులో దాదాపుగా 86 శాతం పెద్దనోట్ల రూపంలోనే వుంది. ఇది ఆర్థికవ్యవస్థకు మంచిదికాదు. ఐనా నాటి యు.పి.ఎ. ప్రభుత్వం, రిజర్వ్‌బ్యాంక్ విధానాలు అటువంటి పెద్ద నోట్ల ముద్రణని ప్రోత్సహించాయి.

పెద్దనోట్లరద్దు చర్యద్వారా కనీసం 3-4 లక్షల కోట్ల నల్లధనం పట్టుకోగలమని భావించారు. కాని భారతీయులు చాలా మదుపరులని,వారికి అన్నిరకాలుగా అండగా నిలిచే సి.ఎ.లు, బ్యాంక్ అధికారులు వుంటారని, ప్రభుత్వంలో పైస్థాయివారు ఊహించనిది కిందిస్థాయిలో జరుగుతాయని అనుకోలేదు.

పెద్దనోట్ల రద్దు నిర్ణయం ప్రకటన ప్రారంభ సమయంలో చాలామంది వణికిన మాట వాస్తవం. తమ దగ్గరున్న నల్లధనాన్ని ఎలా వదిలించుకోవాలా! అని కంగారుపడ్డారు. నదుల్లో వదిలేసినవారు, చెత్తబుట్టల్లో పడేసినవారున్నారు.

కాని అది గోరంత మాత్రమేనని ఇప్పుడు రిజర్వ్ బ్యాంక్ లెక్కలు చెపుతున్నాయి. రద్దు చేసిన పెద్ద నోట్లలో 99.3 శాతం నోట్లు ఆర్.బి.ఐ.కి చేరాయి.ఇంకా ఆ నోట్లలెక్కింపు,లెక్కించిన నోట్లను ధ్వంసం చెయ్యటంలో బ్యాంక్‌లు ఇప్పటికీ బిజీగానే వున్నాయి.

ఈలోగా కొత్తనోట్ల ముద్రణ, వాటిరవాణా, కొత్తనోట్ల సైజులకు తగినట్టు ఎ.టి.ఎమ్. మిషన్లను సరిదిద్దటం ఇవన్నీ కలిపి కేంద్రంమీద భారీ భారమే పడింది. కొత్త నోట్లను ప్రజలకు అందకుండా ఎగరేసుకుపోయిన బడాబాబులు, వారికి సహకరించిన బ్యాంక్ ఉన్నతాధికారుల వివరాలు పూర్తిగా బయటకు రావాల్సివుంది.

డబ్బు దగ్గరికి వచ్చేసరికి జాతీయ, సామాజిక ప్రయోజనాలకన్నా వ్యక్తిగత స్వార్థానిదే పైచేయి అయింది. అలా అయితీరుతుందన్న 'చిన్న లాజిక్'ని ప్రధాని నరేంద్రమోడీ ప్రభుత్వం ఎలా 'మిస్' అయిందో అర్థంకాదు. వెరసి నల్లధనం అనేది ఎక్కడ అనే ప్రశ్న మిగిల్చింది. సమాజంలో వున్న పెద్దనోట్లన్నీ రిజర్వుబ్యాంక్‌కి చేరింది.

ఆ డబ్బు 'ఎవరు కట్టారు, ఎంత కట్టారు, ఎలా కట్టారు' అనేవి తేల్చే యత్నం చేస్తే నల్లడబ్బును గుర్తించవచ్చు. కాని అది అంత త్వరగా తేలే విషయం కాదు. కాబట్టి ఇప్పుడు బడాబాబుల దగ్గరున్న 'నల్లధనం'అధికారికంగా చట్టబద్ధధనం అయిపోయింది. ఆ లెక్కలు తేల్చి అసలు దొంగలను పట్టుకునే వీలు ఉందా! అది ఎప్పటికీ సాధ్యమవుతుందనేది సందేహమే. అయితే ఈలోగా ఆర్థికవ్యవస్థమీద దెబ్బ పడిందన్నది నిపుణుల అభిప్రాయం.

2016 నాల్గవ త్రైమాసికం నుండి వృద్ధిరేటు అలా పడిపోవటానికి కారణం పెద్దనోట్ల రద్దేనన్నది ఒక అభిప్రాయం. ఇప్పుడు 2018 తొలి త్రైమాసికంలో తిరిగి వృద్ధిరేటు 8.2 శాతంగా నమోదు అయింది.

సహజంగా ప్రతి త్రైమాసికంలో 8 శాతం తగ్గకుండా వృద్ధిరేటు సాగిపోతున్న సమయంలో హఠాత్తుగా పెద్దనోట్లరద్దు నిర్ణయం తీసుకుని తాను పెట్టుకున్న ప్రగతి లక్ష్యాలను తానే నరుక్కున్నట్టుఅయ్యింది. నరేంద్రమోడీ ప్రధానిగా బాధ్యతలు చేపట్టిన తర్వాత దృష్టి మొత్తం ఆర్థికరంగ ప్రగతిమీదే కేంద్రీకృతమైంది. దేశం వేగంగా ఆర్థిక అభివృద్ధి సాధిస్తే ప్రజలందరికీ అన్ని రకాల సౌకర్యాలు సమకూరుతాయన్న నమ్మకం నరేంద్రమోడీది.

దానికి అనుగుణంగానే 2014-15, 2015-16 ఆర్థిక సంవత్సరాలలో మోడీ ముందుకు వెళ్ళాడు. అది అలాగే కొనసాగితే మోడీ ఆశించిన రెండంకెల వృద్ధిరేటు రెండేళ్ళక్రితమే సాకారం అయివుండేది. కాని వృద్ధిరేటు మందగమనం వెనుక పెద్దనోట్ల రద్దు నిర్ణయం వుందన్నది అంచనా.

పెద్దనోట్ల రద్దువల్ల జి.డి.పి. కనీసం 2 శాతం వెనక్కిపోతుందని నిపుణులు నాడు హెచ్చరించారు.

- హఠాత్తుగా తీసుకున్న నిర్ణయం
- సంవత్సరంపాటు ఆర్థికవ్యవస్థ కుదేలు
- నల్లధనం గుర్తింపు కుదరలేదు
- సామాన్యులకు కష్టాలు మిగిలాయి

ఆ అంచనాని నాడు ప్రధాని నరేంద్రమోడీ ఆయన మంత్రివర్గ సభ్యులు తోసిపుచ్చారు. కాని నిపుణులు చెప్పినట్టు రెండు శాతం కాకపోయినా ఎంతో కొంత తక్కువగా అయినా నష్టం వాటిల్లింది.

కొంతమంది విశ్లేషకులు చెపుతున్నంత ఘోరంగా కుటుంబాలను వీధిన పడేయటం అనేది పెద్దనోట్ల రద్దు చేయలేదు. కాని సజావుగా సాగుతున్న వారి వ్యాపారాలు, వాణిజ్యాలు, ఉత్పత్తుల అంచనాలు తారుమారయ్యాయి. చిన్న, మధ్యతరహా పరిశ్రమల వారు ఆ దెబ్బను అనుభవించాల్సివచ్చింది.

మధ్య, చిన్నతరహా పరిశ్రమలు మూతపడ్డాయి. తిరిగి కోలుకున్నప్పటికీ ఆ సమయంలో వారికి తగిన షాక్, నష్టంనుండి బయటపడటానికి ఇంకా కొంత సమయం పడుతుంది. దేశంలో చలామణి అవుతున్న 'నల్లధనం'నిజానికి కరెన్సీరూపంలో చాలా తక్కువగా వుందన్నది ఒక అంచనా.

కరెన్సీ రూపంలో 5 శాతానికి మించివుండదని మిగిలినదంతా బంగారం, భూములు, ఇతర స్థిరాస్తుల రూపంలో వున్నాయని, అందునా అధికశాతం 'నల్లధనం' విదేశాలకు తరలించబడిందని,

అటువంటి 95శాతం 'నల్లధనాన్ని' వెంటాడి పట్టుకోవాల్సింది పోయి కేవలం ఆ 5 శాతానికి చెందిన కరెన్సీ కోసం పెద్దనోట్ల రద్దు వంటి భారీ బాంబు పేల్చాల్సిన అవసరం వుందా అన్నది ప్రశ్న.

చూరులో వున్న ఒక ఎలుకను చంపేందుకు ఇంటి మొత్తానికి నిప్పుపెట్టుకున్నట్టుగా వుంది ఈ పెద్దనోట్ల రద్దు. నాడు ప్రకటించిన రెండవ లక్ష్యం నకిలీ కరెన్సీని నిలువరించటం. ఈ అంశంలో కొంతమేర విజయం సాధించినట్టే.

అయితే వెలుగులోకి రాని నకిలీ కరెన్సీ నిషేధిత సంస్థల దగ్గర వుందన్నది నిజం. కొత్త నోట్ల ముద్రణ విషయంలో తీసుకున్న జాగ్రత్తలు, పొందుపరిచిన భద్రతా అంశాలవల్ల నకిలీ కరెన్సీ బెడదను నివారించగలిగారు. దేశ ఆర్థికవ్యవస్థతో ఆటలు ఆడుతున్న నకిలీ కరెన్సీని నిలువరించటం విజయమే.

మూడవ లక్ష్యంగా పెద్దనోట్లరద్దుతో ఉగ్రవాద, తీవ్రవాద సంస్థల చర్యలను తగ్గించగలమన్నారు.పెద్దనోట్లను రద్దుచేసిన వెంటనేకాశ్మీర్ లోయలో రాళ్ళు రువ్వటాలు ఆగిపోయాయి.

కాశ్మీర్‌లో వేర్పాటు ఉద్యమం 'కిరాయి ఉద్యమం' అనేది వాస్తవం. గంటకు ఇంత అని ఇచ్చిభద్రతాదళాలపైకి ఉసికొల్పుతున్నారు. అటువంటి అల్లరిమూక లను అడ్డుకోవటం సాధ్యమైంది.

కేవలం నాల్గుసరిహద్దురాష్ట్రాలలో మాత్రమే అల్లరి మూకలు ఇంకా తోకలు జాడిస్తున్నాయి. అవి కరుడుకట్టిన మతఛాందసవాదుల నేతృత్వంలో నడుస్తున్న హింసాత్మక ఉద్యమాలు. వాటిని మరోమార్గంలో ఆపాల్సివుంటుంది.

వారికి నిధులసరఫరా ఇప్పటికీ జరుగుతూనే వుంది. పెద్దనోట్ల రద్దు తర్వాత కరెన్సీ వాడకాన్ని తగ్గించి డిజిటల్ లావాదేవీలు ప్రోత్సహించాలన్నారు. ఆవిషయంలో కొంతమేర విజయం సాధించారు.

ఇప్పుడు చాలావరకు కార్డుద్వారా చెల్లింపులు జరుగుతున్నాయి. 'జనధన్ యోజన' ద్వారా బ్యాంకులను సామాన్య ప్రజలకు దగ్గర చేయగలిగారు.

బ్యాంక్ ఎకౌంట్ కలిగినవారి సంఖ్య 79 శాతానికి పెరిగింది గత నాలుగేళ్ళలో.

బ్యాంకులలో జారీ అయ్యే క్రెడిట్, డెబిట్ కార్డుల సంఖ్య భారీగా పెరిగాయి. కాని అదే సమయంలో దేశంలో కరెన్సీ డిమాండ్ భారీగా పెరగటం గమనించారు. పెద్దనోట్లరద్దువల్ల మంచి తక్కువ నష్టం ఎక్కువ జరిగిందనేది ఒక వాదన కాగా, నష్టం ఏమో కాని అస్సలు లాభమేమీ లేదన్నది మరో వాదన.

ఆర్థికవిధానాల రూపకల్పనలో ఆర్థికశాఖ విఫలమైందని, బి.జె.పి వారికి ఆర్థిక అంశాలమీద పట్టు లేదని విమర్శలు వస్తున్నాయి.

తాము తీసుకున్న నిర్ణయాన్ని ఆత్మవిశ్వాసంతో సమర్థించుకున్నట్టుగా ప్రభుత్వం కనిపించదు. అలాగని అది తప్పు నిర్ణయమని అంగీకరించటంలేదు. రాజకీయ వాదోపవాదాలు ఇలాగే వుంటాయని ప్రభుత్వం అనుకోవచ్చు. నీటికి సమాధానంకోసం ఎన్నికల ప్రచారంలో వేడి పెరిగి తీరుతుంది.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు





# మనిషికో మూడ్

కుటుంబంలో అయినా, సమాజంలో అయినా, దేశాల మధ్య అయినా ఘర్షణ వాతావరణానికి కారణం భిన్నాభిప్రాయాలు. అన్ని రకాల మానవ సంబంధాలలో ఈ అభిప్రాయాల గొడవ వుండి తీరుతుంది. ఇద్దరు స్నేహితులు, తోడబుట్టినవారు, కలిసి కాపురంచేసేవారు... ఇలా ఇద్దరి మధ్య బంధం ఎటువంటిదైనా వారందరిలో ఒకేలాంటిఅభిప్రాయాలు వుండితీరతాయనిలేదు.

ఏదో ఒక విషయంలో తేడాలు సహజంగా వస్తాయి. ఒకేరంగు డ్రెస్‌లు అక్కాచెల్లెళ్ళకునచ్చవు. అన్నదమ్ములు ఒకలాంటి హెయిర్‌స్టైల్స్‌ని అంగీకరించలేరు. చదువులు, ఉద్యోగాలు, వివాహం, సంసారం ఇలా ప్రతిదానిలో ఎవరి ఆలోచనలు వారివి. ఇది చాలా సహజమనే విషయం అర్థంచేసుకోనప్పుడే సమస్యలు వస్తాయి.

## వాదనలు వద్దు

మనిషి తత్వంలోనే ఒక ప్రత్యేకత వుంది. ప్రతి అంశంమీదా తనకంటూ ఒక అభిప్రాయం ఏర్పరుచుకుంటారు. ప్రతిదానిమీదా తన అభిప్రాయం చెప్పాలనుకుంటాడు.అంతవరకు అభ్యంతరంలేదు. కాని తన అభిప్రాయమే చివరిదనిగాని, దానిని మిగిలిన వారందరూ అంగీకరించి తీరాలనిగాని అనుకుంటే చిక్కులు మొదలవుతాయి.

అలాగని ఒకరి అభిప్రాయం మిగిలిన వారిమీద రుద్దబడే సందర్భమే వుండదనుకోవటం పొరపాటే. క్లాసులో టీచర్ అభిప్రాయమే ఫైనల్. ఆఫీసులో బాస్ మాటకు తిరుగుండదు. భిన్న అభిప్రాయం వున్నా వ్యక్తీకరించే అవకాశం లేక తలవంచుకుని పనిచేయాల్సిన పరిస్థితి వస్తుంది.

అయితే మనసులో ఏదో ఒక మూల తనమాట చెల్లలేదే అనే బాధ వేధిస్తూనే వుంటుంది.

తగిన అవకాశం వచ్చినప్పుడు తిరగబడే యత్నం చేస్తారు. దీంతో నాటివరకు దాచుకున్న అభిప్రా

## రాజీ సాధ్యమే

ఇద్దరికీ ఒకే రకమైన అభిప్రాయం లేకున్నా వాటి వల్ల అంతగా ప్రమాదం రాని విషయాలు కొన్ని వుంటాయి. వీటిని రాజీపడదగిన అంశాలుగా చెప్పాలి. భార్యాభర్తల మధ్య చాలా విషయాలలో ఇటువంటి రాజీతోనే జీవితం నడుస్తుంది.

నాకునచ్చినదే కొనాలన్న పట్టుదలచూపరు. కొన్ని ఒకరిఇష్టప్రకారం నడుస్తాయి, మరికొన్ని రెండవవారి ఇష్టాన్నిబట్టి వెళతాయి.ఇవి ఏమేరకు ఎవరికి నచ్చినవి అంగీకారమవుతాయి అనేది ఆ యా జంటలు ఇచ్చిపుచ్చుకునే ధోరణినిబట్టి వుంటాయి.

షాపింగ్‌కి వెళ్ళినప్పుడు భార్యకు గులాబీరంగు కర్టెన్స్ నచ్చి, భర్త నీలంరంగు కర్టన్స్ బాగుంటాయని అన్నప్పుడు వారిద్దరూ ఆ విషయంలో పట్టుదలకు పోరు. ఆ రెండు రంగులు కలిపితే వచ్చే ఎరుపురంగు కర్టెన్స్ కొనటం పరిష్కారంగా అనుకోరు.

కొంత చర్చ తర్వాత 'సరే నీకు నచ్చినదే కొను' అంటూఎవరోఒకరు వెనక్కితగ్గుతారు లేదా ఒకగదికి ఒకరు ఇష్టపడిన రంగు కర్టెన్స్ కొంటే మరోదానికి రెండవవారికి నచ్చిన రంగుని కొనుక్కుంటారు.

తద్వారా ఎవరికీ నష్టం లేదు, ఇద్దరికీ ఆనందం కలుగుతుంది. మనకు తెలియకుండానే ఈ రాజీ మనస్తత్వం అలవడుతుంది. తోడబుట్టినవారితో రాజీపడే అంశాలు చాలా వుంటాయి. పిల్లలకోసం పెద్దలు, తల్లిదండ్రులకోసం పిల్లలు రాజీపడటం అనేది చాలా చాలా సహజమైన అంశం.

రాజీపడుతున్నామని తెలియకుండానే అవతలి వారికోసం వెనకడుగు వెయ్యటం అనేది ఒక గొప్ప విషయం.సర్దుబాటు లేకుండా ముందడుగు పడదన్న పాఠం ఒకవయసులో నేర్చుకుంటారు ప్రతి ఒక్కరూ. ప్రతిరోజూ సర్దుకుపోయే అంశాలు లెక్కలేనన్ని.

తినే ఆహారం విషయంలో, చూసే టీ.వీ. కార్యక్రమాలలో, వెళ్ళే సినిమాల విషయంలో, హాబీల విషయంలో ఎవరో ఒకరు రెండవవారి మాటకు విలువ ఇస్తారు. ఇందులో గెలుపు ఓటముల ప్రశ్నే వుండదు. ఒకసారి ఒకరి మాట ప్రకారం జరిగితే, మరోమారు రెండవవారి మాటనుబట్టి వెళతారు.

ఒకరినొకరు ఆనందంగా చూడాలనుకునే భావనతో జీవితాన్ని నెట్టుకువస్తారు.దంపతుల విషయంలోనే కాదు, స్నేహితులతో, కొలీగ్స్‌తో కూడా ఇటువంటి రాజీధోరణిని ప్రదర్శిస్తాం.

అయితే తాను అధిక సందర్భాలలో రాజీపడాల్సి వస్తుందన్న భావం మనసులో ఎవరికైనా ఏర్పడితే అప్పుడు ఇబ్బందులు మొదలవుతాయి. అటువంటి భావన రానంతవరకు తన ఇష్టాన్ని పక్కనపెట్టటం అనేది హాయిగా చెయ్యగలరు.

## పంతం పట్టకూడదు

వ్యక్తిగత సంబంధాలను దెబ్బతీస్తాయి భిన్నాభిప్రాయాలు. నేను అనుకున్నదే జరిగితీరాలన్న అభిప్రాయం ఒకరిలో వుంటే, రాజీపడను అని భీష్మించుకుంటే ఏ ఇద్దరి మధ్య అయినా ఘర్షణవాతావరణం తప్పదు. అటువంటి పంతాలకుగనుక పోతే సమస్యలకు పరిష్కారమే లభించదు.

చాలా కుటుంబాలలో భార్యాభర్తల మధ్య రాజీకి పెద్దలు రంగప్రవేశం చేస్తారు.వాస్తవంలో కొత్త సంసా



Courtesy : 32

యాన్ని ఒక్కసారిగా కసిగా, గట్టిగా వినిపిస్తారు.

సాధారణంగా ఒకచోటకలిసి వున్నప్పుడు ఒకవిధమైన పెత్తనం, పెద్దరికంలేనప్పుడు భిన్నాభిప్రాయాలు సహజంగా తలెత్తుతాయి. భిన్నాభిప్రాయాలనేవి జీవితంలో అంతర్భాగం.

అవి అంగీకరించాలి, ఎదుర్కోవాలి. ఆ భిన్నాభిప్రాయాలను సంబంధాలు దెబ్బతినని రీతిలో పరిష్కరించుకోవటంలోనే అసలు నేర్పువుంటుంది.

అసలుభేదాభిప్రాయాలు తలెత్తకుండానే ముందుగానే వాటిని తప్పించుకోవటం అనేది ఒక పద్ధతి.

చాలాసార్లు ఆ అవకాశం ఉండదు. కొన్నిసార్లు ఆ భేదాభిప్రాయాలు ఒకదశకు చేరిన తర్వాత రాజీమార్గం అన్వేషించటం మరో రకమైనది.

ఇక తెగేదాకా లాగటం అనే పద్ధతి కొందరు పాటిస్తారు. అది అంత మంచిదా! అనే సందేహం ఆ తర్వాత కలుగుతుంది. అయితే భిన్నాభిప్రాయాలు సహజమని, అందులోకొన్ని రాజీకి అతీతమైనవనే విషయం అర్థంచేసుకోవాలి.

అటువంటి అంశాలమీద అసలు వాదనలు తలెత్తకుండా చూసుకోవటం మంచిది.

రం పెట్టించటానికి పెద్దలు తోడుగా వచ్చేది అందుకే. పంతాలకు పోకుండా రాజీకి రావాల్సిన అవసరం.

రాజీకివచ్చే మార్గాలను పెద్దలు తొలినాళ్ళలో నేర్పిస్తారు. ఎదుటివారి ఆలోచనలను గౌరవించటం, ఎక్కడతగ్గాలో తెలుసుకోవటం అనేవి మానవసంబంధాలలో కీలకపాత్ర పోషిస్తాయి.

ఇప్పుడు పెద్దలపాత్రను వివాహసంబంధాల నిపుణులు తీసుకుంటున్నారు. తాము పరిష్కరించుకోలేని అంశాలకోసం వారి సూచనలకు వెళ్ళటంలో తప్పు లేదు. అయితే నిపుణులు ఇచ్చే సూచనలను పాటించగలిగిన మానసిక సంసిద్ధతవుండాలి.

ఒక్కరే తీసుకోవాల్సిన నిర్ణయాలు కొన్ని వుంటాయి. ఆ విషయం దంపతులు అర్థంచేసుకోవాలి. దంపతులందరికీ వర్తించేఫార్ములా ఒక్కటే కాదు. వారివారి విద్యార్హతలు, ఉద్యోగాలు, ఆర్థికస్థాయి, తెలివితేటలనుబట్టి ఎవరికి ఎందులో నైపుణ్యం వుందనేది అర్థమవుతుంది.

ఒకరు మెరుగ్గా ఆలోచించగలరు అనే అభిప్రాయం రెండవవారికి కలిగినప్పుడు ఆ విషయాలు వారికి వదిలివేయటం అవసరం. ఇది చాలా సంసారాలలో జరిగేదే. చాలా చాలా విషయాల్లో భార్య మాటే ఫైనల్‌గా వుంటుంది.

ఆ విషయం అంగీకరించటానికి భర్తకు అహం అడ్డురాదు. అదే విధంగా కొన్ని విషయాలలో నిర్ణయాన్ని ఆమె మనస్ఫూర్తిగా వదిలేస్తుంది. ఇటువంటి ఏకాభిప్రాయం వారి సంసారాన్ని హాయిగా నడిపిస్తుంది. మనం తీసుకునే నిర్ణయాలలో కొన్ని దీర్ఘకాల ప్రభావం చూపేవి అయివుంటాయి.

కొన్ని తాత్కాలిక ప్రభావం కలిగివుంటాయి.కొన్ని నిర్ణయాలు తిరిగి మార్చుకోటానికి వీలులేనివి. మరి కొన్ని ఆ తర్వాత మార్చుకోగలిగినవి.

దీర్ఘకాల ప్రభావం చూపేవి,మార్చుకోటానికి వీలులేని అంశాలమీద దంపతులిద్దరూ వాదోపవాదాలు, పట్టుదలలకన్నా సంప్రదింపులద్వారా ముందుకు తీసుకెళ్ళటం అలవరచుకోవాలి.

ఒకరు సొంతంగా తీసుకున్న నిర్ణయంవల్ల కొన్ని సందర్భాలలో నష్టం కలగవచ్చు.

ఎదురుదెబ్బలు తగలవచ్చు. ఒకసారి ఒక అభిప్రాయానికి వచ్చాక తర్వాత ఇక ఆ అభిప్రాయాన్ని ఇద్దరూ మనస్ఫూర్తిగా అంగీకరించి, అమలుచేయటం ఏ రకమైన బంధంలో అయినా అవసరం. దాంపత్య బంధంలో అది మరింత ముఖ్యం.

## ఇతరులు గుర్తించేస్థాయి

అభిప్రాయ భేదాలు చాలా సహజం. అందుకు మూలం ఒక రకంగా అహం.

నా అభిప్రాయమే గొప్పదన్న భావన. అవతలి వారంతా నాకు లొంగివుండాలన్న కోరిక.

నిజానికి అన్ని అభిప్రాయాలూ పోరాటం చేసుకోవాల్సినంత గొప్పవి కానేకాదు.

ఆ అభిప్రాయం అంత విలువైనది కాదు కాని ఆ అభిప్రాయం మనిషిని మూర్ఖుడిని చేస్తుంది. రాజీపడవద్దని ప్రోత్సహిస్తుంది.

మనం సృష్టించిన అభిప్రాయం పని పరిధిలో వుండాలి. మనంచెప్పినట్లు వుండాల్సిందిపోయి, అభిప్రాయం మనిషిని ఆడించే స్థితికి రావటంవల్లనే ఈ తంటాలన్నీ అన్న అభిప్రాయం అభిప్రాయమే.

అంటే అది ఒక ఆలోచన మాత్రమే. అది వాస్తవం కాదు. అదే చివరి దశ కాదు.

ఒక అభిప్రాయంవిలువైనదిగా ఇతరులుగుర్తించే స్థాయిలో వుండాలి. అంతేకాని ఆ అభిప్రాయం చాలాగొప్పది అని వాదించాల్సిన అవసరం లేదు. విలువైన, మేలయిన అభిప్రాయాన్ని ఎవరయినా అంగీకరించక తప్పదు. ఆ స్థాయికి మన ఆలోచనా ధోరణిని తప్పనిసరిగా తీసుకువెళ్ళాలి.

అవతలివారిది పనికిమాలిన అభిప్రాయం అని వెనువెంటనే, అప్పటికప్పుడు వాదనతో నిరూపించాలనుకోవద్దు. వారి అభిప్రాయంలోని లోపాన్ని వీలైనంత ప్రశాంతంగా, ఎదుటివారి మనోభావం దెబ్బతినకుండా ఎత్తిచూపగలిగిన నేర్పు సాధించాలి.

అప్పుడు మీ వ్యక్తిత్వం మరింత గొప్పగా ఎదుగుతుంది. అభిప్రాయభేదాలకు భయపడి అసలు ఏ విషయంలోనూ నా సొంత అభిప్రాయం చెప్పను, నాకంటూ ఒక అభిప్రాయం ఏర్పరచుకోను అనే ఆలోచన తప్పు. అభిప్రాయాలనేవి బలవంతంగా ఆపితే ఆగవు. అసలు రాకుండా వుండవు.

నేర్చుకోవాల్సింది ఆ అభిప్రాయాన్ని వ్యక్తీకరించే విధానం. భిన్నమైన అభిప్రాయం ఎదురైనప్పుడు దానిని పరిశీలించగలిగిన ఓర్పు, నేర్పు ఉండాలి. ఎదుటివారిది మెరుగైన అభిప్రాయమనిపించినప్పుడు దానిని స్వాగతించే విశాల హృదయం ఉండాలి.

రాజీ అంటే ఓటమి కాదు. రాజీపడటం అంటే లొంగిపోవటం కాదు. రాజీలో తర్వాతి గెలుపు నాదే నన్న విశ్వాసంవుంటుంది.

అభిప్రాయాల విషయంలో కూడా అదే గెలుపు సూత్రం. ఘర్షణను తగ్గించి, వ్యక్తిగత అనుబంధాలను మరింత మెరుగు పరచగలిగిన అభిప్రాయాలకు విలువ ఇవ్వటమే జీవితంలో గెలుపుకు కీలకం.

డి.వెంకటేశ్వరరావు

# అంతా రాజకీయమే

## దండోపాయం

శత్రువును లొంగదీసుకోవటానికి కె.సి.ఆర్. తన రాజకీయ ప్రత్యర్థులమీద ఎడాపెడా కేసులు తొవ్విపెడుతున్నాడు. తన ఎమ్.ఎల్.ఎలు బలహీనంగా వున్న నియోజకవర్గాలు చాలావున్నాయి.

2014లో ఉద్యమ ఊపులో గెలిచారు వారిలో చాలామంది. ఆ తర్వాత దండుకోవటం తప్పించి సేవచేసింది ఏమీ లేదు. అదే చోట్ల ఇతర పార్టీల నేతలూ బలంగా వున్నారు.

వారు ఈసారి టి.ఆర్.ఎస్‌ని ఓడించగలరు. అందువల్ల అటువంటివారిని దండోపాయంతో నియోజకవర్గంలో తిరగకుండా చేస్తే తప్పించి తన ఎమ్.ఎల్.ఎలను గెలిపించుకోలేడు.

అందుకే వారిమీదున్న పాత కేసులు తిరగతోడి, వీలైతే అరెస్టు చెయ్యమన్నది ఉత్తర్వు.

వారిని జైలుకు పంపి లేదా కోర్టుల చుట్టూ తిరగాల్సిన పరిస్థితి సృష్టిస్తేగాని తన సొంత అభ్యర్థులకు వెసులుబాటు దక్కదు.

అలాగని పూర్తిగా దండోపాయం చేసినా ఆ అభ్యర్థులు గెలవగలరా! అనే సందేహం ఆపద్ధర్మ ముఖ్యమంత్రి కె.సి.ఆర్. మనసులో లేకపోలేదు. నామినేషన్ రోజు బిఫార్మ్స్ ఇచ్చేటప్పుడుగాని అసలు అభ్యర్థులు ఎవరో తెలియదు. ◆

## ప్రత్యక్షంగా పి.కె.

ఇంతకాలం రాజకీయ నాయకులకు ఎత్తుగడలు చెపుతూ తెర వెనుక చక్రం తిప్పిన సలహాదారులు కొందరు తామే నేరుగా ఎన్నికల్లోకి దిగటానికి నిర్ణయించుకున్నారు.

అందుకే చాలా కాలంగా పలు పార్టీలకు ఎత్తుగడలు నేర్పిన ప్రశాంత కిషోర్ (పి.కె.) ఇప్పుడు ప్రత్యక్ష రాజకీయాల్లోకి వచ్చేశాడు. మొదట బి.జె.పికి, ఆ తర్వాత నితీష్‌కుమార్‌కి, ఆపైన కాంగ్రెస్, ఇప్పుడు వై.కా.పాకి ఎన్నికల ఎత్తుగడల నిపుణుడిగా పనిచేసిన, చేస్తున్న పి.కెకి రాజ్యసభ సభ్యత్వంమీద చాలా ఆశలుండేవి.

కాని ఏ పార్టీ అతని కోరికను ఎందుకోగాని మన్నించలేదు. ఇలా కాదని ఇప్పుడు నేరుగా నితీష్‌కుమార్ పార్టీ జె.డి.(యు)లో చేరాడు.

తన సొంత జిల్లా అయిన బక్సర్ నియోజకవర్గంనుండి జె.డి.(యు) అభ్యర్థిగా నిలబడటానికి ఒప్పించాడు పార్టీని. ఇక తన సొంత గెలుపుకోసం ఎటువంటి ఎత్తుగడలు వేస్తాడో పి.కె. ◆

## ప్రముఖులుంటేగాని

2019 లోక్‌సభ ఎన్నికలు బి.జె.పికి కీలకం. తిరిగి ప్రభుత్వం ఏర్పాటుచెయ్యలేకపోతే మిగిలిన పార్టీలన్నీ కలసికట్టుగా రెచ్చిపోయి అమిత్‌షా, నరేంద్రమోడీ మీద విరుచుకుపడతాయి.

అందుకే ఈ ఎన్నికలు ఎంత ముఖ్యమో తెలిసిన అమిత్‌షా కేవలం పార్టీ కార్యకర్తలే సరిపోరని, ఇతర రంగాలలో ప్రముఖులు ముఖ్యంగా గ్లామర్ రంగానికి సంబంధించినవారు ప్రచారానికి, అభ్యర్థులుగా అవసరమని భావించారు.

ఇప్పటికే చాలామంది సినీతారలను తమ పార్టీ ప్రచారకర్తలుగా ఒప్పించారుకూడా.

గతంలో వున్న హేమమాలిని, పరేష్ రావల్ వంటివారికి జోడీగా మాధురీదీక్షిత్, అక్షయ్ కుమార్, మోహన్‌లాల్,సన్నీడియోల్ వంటి వారందరినీ పార్టీలోకి ఆహ్వానించారు.

వారంతా దాదాపుగా పోటీచేసేందుకు సిద్ధంగా వున్నారు. క్రికెటర్స్‌లో వీరేంద్ర సెహ్వాగ్, గౌతమ్ గంభీర్ వంటివారు భారతీయ జనతా పార్టీకి గట్టి మద్దతుదారులు అయ్యారు.

ఇటువంటి ప్రముఖులు చాలామందిని రంగంలోకి దింపటంద్వారా ప్రచారంలో ముందుకు దూసుకువెళ్ళగలమని బి.జె.పి. భావిస్తోంది. ◆

## కుటుంబ పోరాటం

యు.పి.ఎన్నికలు ఏ పార్టీకైనా కీలకం.2014లో 72 సీట్లు గెలుచుకుంది బి.జె.పి. ఆ తర్వాత జరిగిన ఉపఎన్నికలు అన్నీ ఓడిపోయింది.

ఎస్.పి., బి.ఎస్.పి. వంటి రెండు శక్తివంతమైన సామాజికవర్గ ప్రతినిధ పార్టీలు కలిసి ఆ విజయం సాధించాయి. అయితే ఆ బంధం 2019కి తీసుకువెళ్ళటానికి ఎస్.పి. ప్రథమ కుటుంబంలో పుట్టిన ముసలం అడ్డంకి అయింది.

ములాయంసింగ్ యాదవ్ ఆ పార్టీని పెట్టి, గెలిపించి కొడుకు అఖిలేష్ యాదవ్‌ని ముఖ్యమంత్రిని చేశాడు. సొంత తమ్ముడు శివపాల్ యాదవ్ అలిగి పార్టీకి దూరమైనా ములాయంసింగ్ యాదవ్ లెక్కచెయ్యలేదు. కాని కొడుకు అఖిలేష్ యాదవ్ తండ్రికి, బాబాయికి ఇద్దరికీ ఝలక్‌లు ఇచ్చి పార్టీని సొంతంచేసుకున్నాడు.

దీనితో బాబాయ్ శివపాల్ యాదవ్ సొంత పార్టీపెట్టుకుని,తన అన్న ములాయంకి ఆశ్రయం ఇస్తున్నాను అని ప్రకటించాడు. ◆

## శివభక్త రాహుల్

మధ్యప్రదేశ్‌లో జ్యోతిర్లింగ క్షేత్రాలున్నాయి. వాటినన్నింటినీ చుట్టబెట్టి వస్తున్నారు కాంగ్రెస్ పార్టీ నాయకులు. అయితే కమలనాథ్ ఆ విషయంలో కొంచెం ముందు ఉన్నాడు.

ఇప్పుడు తాజాగా భోపాల్ నగరంలో శివభక్తుడు రాహుల్‌కి సుస్వాగతం అంటూ బోర్డులు పెట్టారు. అంతేకాదు ఇప్పుడు మధ్యప్రదేశ్‌లోని ప్రధాన నగరాలు అన్నింటిలోనూ పలు వ్యాన్లు కూడా తిరుగుతున్నాయి.

వాటిలో ఇటీవల రాహుల్‌గాంధీ మానససరోవర యాత్రగురించిన చిన్న డాక్యుమెంటరీ, శివలింగానికి రాహుల్ గాంధీ అభిషేకం చేస్తున్న వీడియో ప్రదర్శిస్తున్నారు. 'శివభక్తుడు రాహుల్' అంటూ దసరా సమయంలో హోరెత్తించాలన్న నిర్ణయం కాంగ్రెస్ పార్టీ తీసుకుంది.

అయితే కాంగ్రెస్‌లోని ఒక వర్గం అదే సమయంలో శివభక్త రాహుల్ ప్రచారానికి ఆ రాష్ట్రంలోని ముస్లిమ్‌ల స్పందన ఎలా వుందో! అనే అంచనా వేసుకునే పనిలో వున్నారు. ◆

## బాస్ నేనే

బి.ఎస్.పి. నేత 'దళిత ఓటు బ్యాంక్ నాదే... మరెవరికీ దానిమీద హక్కురాదు, హక్కు లేదు' అంటూ స్పష్టంచేసింది. ఆమెను కలుపుకుని దళిత ఉద్యమం తారాస్థాయికి తీసుకువెళ్ళాలని గుజరాత్ కాంగ్రెస్ ఎమ్.ఎల్.ఎ జిగ్నేష్ మేవాని, భీమ్ ఆర్మీ చీఫ్ అజాద్‌లు అనుకుంటున్నారు.

అయితే ఆ ఇద్దరు యువ దళితనేతలను తన దారికి రానటానికి వీలులేదంటున్నది.

భీమ్ ఆర్మీ చీఫ్ అజాద్ 'ఆంటీ మాయావతి' అంటూ ఆమె గుమ్మందగ్గరికివస్తే 'నో ఇంటర్వ్యూ' పొమ్మంది. హింసాత్మక ఉద్యమాలుచేసి జైళ్ళకు వెళ్ళి వచ్చిన నేతలతో నేను ఎటువంటి స్నేహం చెయ్యను వెళ్ళిపో అని కబురుచేసింది.

జిగ్నేష్ మేవానికి దాదాపుగా అటువంటి సమాధానమే ఇచ్చింది. తాను గనుక కొంచెం అవకాశం ఇస్తే తనని నెట్టేసి దళిత ఓటు బ్యాంక్‌ని తన్నుకుపోతారన్న భయం మాయావతిది.

ఎంతో కష్టపడి గంగా తీరంలో నిర్మించుకున్న ఓటు బ్యాంక్ మరెవరికి ఇచ్చేందుకు ఆమె సిద్ధంగా లేదు.కాబట్టే ఆమెతో ఎన్నికల ఒప్పందం కష్టంగా వుంది కాంగ్రెస్‌కి.

# క్యాన్సర్... అంటువ్యాధా... వంశపారంపర్యమా....?



**Dr. Ch. Mohana Vamsy**
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421
**Kurnool : 08518 273001**
**Guntur : 0863 2223300**

తాతయ్యకో, అమ్మమ్మకో, నాన్నమ్మకో లేదా అమ్మ, నాన్నలకో లేదా దగ్గరి కుటుంబ సభ్యులకో 'క్యాన్సర్' అని తెలిస్తే విల విల లాడిపోతారు. అదీ లేట్ స్టేజ్ ఏమి చేయలేని పరిస్థితులు అని తెలిస్తే కుటుంబ సభ్యులకు ఆ సందర్భం నుండి ఆ షాకింగ్ న్యూస్ నుండి తేరుకోవటానికి కొంత సమయం పడ్తుంది. జీవితం మీద వైరాగ్యమూ కల్గుతుంది ఆ తర్వాత డాక్టర్ల కౌన్సిలింగ్‌తో వారి సలహాలతో ఏమి చేయాలో తెలుసుకుని ఇంక మిగిలిన కొంత కాలము క్యాన్సర్‌కు గురయిన వ్యక్తి కొంత సౌకర్యవంతంగా, కొంత ఆనందమయంగా జీవితం గడపాలని శతవిధాల ప్రయత్నిస్తారు. కాని ఆక్రమంలో వారి మనస్సులలోను కొన్ని సందేహాలు బయలుదేరుతూ ఉంటాయి. మరీ ముఖ్యంగా క్యాన్సర్‌కు గురయిన వ్యక్తి పడే బాధలు, ట్రీట్‌మెంట్స్ ఆ ట్రీట్‌మెంట్స్‌తో తలెత్తే ఇతర ఆరోగ్య సమస్యలు, ఇంకా వయస్సు పైబడిన వారయితే వారికి ఇంతకు ముందు నుండి ఉండే ఆరోగ్య సమస్యలు తీవ్రమవ్వటం వీటన్నిటితో రోజురోజుకి ఆ వ్యక్తి ఆరోగ్యం క్షీణించటంతో పాటు మనిషి కూడా బక్క చిక్కి ఎముకలగూడులా తయారయి మరణం ఒడిలో ఒదిగిపోవటం చూసాక కుటుంబ సభ్యులకు వారి జీవితంలో భాగమయిన వ్యక్తిని కోల్పోయ్యామన్న బాధతో పాటు అనేక రకమయిన ప్రశ్నలు, సందేహాలు వాటికి తోడు ఒకింత ఆవేదన కల్గుతూ ఉంటాయి. ఒక్కొక్కసారి ఆహారం, పత్యాలగురించి లేద ఇతర అలవాట్లు, వ్యవహారాల గురించి అర్థంపర్థం లేని సందేహాలతో సతమతమవుతూ ఉంటారు.

ఆ ప్రశ్నలపరంపర ఇలా కొనసాగుతూ ఉంటుంది. దగ్గర ఉండి ఎంతో సేవ చేశాను, అన్నీచూసుకున్నాను, ఏ విధంగానయినా అంటు వ్యాధి కావచ్చా? ఇలా మా కుటుంబాలలో ఇద్దరు, ముగ్గురు క్యాన్సర్ బారిన పడ్డారు, ఈ వ్యాధి వంశపారంపర్యంగా వచ్చే ప్రమాదం ఉందా? సర్జరి తర్వాత కొంతకాలానికి మరణించారు, క్యాన్సర్‌కు కత్తి తగలటం వలన అలా జరిగిందా? వారు ఎక్కువ కాలం బతకరని తెలిసినప్పుడు ట్రీట్‌మెంట్స్ ఎందుకు ఇచ్చారు? వారు చేసే వృత్తి ఏమయినా కారణం అయ్యిందా? లేక ఆహారంలో పత్యం పాటించలేదు అందుకని ఇలా జరిగిందా? ఇలా అంతులేకుండా వారి మదిని ప్రశ్నలు, సందేహాలు కొన్ని అనుమానాలు దాడి చేస్తూ ఉంటాయి.

క్యాన్సర్‌కు ఖచ్చితంగా కారణం ఇది అని తెలియదు కాని ఎన్నో కారణాలకలయిక అని చెప్పుకోవచ్చు. వారి జీన్స్ వాటికి తోడు పర్యావరణ పరిస్థితులు, ఇంకా స్మోకింగ్, ఆల్కహాల్ వంటి అలవాట్లు తోడవ్వటం తీవ్రమయిన మానసిక ఒత్తిడికి గురవుతూ ఉండటం, వయస్సు పైబడటం, శరీరంలో సహజమైన హార్మోన్స్ దీర్ఘకాలికంగా ఉండటం లేదా దీర్ఘకాలకంగా కృత్రిమమైన హార్మోన్స్ తీసుకోవటం, పొగాకు, పొగాకు ఉత్పత్తులు, రబ్బరు ఆస్‌బెస్టాస్ వంటి కంపెనిలలో పనిచేయుటం, వృత్తిపరంగా లేదా ఇతర కారణాలవలన రేడియేషన్‌కు గురికావటం ఇలా ఎన్నో కారణాలలో ఒకటి లేదా రెండు తోడయితే క్యాన్సర్ రావచ్చు. కాని బాధాకరమయిన విషయము ఏమిటంటే ఆరోగ్యంగా ఉంటూ, మంచి జీవన శైలి కలిగి ఉండి, చిన్న వయస్సువారైనా ఎటువంటి రిస్క్ ఫ్యాక్టర్ లేకపోయినా ఈ మహమ్మారి బారిన పడవచ్చు. అందుకనే ఈ వ్యాధికి గురయిన వారు కాని వారి కుటుంబ సభ్యులు ఎవ్వరినో లేక పరిస్థితులనో నిందిస్తూ కుంగిపోవటం కంటే ధైర్యంగా అవగాహన పెంచుకుని ఎదుర్కోవటం మంచిది. క్యాన్సర్‌కు జవాబు కావాలంటే ఘనం చేయగలిగిందల్లా తొలిదశలో కనుక్కోవటమే. అంటే కణితి 1 సెం.మి కంటే చిన్నగా ఉండి వచ్చిన భాగానికి మాత్రమే పరిమితయి శరీరంలో ఇతర ఏ భాగానికి ఆకణాలు వ్యాప్తి చెందని దశ అన్నమాట.

క్యాన్సర్ వంశపారంపర్యమా....? కానే కాదు అని చెప్పలేము. మరి ముఖ్యంగా స్త్రీలలో రక్త సంబంధికులలో ఇద్దరి ముగ్గురిలో రొమ్ము క్యాన్సర్ బయట పడిందంటే వారి కుటుంబాలలో ఆ జీన్స్ ఉండే ప్రమాదం ఎక్కువ అని గుర్తించుకోవాలి. ముందే తెలుసుకోవాలంటే BRCA1, BRCA2 వంటి జీన్ మ్యుటేషన్ పరీక్షలున్నాయి, ఈ పరీక్షలు పాజిటివ్‌గా వచ్చాయంటే ఆ అమ్మాయిలో రొమ్ము క్యాన్సర్ కణం ఉన్నట్లుగా పరిగణించాలి. వీరికి చాలా కౌన్సిలింగ్ అవసరమవుతుంది. క్యాన్సర్‌కు గురికాకముందే రొమ్ములను మాస్టెక్టమి చేసి తీసివేసి రొమ్ములను ప్లాస్టిక్ సర్జన్ సహాయంతో కృత్రిమంగా ఏర్పరచటం ఒక పద్ధతి, లేదా వారికి స్వయంగా ఎలా పరీక్షించుకోవాలో తెలియచేయటం తో పాటు, క్రమంతప్పకుండా, అల్ట్రాసౌండ్ స్కానింగ్, మామోగ్రఫీ వంటి పరీక్షలు చేయించు కుంటూ ఉండమని, ఏ మాత్రం కణితి ఉన్నట్లు అనుమానం వచ్చినా బయాప్సి చేయించుకోమని సలహాలు ఇవ్వటం జరుగుతూ ఉంటుంది.

క్యాన్సర్ అంటువ్యాధా...? కానేకాదు. క్యాన్సర్ అంటువ్యాధి అస్సలుకాదు. ఏరకమయిన క్యాన్సర్ అయినా అంటువ్యాధి కాదు. వారి తుమ్ములు, దగ్గుల ద్వారా లేదా ఆ వ్యక్తికి దగ్గరగా ఉండి సేవలు చేయడం ద్వారా ఈ వ్యాధి సోకే అవకాశమే లేదు. అయితే కొన్ని రకాల వైరస్‌లకు గురయితే కొన్ని రకాల క్యాన్సర్ వచ్చే ప్రమాదం ఎక్కువ. ఒకరి నుండి ఒకరికి ఆ వైరస్‌లు శారీరక సంబంధాల్లు అంటే శృంగారం ద్వారా లేదా రక్త మార్పిడి ద్వారా సోకుతాయి. హ్యూమన్ పాపిలోమా వైరస్ (HPV), హెటైటిస్ B, హెపటైటిస్ C, HIV వైరస్‌లు ఇలా సంక్రమిస్తాయి. HPV వైరస్‌లో కొన్ని రకాలు గర్భాశయ ముఖ ద్వార క్యాన్సర్‌కు ప్రధాన కారణాలు. హెపటైటిస్ B and C ల వలన కాలేయం దెబ్బతిని 'సిర్రోసిస్'కు అంటే గట్టి పడిపోయి క్యాన్సర్ కు గురవుతుంది. HIV వైరస్ వలన రోగ నిరోధక శక్తి పూర్తిగా తగ్గిపోయి శరీరంలో ఏ భాగమయినా క్యాన్సర్‌కు గురికావచ్చు. HPV, హెపటైటిస్ B వైరస్‌లకు గురికాకుండా వ్యాక్సిన్స్ ఉన్నాయి. పెళ్లికాక ముందే ఈ వ్యాక్సిన్స్ మూడు డోసులు 6 నెలలవ్యవధిలోపు వేయించు కోవటం చాలా మంచిది. పెళ్లి అయిన వారు కూడా ఆ జబ్బుకు గురయ్యారా లేదా అనే పరీక్షలు చేయించుకుని, గురికాకుండా ఉంటే 3 డోసులు తీసుకోవచ్చు. తల్లి ఈ వైరస్‌లకు పాజిటివ్ ఉంటే గర్భధారణ సమయం నుండి డెలివరి అయిన వెంటనే బిడ్డకు కొన్ని ఇంజక్షన్స్ ఇప్పించటం ద్వారా ఆ బిడ్డ ఈ వైరస్‌ల బారిన పడకుండా కాపాడుకోవచ్చు.

క్యాన్సర్ కణం ఒక్కొక్కరిలో ఒక్కోలా ప్రవర్తిస్తూ ఉంటుంది. లేటుదశలో వచ్చినప్పుడు కొంత వరకు నొప్పి తగ్గటానికి, ఆహారం తీసుకోవాటినికి, లేక మలమూత్ర విసర్జనలకు పాలియేటివ్ కేర్ కింద కొన్ని ట్రీట్‌మెంట్స్, అవసరమయితే సర్జరిలు చేస్తారు. కాని అప్పటికే కణాలు శరీరమంతా వ్యాపించి ఉండటం వలన క్యాన్సర్ అదుపులోకి రాక మరణానికి గురవటం జరుగుతుంది కాని కత్తి పెట్టటం వలన అస్సలు కాదు.

(సశేషం)

# దొంగాట

## ఇందూ రమణ

**"అబ్బ! వదలండి. అందరూ మనకేసే చూస్తున్నారు" ఎవరో గుసగుసగా అంటున్నారు. ఆ మాటలు నాపక్కనుండే వినిపించే సరికి ఉలిక్కిపడి పక్కకుచూశాను. ఓ ఇద్దరు భార్యాభర్తలు ఒకర్నొకరు గట్టిగా వాటేసుకుని నడుస్తున్నారు. భర్త ఉండుండీ ఆమె నడుం గిల్లుతూ చేతుల్తో ఆమె ఒళ్ళంతా తడిమేస్తున్నాడు. ఇంతలో...**

"నేను అసమర్థుడ్నా?"

"అవున్రా! నీదే తప్పు. ముమ్మాటికీ నీదే తప్పు. ఆడదేం చేస్తుంది. రా అంటే వస్తుంది. పోవే అంటే పోతుంది" అన్న నాన్నమాట గుర్తుకురాగానే మెదడంతా మొద్దుబారిపోయింది.

జలపాతంలా ఉరకలేస్తున్న జనాల్నిచూస్తూ ఉత్సాహంగా నడుస్తున్నవాడ్ని ఒక్కసారే ఉలిక్కిపడ్డాను. నా మొహంమీదే కోపంతో రెచ్చిపోయి నాన్న అన్న మాటలు పదేపదే గుర్తుకొచ్చేసరికి మనసంతా కకావికలమైపోయింది. ఆ క్షణం... ఆ రోజు... అందరి ముందూ జరిగిన పంచాయితీ గుర్తొచ్చింది. అప్పటికే అమ్మానాన్న పదేపదే చెప్తున్నారు. అమ్మయితే చెప్పిందే చెప్తూ బుర్రతినేస్తోంది.

"నాన్నా పవన్... నేను చెప్పింది వినరా! నువ్వూ కోడలు సింహగిరి ప్రదక్షిణకు బయలుదేరండిరా!" బ్రతిమలాడుతూ అంది అమ్మ.

"దేవుడి కొండచుట్టూ తిరిగితే పిల్లలు పుట్టేస్తారా? ఇదేం పిచ్చమ్మా!"

చిరాగ్గా మొహం పెట్టి అసహనంగా అరిచాను. అంతకన్నా ఏం చెయ్యగలను?

హాల్లో ఉన్న సోఫాలో కాళ్ళు ముడుచుకుని కూర్చున్నాను. మా ఆవిడ రేణుక వంటగది ముందు తప్పు చేసిన ముద్దాయిలా బోనులో నిలబడ్డట్టు తలదించుకుని నిలబడింది. అమ్మా, నాన్న నాకు ఎదురుగా కూర్చొని క్లాసు పీకుతున్నారు.

మధ్యలో మా అమ్మమ్మ ఒకర్తి. అగ్నికి ఆజ్యం పోస్తున్నట్టు ఉండుండీ ఏదో ఒక సూటిపోటి మాట మాట్లాడుతోంది. "పిల్లలు పుట్టకపోతే నాదా తప్పు" ఉన్నట్టుండి గట్టిగానే అన్నాను. అంతే! అందరూ నాకేసి వింతగా చూసి చిరాగ్గా మొహాలు తిప్పుకోవడం చూసి నాకు చిర్రెత్తుకొచ్చింది.

అదే సమయంలో నాన్న కోపంగా నా మీదకు విరుచుకుపడ్తూ బండబూతులు తిట్టాడు.

ఆ మాటలు నా చెవులలో ఇప్పటికీ కూడా మార్మోగుతూనే ఉన్నాయి. "సరే! నేనూ మా ఆవిడ మీ అందరితో గిరిప్రదక్షిణకు రావాలి.

అంతేకదా! వస్తాం. వస్తే మాకు గంపెడు పిల్లలు.. అదే మీకు మనుమలు పుట్టేస్తారు కదా. ఓకే వస్తాను" ఇక పంచాయితీని తట్టుకోలేక చివరికి అమ్మానాన్నల మాటలకు తప్పని సరై ఒప్పుకున్నాను.

ఆలోచిస్తూ నడుస్తూనే ఉన్నట్టుండి వెనక్కి తిరిగి చూశాను. ఒక్కసారే ఆశ్చర్యమంతా నన్ను ఆవహించేసింది.అందమంతా దారి పొడవునా... తోరణాలుగా కట్టి వేళాడుతున్నట్టే ఉంది.

ఆ రోజు గిరిపౌర్ణమి.

ఉత్తరాంధ్ర ప్రజల ఇలవేల్పు... సింహాద్రి అప్పన్న స్వామి కొలువై ఉన్న సింహగిరి శిఖరం చుట్టూ సుమారు ముప్పై కిలోమీటర్లు కాలినడకన గిరి ప్రదక్షిణ చేయడానికి వచ్చిన లక్షల మంది భక్తులు దారి పొడవునా ఆనందోత్సాహాలతో... భక్తి పారవశ్యంతో నడక సాగిస్తున్నారు.

అందులో నేనూ, మా వాళ్ళు గుంపులో గోవిందంలా కలిసి నడుస్తున్నాము.

మార్గమధ్యంలో దారిపొడవునా అక్కడక్కడా కొలువై ఉన్న దుకాణాల్లో అమ్ముతున్న రకరకాల ఫలహారాలు తింటున్నారు కొందరు.

వాటి పక్కనే స్వచ్ఛంద సేవాసంస్థల కార్యకర్తలు గుడారాలు ఏర్పాటుచేసి పళ్ళు పానీయాలు... పులిహోరా, పొంగలి, దద్దోజనంలాంటి ప్రసాదాలు ఉచితంగా పంపిణీ చేస్తున్నారు.

ఒకదగ్గర మజ్జిగ ప్యాకెట్లు, మరో దగ్గర మంచినీళ్ళ ప్యాకెట్లు పంపిణీ చేస్తున్నారు.

మండుటెండలో చెమటలు కక్కుతూ నడుస్తున్న మాకు ఎక్కడికక్కడే దాహార్తి, క్షుద్బాధ తీరిపోతోంది. ఉరుకులుపరుగులు మీద నడిచి వస్తున్న భక్తులందరూ ఆబగా రోడ్డుపక్కన వెలసిన గుడారాల మీద... వాళ్ళిస్తున్న ఉచిత ఫలహారాల మీద ఎగబడి మూకుమ్మడి దాడి చేస్తున్నారు.

నా వెనుక కొద్దిదూరంలో అమ్మానాన్న, మా మేనమామలు మేనత్తలు, మా చెల్లి బావ జట్టుగా ఊసులాడుకుంటూ నడిచి వస్తున్నారు.

ఒక్కసారే ఉలిక్కిపడి ఉన్నట్టుండి ముందుకు సాగుతున్నవాడ్నల్లా రోడ్డువార నిలబడి అందరికేసీ పరీక్షగా చూశాను.

మా ఆవిడ... నా భార్య... నా పెళ్ళాం... రేణుక ఏది?ఎక్కడుంది? ఎవరితో జట్టుకట్టి నడుస్తోంది? ఉప్పెనలా ఉరకలేస్తూ పోటెత్తిన వరదలా నడుస్తున్న భక్తజన సందోహంలో మా ఊరివాళ్ళు మా వీధి వాళ్ళు మా బంధువులు... అందరూ కనిపిస్తున్నారు.

రేణుక... ఒక్క రేణుక మాత్రం కన్పించటంలేదు. నా భార్య ఏది? ఎక్కడుంది? ఎవరితో నడుస్తోంది? కొంపదీసి మనసు వికలం చేసుకోలేదు కదా? పిల్లలు లేరన్న అవమానాన్ని తట్టుకోలేకపోయిందా?

అందరి ముందూ జరిగిన అవమానాన్ని భరించలేకపోయిందా?

"ఒరేయ్! పవన్... అక్కడే ఆగిపోయావేరా? ఇలారారా? ఇక్కడ చక్రపొంగలి పంచుతున్నార్రా! రారా" అమ్మ కేకకి ఉలిక్కిపడ్డాను. నేనే కాదు. దారి పొడవునా నడుస్తున్న వాళ్ళంతా ఒక్కక్షణం ఆగి మరీ నాకేసి అమ్మ కేసి చూసి ముసిముసిగా నవ్వుకుంటూ ముందుకు సాగిపోయారు.

"అమ్మా! మీ కోడలేది?" నెమ్మదిగా అమ్మకే వినిపించేలా అడిగాను. నాన్న వింటే అరిచి గగ్గోలు పెడతాడు. అప్పుడు దారిపొడవునా సాగిపోతున్న భక్తులందరూ మా చుట్టూ మూగుతారు.

"ఇక్కడే ఎక్కడో ఉంటుందిలేరా! వీధిలో అమ్మలక్కలందరూ వచ్చారు కదా. వాళ్ళతో నడుస్తుంటుందిలే. అయినా నువ్వు నీ పెళ్ళాన్ని అలా ఎలా ఒంటరిగా వదిలేశావురా? మీ బావ... మీ నాన్నగారు చూడు. మమ్మల్ని తోకల్లా ఎలా పట్టుకు తిరుగుతున్నారో?" నవ్వుతూ అంది అమ్మ.

తొలి పావంచా దగ్గర కాలభైరవస్వామికి కొబ్బరికాయ కొట్టి గిరిప్రదక్షిణ మొదలు పెట్టినప్పుడు నా



**ప్రజాస్వామ్య మనుగడకు అవసరమైన చిత్తశుద్ధి, సచ్ఛీలత, సమైక్యత సమగ్ర భావనలు నేడు అడుగంటుతున్నాయి.**

-ఓ.పి.రావత్, ఎన్నికల ప్రధాన కమిషనర్

పక్కనే నిలబడింది రేణుక. అప్పుడే సింహాద్రి అప్పన్న స్వామి ప్రచార రథం కూడా సింహగిరి చుట్టూ గిరి ప్రదక్షిణకు బయలుదేరింది.

లక్షలమంది భక్తులంతా ఒక్కసారే ముక్తకంఠంతో "గోవిందా... గోవిందా! ఆపదల మొక్కుల వాడా... సింహాద్రి అప్పన్నా... పాహిమాం... పాహిమాం' అంటూ గొంతెత్తి ప్రార్థనలు చేస్తూ భక్తిగీతాలు ఆలపిస్తూ ప్రదక్షిణ మొదలుపెట్టారు.

అవును... అప్పుడు... అప్పుడు... రేణుక తన పక్కనే నిలబడింది.

రేణుక... బహుశా వెనుక నడుస్తోందేమోనని అనుకుంటూనే గిర్రున వెనక్కి తిరిగి జనాలకి ఎదురు నడుస్తూ రేణుకను వెతుక్కుంటూ వెళ్ళాను.

అలా ఎంత దూరం వెనక్కి నడిచానో నాకే తెలీదు. ఎక్కడా రేణుక జాడ కూడా కనిపించ లేదు. అంతే! మళ్ళా ఉసూరుమంటూ తిరిగి ముందుకు గబగబా పరుగులుపెట్టి నడిచాను.

"కొంపదీసి కోపంతో మమ్మల్నందరినీ దాటుకుంటూ ముందుకెళ్ళిపోయిందేమో! ఏమో! అయినా నాకు రాని కోపం రేణుకకు ఎందుకొస్తుంది. రాదు... రాదు కాక రాదు" అనుకుంటూ ముందుకు సాగుతున్న నాకు సుబ్బారావు గుర్తొచ్చాడు.

సుబ్బారావు అవును సుబ్బారావుగాడు వాడే నా పాలిట రాక్షసుడు. నా ఈ దిక్కుమాలిన పరిస్థితికి కారణం వాడే. అవునవును వాడేనని నా మనసుకూడా వంతపాడుతోంది. ఆలోచనల్లో పడ్డాను.

'ఏరా! పవన్. ఒక్కడివే వచ్చావా సినిమాకి?' భుజం చరుస్తూ అడిగాడు ఉదయ్.

'ఏం? వీధి వీదందర్నీ వెంటబెట్టుకుని రమ్మంటావా?' వెటకారంగా అన్నాను.






'మీ ఆవిడతో వచ్చావేమోనని అడిగాన్రా?' అన్నాడు ఉదయ్.

ఇంతలో నాతోపాటు సినిమాకి వచ్చిన సుబ్బారావు రెండు డ్రింకులు పట్టుకుని వచ్చాడు. వస్తూనే ఉదయ్ మాటలు వింటూ వెటకారంగా నవ్వాడు.

'ఇంట్లో ఇరవై నాలుగ్గంటలూ ప్రక్కనే ఉంటుంది కదరా పెళ్ళాం. స్నేహితులతో సరదాగా సినిమాకొస్తూ తీసుకురావాలా?' నా చేతికి డ్రింకు ఇస్తూ ఉదయ్‌తో అన్నాడు సుబ్బారావు.

'నేను ఎక్కడికెళ్ళినా మా ఆవిడ తోడులేందే వెళ్ళన్రా' అన్నాడు ఉదయ్.

'మా ఆవిడ కంట్లో నలుసులా నసపెడుతుం దిరా బాబు. చనువిస్తే చులకనైపోతామని నేనేఎక్కడి కెళ్ళినా ఇదిగో ఇలా మన పవన్‌గాడ్ని లాక్కొచ్చేస్తుం టాను" అని అన్నాడు సుబ్బారావు.

'ఏరా పవన్ మీ ఆవిడ ఏమీ అనదా?' అడిగాడు ఉదయ్. ఇంతలో రయ్యిమని మా దగ్గరకు వచ్చింది ఉదయ్ భార్య.

'ఏమండీ మీకు మతిపోయిందా? ఇంటర్ బెల్ కొట్టగానే డ్రింకులు తెస్తానని వచ్చారు. సినిమా స్టార్టయిపోతోంది. ఇక్కడ బాతాఖానీ వేసుక్కూర్చు న్నారు. మీకు బుద్ధుందా?' వస్తూనే కోపంగా అరిచి ఉదయ్ చెయ్యిపట్టుకుని లాక్కెళ్ళిపోయింది.

'ఇందుకేరా నీకు చెప్తుంటాను. పెళ్ళాం పెరట్లో ఉండాలి. మొగుడు నాకిట్లో ఉండాలని' నాకేసి చూస్తూ అన్నాడు సుబ్బారావు.

'ఎవరి ఇంట్లో?' అమాయకంగా సుబ్బారావు కేసి చూస్తూ అడిగాను.

'మంచాలు కంచాలు ఉంటాయిగా. ఆకలేస్తే తినడానికి... నిద్రొస్తే బజ్జోడానికి' టక్కున అన్నా రెవరో వెనుక నుండి. నేనూ సుబ్బారావు ఒక్కసారే ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాము.

ఒకతను మా ఇద్దరికేసి చీదరగా చూస్తూ వెట కారంగా నవ్వుకుంటూ పాప్‌కార్నర్ ప్యాకెట్టు పట్టు కుని తింటూ థియేటర్‌లోకి వెళ్ళిపోతున్నాడు.

సుబ్బారావూ నేనూ ఒక్కసారే ఉద్యోగాల్లో చేరాము. వాడికీ నాకూ అయిదారు నెలల వ్యవధిలో పెళ్ళిళ్ళ య్యాయి. వాడేమన్నా నాకదే వేదవాక్కు. ఇంట్లోకి ఏది కొనాలన్నా వాడు తోడురానిదే నేను ఏదీ కొనను. కొనలేను. భయం బిడియం... సిగ్గూ ఎగ్గూ లేకుండా బేరాలాడడంలో సుబ్బారావు మహాదిట్ట.

ఓ రోజు... ఇంటికొస్తూనే అప్పుడే కొన్నవాచీ మా ఆవిడ చేతికిచ్చి గదిలోకెళ్ళాను. బట్టలు మార్చు కుంటున్న నా దగ్గరకు రేణుక కోపంగా వస్తూనే వాచీ మంచం మీదకు విసిరేసింది.

'ఏం వాచీ బాగాలేదా?' ఆశ్చర్యంగా అడిగాను.

'నేను టైటాన్ వాచీ తెమ్మంటే... ఇదేంటి టొయోటో కంపెనీది తెచ్చారు' చిరాగ్గా మొహం పెట్టి అంది నా భార్య రేణుక.

'సుబ్బారావు గాడు ఇదే బావుందన్నాడు' లుంగీ కట్టుకుంటూ అన్నాను.

రివ్వున నా దగ్గరకు వచ్చి సర్రున నేను కట్టుకున్న లుంగీ లాగేసి పక్కన పడేస్తూ కోపంగా అంది రేణుక. 'మీ సుబ్బారావుగాడు ఈ కట్ డ్రాయర్ బావుందిరా ఇలాగే తిరగరా.. అంటే తిరుగుతారా? కొంచమన్నా బుర్రపెట్టి ఆలోచించరా?'

'పోనీలే రేణూ... నీకు...' అనబోతూ ఆగాను. సుబ్బారావన్న మాటలు గుర్తొచ్చాయి.

'ఒరేయ్! పెళ్ళాలకి అలుసిస్తే అందలం ఎక్కే స్తారు. అవకాశం దొరికితే ఆకాశాన్ని కొని తెమ్మం టారు. జాగ్రత్త'

'ఏదో చెప్పబోతూ ఆగిపోయారు. నాకు...' ఆశగా చూస్తూ అడిగింది రేణుక.

'ప్చ్! పోయి కాఫీ పట్రా!' చిరాగ్గా మొహం పెట్టి లుంగీ తీసి మళ్ళా కట్టుకుంటూ ఏదో అడ్డొచ్చే సరికి ముందుకు తూలిపడబోయాను.

'ఏంటి సార్ నడుస్తూనే కలలుకంటున్నారు. ముందుకు చూస్తూ నడవండి' కోపంగా నన్ను తన రెండుచేతుల్తో బలంగా తోసేస్తూ అందో ఆవిడ.

"సారీ" అన్నానేగాని సిగ్గుతో కుంచించుకు పోయాను. పాపం రేణుక. అయిదేళ్ళు ఉలుకూ పలుకూ లేకుండా బొమ్మలా నాతో కాపురం చేసింది. నేనే అంటీ ముట్టనట్టు నటిస్తూ సంసారసాగరంలో సాధువుగా మెలిగాను. రేణుక సాధుజంతువులా తలొంచుకుని సాగిపోయింది.

ఇన్నాళ్ళకు ఇన్నేళ్ళకు ఇంట్లో అందరి ముందూ దోషిగా గొర్రెలుగా ముద్రపడి అనరాని మాటలు పడింది. పదుగురి ఎదుట తలొంచుకుని నిలబడింది. దీనంతటికీ ఓ విధంగా తనూ కారణమే కదా.

ఈ అయిదేళ్ళలో ఓ ముద్దూ ముచ్చట లేదు. పెళ్ళిరోజని... పుట్టిన రోజని వేడుకలు లేవు.

రోజంతా ఆఫీసు. రాత్రెప్పుడో ఇల్లు చేరడం... మంచమెక్కడం. అదే దినచర్య.



## వండర్‌ఫుల్ జర్నీ

ఎవర్‌గ్రీన్ హీరో నాగార్జునతో కలిసి నటించడం ఓ గొప్ప అనుభూతి అంటూ ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బు అవుతున్నది ఆకాంక్షసింగ్.

"ఆయన సెట్‌లో వుంటే పాజిటివ్ వైబ్స్ వ్యాపి స్తాయి. ఎంతో సరదాగా వుంటారు. డైలాగులు చెప్పడంలో నాగ్ సర్ ఎంతో సాయపడ్డారు.ఎన్నో నేర్పించారు. ఆయన సలహాలు పాటించడంవల్ల నాకు పని సులువు అయింది.

నాని కూడా చాలా సాయపడ్డారు. నటనతోపాటు సెట్స్‌పైన ఎంతో సరదాగా గడిపాము" అంటూ సందడిగా చెప్పిందీ రాజస్థానీ అమ్మాయి.

ఎప్పుడోతప్పు జారి మనసు పడి శరీరం జలదరించినప్పుడు పక్కనే పడుకున్న పెళ్ళాంకేసి ఓరకంట చూస్తే ఆదమరిచి నిద్రపోతూ ఉండేది పాపం!

నిద్రలోలేపి పాపం మూటగట్టుకోవడం మహాపాపమని నన్ను నేనే చల్లార్చుకుంటూ కళ్ళు మూసుకునే వాణ్ణి. ఒక్కోసారి రేణుక నిద్రమత్తులో నో... మరులుగొన్న మనసుతోనో నా మీద కాలేస్తే చిరాగ్గా పక్కకు తోసేసేవాణ్ణి. నీకు వేళాపాళా లేదా అంటూ కసురుకునేవాడ్ని. ఇప్పుడదంతా గుర్తొస్తుంటే నా మనసు నాకే ఎదురుతిరుగుతోంది.

ముడసర్లోవ పార్కు దాటి పెదగదిలి మీదుగా హనుమంతవాక జంక్షన్ దగ్గరకొచ్చాను. హైవే రోడ్డు దాటాల్సి ఉండటంతో అక్కడ పోలీసులు భారీగా మొహరించి ఉన్నారు.

ముడసర్లోవ రోడ్డులో నుండి నడిచివస్తున్న భక్తులను క్షేమంగా రోడ్డు దాటిస్తున్నారు.

కైలాసగిరి రోడ్డులో నుండి తెన్నేటి పార్కు బీచ్‌కు నడుస్తున్నాను. నా ముందర అందరూ అమ్మాయిలే ఉన్నారు. వాళ్ళల్లో అక్కడక్కడా ఉన్న నలుగురైదుగురు అబ్బాయిలు తమ పక్కన నడుస్తున్న అమ్మాయిల నడుం మీద చేతులు వేసి ఒకర్నొకరు హత్తుకున్నట్టే నడుస్తున్నారు.

"అబ్బ! వదలండి. అందరూ మనకేసే చూస్తున్నారు" ఎవరో గుసగుసగా అంటున్నారు. ఆ మాటలు నాపక్కనుండే వినిపించేసరికి ఉలిక్కిపడి పక్కకు చూశాను.

ఓ ఇద్దరు భార్యాభర్తలు ఒకర్నొకరు గట్టిగా వాటేసుకుని నడుస్తున్నారు. భర్త ఉండుండీ ఆమె నడుం గిల్లుతూ చేతుల్తో ఆమె ఒళ్ళంతా తడిమేస్తున్నాడు.

'ఇంట్లో పిల్లిలా తిరుగుతారు. ఇక్కడ పులిలా మీద పడుతున్నారు. ఇంతమంది ముందూ మీకు సిగ్గెయ్యటం లేదా' అంటూనే వాళ్ళ పక్కనే నడుస్తున్న నన్నుచూస్తూనే ఆమె సిగ్గుతో తలదించేసుకుంది.



అడ్డగోలుగా అయినవారికి రుణాలు మంజూరు చేయించింది సోనియాగాంధీ కుటుంబం... ప్రజల డబ్బుతో ఆటలాడుకుంది కాంగ్రెస్. -స్మృతి ఇరాని, కేంద్రమంత్రి

## సవాళ్ళంటే ప్రీతి

తారల తీరులో బోల్డెంత మార్పు వచ్చింది. పాత్రకు తగ్గట్టు, అవసరమైనట్లు మార్పులు, సవాళ్ళకు వారు 'సై' అంటున్నారు. శరత్‌కుమార్ కూతురు వరలక్ష్మి ఈ విషయంలో ఓ ఆకుఎక్కువే తొడిగింది. ఎప్పటికప్పుడు ఛాలెంజింగ్ పాత్రలు కావాలంటూ తహతహలాడుతుంటుంది.

మూడు దశాబ్దాలనాడు 'అమావాస్య చంద్రుడు' పేరిట తెలుగులో విడుదలైన 'రాజ పార్వై' అన్న టైటిల్ పెట్టుకున్న సినిమాలో వరలక్ష్మి అంధురాలిగా నటిస్తున్నది. చూపులేని అమ్మాయిగా కనిపించేందుకు ప్రత్యేకశిక్షణ తీసుకున్నదట.

అంతేకాదు- ఫైట్ల కోసమూ ట్రైనింగ్ తీసుకుందట. తమిళంలో ప్రస్తుతం బిజీ తార. చేతిలో ఏకంగా నాలుగైదు సినిమాలున్నాయి.

'ఇంట్లో అమ్మానాన్న చెల్లాయిల ముందూ ఇలా సరసాలాడితే బావుంటుందా? ఇల్లు ఇరకమాయే... ఇలా షికార్లకొస్తే కదా మన పంటపండేది' చిలిపిగా ఆమె బుగ్గగిల్లుతూ అన్నాడతను.

నాకెందుకో వాళ్ళిద్దర్నీ అలా చూస్తుంటే మనసంతా ఏదోలా అనిపించింది. పాపం రేణుక ఎక్కడుందో? ఎక్కడని తిరుగుతోందో? ఇంతమందిలో ఇన్ని లక్షలమందిలో ఎక్కడని వెతకను?

ఆలోచిస్తూ తెన్నేటి బీచ్ రోడ్డు వారనున్న పిట్టగోడ మీద కూర్చున్నాను. ఎదర సముద్రం భీకరంగా కనిపించింది. అలలు ఉవ్వెత్తున ఎగసిపడుతూ ఒడ్డుకు కెరటాలై కొట్టుకువస్తున్నాయి నా ఆలోచనల్లాగే.

"ఏరా! కాళ్ళు పీకేశాయా! అలా నిస్సత్తువగా కూర్చుండిపోయావు" నాముందర నిలబడి నాన్న నా భుజం తట్టేవరకూ నేను వాళ్ళని గమనించలేకపోయాను.

"ఏరా! ఏడుస్తున్నావా? ఎందుకూ?" నా కళ్ళ నుండి జాలువారుతున్న కన్నీటిచుక్కలని గమనించి అడిగింది అమ్మ.

"అదేమీ లేదమ్మా! ఈ జనాల్ని చూసి... ఆనందంగా ఉంది" అన్నాను నన్ను నేను నాలోనే దాచేసుకుంటూ. "పద... పద బీచ్ దగ్గరకొచ్చేశాం కదా... అందరం బీచ్‌లో మునిగేసి ముందుకు సాగుదాం" అంటూ బావ నా చెయ్యి పట్టుకుని లేవదీశాడు.

"రేణుక... రేణుక కనిపించిందా?" ఆందోళనగా అడిగాను. "అయ్యో! నీతో లేదా? మీ ఇద్దరూ సరసాలాడుకుంటూ ముందుకు నడిచివచ్చేశారని అనుకుంటున్నామే" అంది అక్క.

"ఉంటుందిలేరా! ఎక్కడకు పోతుంది. ఈలోగా మనం బీచ్ దగ్గరకు వెళ్దాం పద" అంటూ నాన్నకూడా నా చెయ్యి పట్టుకుని ముందుకు నడిపించాడు.

అమ్మానాన్న, అక్కాబావ, మేనమామలు, అత్తయ్యలు మా వీధిలోవాళ్ళు అందరూ సముద్రం అలలతో పోటీపడుతూ ఆడుకుంటున్నారు.



ఒడ్డున నిలబడి సముద్రం కేసి... ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న అలలకేసి వాటితో పోటీపడుతున్న జనం కేసి చూస్తూ ఒక్కసారే అదిరిపడ్డాను.

సముద్రం అలల మధ్య రేణుక 'అవును రేణుకే... అదే రంగు చీర... పెళ్ళి తర్వాత శోభనం రోజు కట్టుకున్న తెల్ల చీర... అవునవును నా రేణుకే' అనుకుంటూ చెప్పులు కూడా విప్పకుండా పరిగెట్టాను.

సముద్రంలోకి కాదుకాదు. కెరటాలను నెట్టుకుంటూ అలల మధ్యకు నా రేణుక దగ్గరకు పరిగెట్టాను. రేణుకకు కొద్దిదూరంలోనే సముద్రం అలల మధ్య ఉన్న మావాళ్ళనెవరినీ నేను గమనించలేదు. నా కళ్ళకు వేరే ఎవరూ కనిపించలేదు కూడా.

పరుగున వెళ్ళి వెనకనుండి అమాంతంగా రేణుకను వాటేసుకున్నాను.

"శ్రీవారికి ఇప్పుడా నేను గుర్తొచ్చాను" వెనక్కి తిరక్కుండానే నామీద వాలిపోతూ అంది.

"ఇంతవరకూ నీకోసం వెతుక్కుంటూ ఎంత హైరానా పడ్డానో నీకేం తెలుసు?" అన్నాను.

"తెలుసు... వెనక్కీ ముందుకీ... మీ పరుగులు పరికిస్తూనే ఉన్నాను స్వామీ" కిలకిలా నవ్వుతూ అంది రేణుక.

"అమ్మ దొంగా! నన్ను ఆట పట్టిస్తావా?" అంటూ నన్ని నడుం మీద ముద్దుపెట్టుకుంటూ అన్నాను. ఇంతలో పెద్ద కెరటం వచ్చి మా ఇద్దర్నీ ఎత్తుకుని ఒడ్డుకు లాక్కొచ్చింది.

ఇద్దరం ఒకర్నొకరం ఆబగా వాటేసుకుని ఇహపరాలను మర్చిపోయి ఆనందంగా అలా ఇసుక తిన్నెమీదే ఆదమరచి తన్మయంగా కళ్ళు మూసుకుని ఉండిపోయాము.



## అనంత స్తుతి

నమోస్తు అనంతాయ సహస్రమూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరుబాహవే
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటి యుగధారిణే నమః

వేయి రూపాలు, వేయి పాదాలు, వేయి కన్నులు,
వేయి శిరస్సులు, వేయి బాహువులు,
వేయి పేర్లు కల అనంతునికి నమస్కారము. □

## ఉండ్రాళ్ళ తద్దె

**(తేది: 27.9.2018)**

**చం**ద్రుడు ఉదయించిన 3వ రోజుని తదియ లేదా తృతీయ అంటారు. అదే కాలక్రమంలో తద్దె లేదా తద్దిగా మారిపోయింది. భాద్రపదమాసంలో బహుళ పక్షంలో అంటే పూర్ణిమ దాటాక వచ్చే 3వ రోజుని 'ఉండ్రాళ్ళ తద్దె'గా చెప్పారు పెద్దలు.

శ్రావణ, భాద్రపద మాసాలు రెండూ వర్షఋతువు లోనికొస్తాయి కాబట్టి, వర్షం కారణంగా వచ్చే జలుబూ, తుమ్ములూ, దగ్గులూ, కళ్ళ వెంట నీరు కారడం, గొంతు ధ్వని మారడంవంటి ఈ వ్యాధులు రాకుండా భాద్రపదం చివరివరకూ (9.10.2018) ఉండ్రాళ్ళనే వాడుతూ ఉండాలి.

ఈ విషయాన్ని మరోమారు గుర్తుంచుకునేలా చేసేందుకు ఈ బహుళ తదియని ఉండ్రాళ్ళ తద్దె అని వ్యవహరించారు పూర్వులు. □

## శ్రీహరి రూపం

**మ**లయప్పస్వామి సింహవాహనమ్మీద వస్తూ మనకి కన్పిస్తాడు. బ్రహ్మోత్సవాల్లో ఆ సింహాన్ని చూస్తూ ఆ సింహాన్నే నృసింహస్వామి అనుకుంటూ సింహం నృసింహావతారరూపంలో వస్తోందని భ్రమ పడతారు కొందరు. అది సరికాదు.

నృసింహుడనేది శ్రీహరి ఎత్తిన అవతారాల్లో ఒకటి. శ్రీహరి రూపమైన మలయప్పస్వామి, తానే ఎత్తిన మరో అవతారరూపాన్ని వాహనంగా చేసుకుని వస్తాడా? ఎంత తప్పు ఇది!

సింహవాహనమనేది భక్తుల్లో ఎవరు ఏ తప్పు చేశారో దాన్ని తెలుసుకుని ప్రాయశ్చిత్తాన్ని పొందుతూ తప్పొందని, వేడుకోవాలనీ, లేని పక్షంలో శ్రీహరి వధిస్తాడనీ తెలుసుకోవలసిందని చెప్తుంది! □

{ సమస్త సౌందర్యానికీ, సమస్త మహాత్మ్యానికి మూలం భగవంతుడు. }

## ఉత్తమజాతి పక్షి

**హం**స అనే జాతికి చెందిన పక్షి పాలనీ, నీటినీ వేరుచేస్తుందని పెద్దలు చెప్తూ ఉంటారు. ఒకసారి పాలూ, నీళ్ళూ కలిసిపోతే వాటిని ఎవ్వరూ వేరుచేయ లేరు. అయితే మరి ఈ వ్యవహారం నానుడి ఎలా లోకానికొచ్చిందనేది అనుమానం కదూ!

పాలు అంటే మంచి అనీ, నీరు అంటే చెడు అనీ, ఆ మంచి చెడులనే జ్ఞానం, అజ్ఞానమనీ సంకేత రూపంగా తెలియజేస్తూ- హంస ఎలా ఉత్తమజాతికి చెందిన పక్షో అలాగే ఉత్తమపురుషులక్కూడా ఏది మంచో, చెడో తెలిసి జ్ఞానమనీ, అజ్ఞానమనీ కొన్ని అంశాలని గురించి చెప్తారు.

కాబట్టి హంస అంటే ఉత్తమపురుషుడు. పాలూ, నీరూఅనేవి జ్ఞాన,అజ్ఞానాలకి సంకేతమన్నమాట. □

## అంజలి

**'అం**జలి' అనే మాటకి గౌరవపూర్వకంగా నమ స్కరించడమని అర్థం చెప్పారు పెద్దలు. అమ్- శ్రీమహావిష్ణువుని కూడా (అక్షరాణామకారోస్మి అన్నాడు శ్రీకృష్ణుడు కాబట్టి, 'అ' అంటే శ్రీహరి అని అర్థం)- జలయతి- కరిగిపోయేలా చేయగలిగిన శక్తి ఉన్న ముద్ర (భంగిమ) 'అంజలి' అన్నమాట.

దణ్ణంపెట్టడం కాకుండగా రెండు అరచేతుల్నీ మణికట్టు భాగంనుండి చిటికెనవేలు చివరివరకూ కలిపి కొద్దిగా రెండు చేతుల్నీ వెడల్పుచేస్తే దాన్ని 'అంజలి' అని అంటారు. దీనికే ప్రార్థనాపూర్వక నమ స్కారం అని అర్థం.



Give others a second, third, fourth chance

# అనిల్

## జీవిత సత్యాలు

చిన్నవయస్సే కదా అని వదిలేయకుండా మంచి చెడుల విచక్షణను పిల్లలకు అవకాశం వచ్చినప్పుడల్లా పెద్దలు వివరిస్తుండాలి.

ఒకే తరగతి పిల్లలే ఐనప్పటికీ వారి జ్ఞాపకశక్తిలో, గ్రహించే తీరుతెన్నుల్లో వ్యత్యాసాలు వుంటుంటాయి.

పైకి గొప్పగా కనిపించనివారిని చూసి తక్కువ అంచనాలు వెయ్యకూడదని చెప్పాలి. పిల్లలకు విజ్ఞానం అంతా కేవలం పాఠ్య పుస్తకాలనుంచో, తరగతి గదులు, టీచర్లనుంచో రాదు.

తల్లిదండ్రులనుంచి వారు ఎంతో విషయ పరిజ్ఞానాన్ని నేర్చుకుంటారు.

ఎప్పటికప్పుడు వారి వయస్సు, అవగాహన శక్తులను దృష్టిలో వుంచుకుని పిల్లలకు జీవితసత్యాలను నిత్యం అర్థం అయ్యేలా పెద్దలు వివరిస్తుండాలి.

## అలా ఎందుకు పిలుస్తారు?

'బెల్జియం' దేశాన్ని 'యూరప్ కాక్‌పిట్' అని పిలుస్తారు. ఎందుకంటే ఏ ఇతర దేశంలోనూ జరగనన్ని యుద్ధాలు ఇక్కడ జరిగాయి.

జర్మనీపై దాడిచేయడానికి ఫ్రాన్స్‌కు అనువైన దారి ఇదే.

జర్మనీ ఫ్రాన్స్‌పై దాడిచేయడానికీ ఇదే అనుకూలమైన దారి. స్పెయిన్ నెదర్లాండ్స్‌పై దాడిచేయడానికీ కూడా ఇదే మార్గం. మనం 'ఫ్రెంచ్‌ఫ్రైస్'గా పేర్కొని ఇష్టపడే ఆహార పదార్థం ఫ్రెంచ్‌కు చెందినది కాదు. అది బెల్జియం దేశానికి చెందినది.

బెల్జియం రాజధాని బ్రస్సెల్స్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టులో ఉన్న షాపుల్లో ప్రపంచంలో ఇంకెక్కడా దొరకని రకరకాల రుచుల చాక్లెట్లు లభిస్తాయి.

## తీగే దారి

కొన్ని ఊర్లకుగల రహదారుల కనెక్షన్ల గురించి వింటుంటే అబ్బురంగా వుంటుంది. అటువంటి గ్రామమే చైనాలోని హ్యాబి ప్రాంతంలోని 'యుషన్' గ్రామం. కొన్ని వందల అడుగుల లోతు గల లోయకు అవతలివైపున ఉంటుంది.

గ్రామం చేరుకోవాలంటే లోయదాటడం మినహా మరో మార్గం లేదు. దీన్ని దాటడానికి జిప్‌లైన్ మార్గం వేసుకున్నారు.

ఒక కిలోమీటరు పొడవు వుండే ఈ జిప్‌లైన్‌పై కేబుల్ కారులో వెళ్తేనే ఊరికి చేరుకోవడం సాధ్యపడుతుంది.

జిప్‌లైన్‌కు అంటే తీగకు చిన్నపెట్టె మాదిరి వుండే కేబుల్‌కారు బిగించి వుంటుంది. దానిపైన కూర్చునిదాటాలి. దీన్ని నడిపేందుకు ప్రత్యేకంగా ఒక వ్యక్తిని నియమించుకున్నారు.

ఇరవై సంవత్సరాలుగా ఆ గ్రామస్తులకు ఇదే దారి. వారానికో సారి తీగకు, పెట్టెకు మరమ్మతులు చేస్తుంటారు. చైనా ప్రభుత్వం ఇప్పుడిప్పుడే రోడ్డు వేసే ప్రయత్నాలు ఆరంభించింది.

## బాధగా వుంటున్నారా?

కారణం ఏదైనా కాని పిల్లలు ఒక్కోసారి ఉదాసీనంగా, నైరాశ్యంగా కనపడుతుంటారు. నిశితంగా పరిశీలిస్తే, తన్నుకుని వచ్చే దుఃఖాన్ని లోపలే దాచుకున్నట్లు కనిపిస్తారు.

పిల్లలకు అంతలా నొచ్చుకునే బాధపడే విషయాలు ఏముంటాయిలే అనుకుంటారు కాని, నిజానికి వారు ఇలా తమలో తాము బాధపడే సందర్భాలు అనేకం వుంటుంటాయి. ఉదాహరణకు, తమకు బాగా ఇష్టమైన టీచర్ తమ తరగతి నుంచి బదిలీ అయినా వారు చాలా బాధపడతారు.

తోటిస్నేహితులు స్కూలు మారినా, దోస్తీకి కటీఫ్ చెప్పినా అదే పనిగా వారు మదనపడుతుంటారు.

కాబట్టి పిల్లల బాధను లైట్‌గా తీసుకోకుండా, కారణాన్ని గుర్తించాలి. తగిన చర్యలు తీసుకోవాలి. లేనట్లైతే వారు నిస్సత్తువగా మారతారు.

## బొమ్మల పజిల్

ఈ బొమ్మలను సరైన జోడీతో జతపరచండి.



## నీటిలో తేలియాడే వంతెన

నీళ్ళలో పడవలో ప్రయాణిస్తూ ప్రకృతి అందాల్ని వీక్షించడం ఓఎత్తైతే, నదిమధ్య తేలియాడే చెక్క వంతెనపై వెళ్ళడం మరో ఎత్తు.

చైనాలోని హుబీ ప్రావిన్స్‌లోని పిజిగున్ ప్రాంతంలో ఇది వుంది.

కొంతకాలం క్రితం నది మధ్యలో నీళ్ళలో తేలి ఆడే ఆరుకిలోమీటర్ల వంతెనను ఏర్పాటుచేశారు.

దానికి ముందు పర్యాటకులు బోట్‌లో వెళ్ళి నది, ప్రకృతి అందాలు చూసివచ్చేవాళ్ళు. వంతెన ఏర్పాటు చేశాక పర్యాటకులకు ఇది ఫేవరెట్ టూరిస్ట్ స్పాట్ అయింది.

## ఆహారపు అలవాట్లు

పిల్లల ఆహారపు అలవాట్లు లోపభూయిష్టంగా వుంటున్నాయి. వారిలో వయస్సుకు మించిన శరీరం ఉంటున్నది. చిరుతిండ్లకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడంవల్ల వారిలో స్థూలకాయం సమస్య ఎదురవుతున్నది.

ఇంతకు ముందు పిల్లల ఆహారంలో అటుకులు, బొబ్బట్లు, జంతికలువంటివి వుండేవి. వాటి ప్రాధాన్యం ఇప్పుడు కనపడడంలేదు.

గింజధాన్యాలతో తయారుచేసిన పదార్థాలను వారితో తినిపిస్తుండాలి. పెద్దలు తీరిక చేసుకుని, వారికి నచ్చజెప్పి సరైన పదార్థాలు వారు తినే విధంగా చూడాల్సిన అవసరం ఉందనేది నిపుణుల అభిప్రాయం.



Courtesy : CHILD

# పబ్లిక్‌లో ఎలా మాట్లాడాలి

గుండెలనిండా బోలెడంత విశ్వాసం ఉన్నా, నలుగురి నడుమకు వెళ్ళి మాట్లాడాలంటే మాత్రం చేతులూ, కాళ్ళు ఒణికిపోతాయి. గుండె వేగం పెరుగుతుంది.అంటే నలుగురి ముందు మాట్లాడగల ధైర్యం, నైపుణ్యం కొరవడ్డాయని అర్థం. ముఖ్యంగా, పిల్లల్లో ఇలా మాట్లాడే సంశయాన్ని చిన్న వయస్సునుంచే తొలగించాలి.

స్కూలుకు వెళ్ళే రోజుల్నుంచీ పబ్లిక్ స్పీకింగ్ నైపుణ్యాలు అలవడితే, ఎదిగేకొద్దీ, ఎదిగాక వారికెంతో ప్రయోజనకరంగా వుంటుంది.

మాట్లాడే నైపుణ్యాలు తదుపరి జీవితంలో, కెరీర్‌లో ఎదిగేందుకు అవకాశాల్ని సృష్టిస్తాయి.

కొందరు పిల్లల్లో ఈ నైపుణ్యం వస్తుతఃవుంటుంది. దానికి కొంచెం సానపెడుతుంటే చాలు- మెరిసిపోతారు. కాని, కొందరు పిల్లలు అలా కాదు. ఇంట్లో ఎంత చురుగ్గావుండి, ఎంత అల్లరి పిడుగులైనా ఇతరుల ముందు మాట్లాడాలంటే ముడుచుకుపోతుంటారు. అయినా ఇటువంటి పిల్లలగురించి ఆందోళన చెందాల్సిన అవసరం అసలే లేదు. పబ్లిక్ స్పీకింగ్ నైపుణ్యాలు నేర్పించే సంస్థలు అనేకం అందుబాటులో వున్నాయి. సరైన దాన్ని ఎంచు కుని, పిల్లల్ని అందులో చేర్పిస్తే చాలు. చాలామందికి కనీసం 'నో' ఎలా చెప్పాలో కూడా తెలియదు.

కనీసం అలా చెప్పడానికి అవసరం అయిన ఆత్మస్థైర్యం సైతం వుండదు. ఇటువంటి తత్వంగలవారు పబ్లిక్ స్పీకింగ్ కోర్సులు తీసుకుంటుంటే ఫలితం అమోఘంగా కనపడుతుంది. ప్రతి ఒక్కరికీ ఏదో ఒక అంశం ఇస్తారు,దానిపై మాట్లాడమంటారు- అన్న ఏకైక సూత్రంతోనే ఇదంతా సాగదు. పిల్లల్లో పబ్లిక్ స్పీకింగ్ స్కిల్స్ పెంచే పద్ధతులు ఒక్కో సంస్థలో ఒక్కోవిధంగా వుంటుంటాయి.

వారివారి పద్ధతులను అనుసరించి, బోధిస్తారు, నేర్పిస్తారు. పిల్లలకు ఆరేడేళ్ళ వయస్సు నుంచే ఇటువంటి కోర్సులు నేర్పించవచ్చుననేది పిల్లల మానసిక నిపుణుల అభిప్రాయం. వారి వయస్సునుబట్టి నైపుణ్యాలను నెమ్మదినెమ్మదిగా అలవరుస్తారు. ఇలాంటి తరగతులకువెళ్ళడంవల్ల యథేచ్ఛగాఅందరిముందు మాట్లాడగలుగుతున్నామన్న పిల్లలు అనేకమంది.

### పబ్లిక్ స్పీకింగ్ కోర్సు

పిల్లలు మనస్సులోని విషయాలను విప్పి చెప్పని వారో లేదా మాట్లాడాలంటే సిగ్గుపడేవారో అయితే పబ్లిక్ స్పీకింగ్‌కోర్సు అవసరం. అలాగే పిల్లలు ఎంతమాటకారులైనప్పటికీ ఏ విధంగా దాన్ని సరిగ్గా బహిర్గతం చేయాలో తెలియనప్పుడు కూడా వీటి అవసరం ఎక్కువ.

సృజనాత్మకశక్తి ఎంతగానో వుండి, ఎన్నో ఐడియాలుండి, వాటిని ఇతరులకు ఏ విధంగావ్యక్తీకరించాలో తెలియనప్పుడు, ఇంట్లో, స్కూలులో తన ఆలోచనల్ని సక్రమంగా కమ్యూనికేట్ చేయడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నప్పుడు ఈ కోర్సులఅవసరం ఎక్కువగా వుంటుంది.

నిజానికి, ఈ రోజుల్లోపిల్లలు మాట్లాడే స్వేచ్ఛను మిస్సవుతున్నారు.స్కూల్లోసాధారణంగా క్రమశిక్షణ పేరిట పెద్దగామాట్లాడనివ్వరు. ఇంట్లోనూ వాళ్ళు ఏవైనాచెప్తుంటేపెద్దలు అడ్డు తగులుతుంటారు.

దీనివల్ల వారిలో భావవ్యక్తీకరణ నైపుణ్యాలుండడంలేదు. కాబట్టి, ఇటువంటి తరగతుల అభ్యాసప్రాధాన్యం, అవసరం పెరుగుతున్నాయి.

### ఆరేళ్ళ వయస్సునుంచే :

ఆరేళ్ళ వయస్సునుంచే పిల్లలు ఈ కోర్సులకు హాజరుకావచ్చు.ఎంతచిన్నవయస్సులో మొదలుపెడ్తే అంత ప్రయోజనం వుంటుంది. చిన్నవయస్సు నుంచే చక్కగా కమ్యూనికేట్ చెయ్యగలుగుతారు.

### హోమ్‌వర్కులు అవసరమా?

ప్రతి పబ్లిక్ స్పీకింగ్ సంస్థకూ తన స్వంత నియమ నిబంధనావళులు వుంటుంటాయి. వాస్తవంగా హోమ్‌వర్క్ ఏదీ వుండదు. పిల్లలు కూర్చుని చదువుకోవడమో, ప్రాజెక్టులో వుండవు. అయితే,ఇంట్లో పిల్లలుకొన్ని కార్యకలాపాలు చేపట్టాల్సివుంటుంది. అవి అవసరాన్నిబట్టి వుంటుంటాయి.



### ఎంపిక ఎలా :

ప్రతి పబ్లిక్ స్పీకింగ్ సంస్థకూ తనకంటూ స్వంత పద్ధతులుంటాయి. వాటిమేరకే తరగతులు నిర్వహిస్తాయి.కొందరు థియేటర్, ఆర్ట్ వంటివి కూడా జత చేస్తుంటారు. తమ పిల్లలకు ఏది సరైనదని ఎంచుకోవ డానికి ముందు తరగతులకు హాజరవడం మంచిది. క్లాస్ సెషన్లు పరిశీలించి, ఎంచుకోవాలి.

ప్రతివిషయంలోనూ పోటీగల ఈ కాలంలో అవసరం అయితే పబ్లిక్ స్పీకింగ్ కోర్సులు తీసుకోవాలి. ఇంతకుముందు ఇటువంటివి అసలు వుంటాయని కూడా తెలియదు. అయితే ఇప్పుడు అనేకచోట్ల వీటిని నిర్వహిస్తున్నారు.

అవసరాన్ని అనుసరించి పిల్లలే కాకుండా పెద్దలు సైతం ఈ నైపుణ్యాల్ని మెరుగుపరుచుకుంటున్నప్పుడు, పిల్లలకు చిన్నప్పటినుంచే అలవరచాలి. ఇందుకు వారికి సమయం వృథా అవుతుందన్న ఆలోచన అస్సలు వుండకూడదు.

## ఏ విధంగా సాయపడుతుంది?

**ఆత్మవిశ్వాసం:** ఎవరితో ఏం మాట్లాడాలన్నాకావాల్సినంత ఆత్మవిశ్వాసం పిల్లల్లో ఏర్పడుతుంది. వారు ఎక్కడైనా, ఎవరితోనైనా ధైర్యంగా మాట్లాడగలరు.

**పదాల మెరుగుదల :** ఇతరుల మాటలు వినడం, స్వంత స్పీచ్‌లు తయారుచేసుకోవడంవల్ల పదాల వాడకం మెరుగవుతుంది. అంతేకాకుండాచక్కని భాషాజ్ఞానం అలవడుతుంది.

**విజ్ఞాన సముపార్జన :** కోర్సులో భాగంగా పుస్తకాలు చదువుతారు కాబట్టి వారిలో విజ్ఞానం ఎంతో మెరుగవుతుంది.

**కన్విన్స్ చేయగల కళ :** స్పీకర్‌గా పిల్లలు తమ ఆలోచనల్తో శ్రోతల్నిమెప్పించి గెలుచుకోగలుగుతారు. ఈ ప్రక్రియలో పిల్లలు ఇతరుల్ని కన్విన్స్ చేయగల కళ అభ్యసిస్తారు. ఇది అతి ముఖ్యమైన జీవన నైపుణ్యం. భావిలో కెరీర్‌లో, జీవితంలో అనుబంధాల విషయంలో విజయం సాధించడానికి అవసరమైన నైపుణ్యం ఇది.

**భావవ్యక్తీకరణ:** పిల్లల బుర్రల్లో బోలెడన్ని ఐడియాలు వుండవచ్చు. కానీ వాటిని వ్యక్తీకరించగల సామర్థ్యం వారిలో లోపిస్తుంది.

అలాగే అభిప్రాయాలనూ సక్రమంగా వెల్లడించలేకపోతుంటారు. ఎమోషన్లను, ఆలోచనలను చెప్పలేరు. ఇటువంటి తరగతులు తమ బుర్రలోని ఏ విషయాన్ని అయినా, ఆత్మవిశ్వాసంతో చెప్పగల నేర్పు అలవడుతుంది.

**బాడీ లాంగ్వేజ్ :** ఈ తరగతులవల్ల కలిగే మరో ప్రయోజనం పిల్లలకు చక్కని, పద్ధతి అయిన బాడీ లాంగ్వేజ్ అలవడుతుంటుంది. మాటలేకుండా సంజ్ఞలతో వారిలోని భావాలను వ్యక్తంచేయగలుగుతారు.




సామాజిక బాంధవ్యాలను సక్రమంగా నెరపుకోవడంలో ఈ నైపుణ్యం అవసరం చాలా వుంటుంది.

మాటకు ఎంతో శక్తి వుంటుంది. స్పీచ్ అభ్యాసం వున్నప్పుడు చక్కగా విషయాలను వ్యక్తీకరిస్తూ, జీవితంలో అంచెలంచెలుగా రాణించగలరు.

పి.సులోచన

# నానితో నిత్య

సాయిరాం ఆకుండి

నాని ఇప్పుడు కన్ఫ్యూజన్ స్టేజ్ నుంచి క్లారిటీ స్థితిలోనికి వచ్చాడు. ఇప్పుడు అతను ఆరేళ్ళ పిల్లాడనే భావనలో ఉన్నాడు.

ఆ వయసు పిల్లలతో బాగా కలిసి పోయాడు. వాళ్ళతో కలిసి ఆడు తున్నాడు. జట్లు కడుతున్నాడు. కీచులాటలు పడుతున్నాడు. మళ్ళీ కలిసిపోయి ఆటలో చేరువవుతున్నాడు.

బడి సమయం ముగిసినతర్వాత రోజూ సాయంత్రం ఆ వయసు పిల్లలతో ఆటలే.కళ్ళకు గంతలు కట్టుకుని ఎదుటివాళ్ళను తాక డము, అరచేతులతో పంటలు వేసుకుని దొంగా పోలీస్ ఆట ఆడడం, ఇలా అన్ని ఆటల్లోనూ పార్టిసిపేట్ చేస్తూ ఎగ్జయిట్ అవుతున్నాడు నాని.

అతను ఇప్పుడు చంద్రరావ్ సాయం లేకుండా అడుగులు వేస్తున్నాడు. అప్పుడప్పుడూ తడబడు తున్నా, పట్టుతప్పి పడిపోతున్నా మళ్ళీ లేచి నడు స్తున్నాడు కానీ, భయపడడంలేదు.

అలిసిపోతున్నా నడకకే మొగ్గు చూపిస్తున్నాడు కానీ వీల్ ఛెయిర్‌మీదకు దృష్టి మళ్ళడంలేదు. మెడ వంగిపోవడాన్ని నియంత్రించగల్గుతున్నాడు. చొంగ కారడం తగ్గింది. క్రమంగా మాటలో స్పష్టత వస్తోంది. రాగద్వేషాలకు స్పందించగలుగుతున్నాడు.

ఆ వయసు పిల్లలని అనుకరించడంద్వారా తనలో మార్పులు సాధ్యమవుతున్నాయి. ఇలా క్రమపద్ధ తిలో సాగుతున్న సమయంలోనే నిత్య రెండుసార్లు వైజాగ్ వెళ్ళి తల్లిని చూసివచ్చింది.

అమ్మ కళ్ళు తెరిచి మాట్లాడినప్పుడూ, అలాగే ఫ్లాట్‌లో నర్స్ సుగుణని పెట్టి సంరక్షణ ఏర్పాట్లు చేసినప్పుడూ ఉదయాన్నే వెళ్ళి సిటీ పనులు పూర్తి చేసుకుని సాయంత్రంకల్లా దివాణం చేరుకుంది.

ఆ రోజుతో సరిగ్గా ముప్పయ్ రోజులు గడి చాయి. అయినా ఏ మార్పూ లేకుండానే యధా విధిగా గడిచింది.కాని మరునటి రోజు భిన్నంగా మొదలైంది. ఇప్పుడా బడిస్థాయి పెరిగింది. నిన్నటి వరకూ ఉన్న ఐదారు వయసు పిల్లలు లేరక్కడ.

తొమ్మిది పదేళ్ళ వయస్సు వున్న పిల్లలు సుమారు పదిమంది ఉన్నారు.నిర్ణీత సమయానికి మామూలుగానే బడికొచ్చిన నాని ఈ మార్పుని గమనించి అర్థం చేసుకునేం దుకు ప్రయత్నిస్తున్నాడు. కొత్త పిల్లలమధ్య కాస్త బిడియపడుతూ కూర్చున్నాడు.

ఆ పిల్లలు అంతా అప్పుడప్పుడూ యధాలాపంగా కనపడ్డవాళ్ళే గానీ అంతకుమించి పరి చయం లేనివాళ్ళు. చేతినిండా కొత్త పుస్త కాలతో చకచకా నడుచుకు వచ్చింది నిత్య.

"హాయ్... స్టూడెంట్స్ వెల్‌కమ్ టూ ది న్యూ క్లాస్..." తర గతి స్థాయికి తగ్గట్టుగానే ఆమె ముఖకవళికలలోనూ, భావభావాలలోనూ అను కోని కొన్ని మార్పులు కనపడుతున్నాయి.

"కంగ్రాట్స్ నానీ... నువ్వు ప్రమోటు అయ్యావు. నువ్వు యిప్పుడు ఫిఫ్త్ స్టాండర్డ్.." నాని దగ్గరికి నడిచివచ్చి అతనికి షేక్‌హ్యాండ్ చ్చింది నిత్య.

నిత్య స్పందనను అర్థం చేసుకున్న పదిమంది కొత్త పిల్లలు అందరూ

నవ్వుతూ వచ్చి నానిని గ్రీట్ చేశారు. నాని మొహం ఇంతలా వెల్లిపోయింది.

"సో ఇది కొత్త క్లాస్ కాబట్టి అందరూ తమని తాము ఇంట్రడ్యూస్ చేసుకోవాలి. అంటే పేరు చెప్పాలి... ఇంకా పేరెంట్స్ పేర్లూ, తమకి ఇష్టమయిన సబ్జెక్ట్ పేరూ, ఇంకా నచ్చిన ఆట పేరు కూడా చెప్పాలి.."

ముందర బెంచీలో కూర్చున్న చింటూ చటుక్కున లేచాడు "టీచర్ నా పేరు సుకుమార్... ముద్దు పేరు చింటూ. మా నాన్న సూర్యనారాయణ. అమ్మ వరలక్ష్మి... నాకు ఇంగ్లీషంటే భయం, ఇంకా ఇష్టమే. క్రికెట్ అంటే ఇష్టం..." తల ఊపుతూ వింటూ క్లాప్స్ ఇచ్చింది నిత్య.

చింటూ ఇలా కూర్చున్నాడో లేదో రెండవ బెంచీలోని సూర్యకుమారి లేచింది. పెద్దగా నవ్వేస్తూ తన గురించి చెప్పేసింది "మరి టీచర్. మా నానమ్మ పేరే నా పేరన్నమాట. అమ్మ సీతాలు, నాన్న సాధూరావు... నాకేమో తెలుగు మంచిగ అనిపిస్తుంది. ఆటల్లో కబాడీ బాగుంటుంది టీచర్" ఒక ప్రత్యేకమయిన యాక్సెంట్‌తో సూర్యకుమారి చెప్పిన మాటలందర్నీ నవ్వించాయి.

మిగిలిన పిల్లల్నీ కవర్ చేశాక నానివైపు తిరిగింది నిత్య- "నానీ నీ గురించి నాకు తెల్సు. బట్ వీళ్ళకి తెలియాలి కదా... నీ గురించి చెప్పు" అంది.

కాస్త బిడియం అనిపించినా మిగతా పిల్లలు అంత ధైర్యంగా మాట్లాడగలిగినప్పుడు తనకేం అనిపించింది నానికి. లేచి నిలబడ్డాడు. పదాలకోసం వెతుక్కున్నాడు. 'నేను... నేను.... నానీ" అని ఇంకా మాట్లాడబోయేంతలో కలుగజేసుకుంది నిత్య.

"ముద్దు పేరు సరే నీ అసలు పేరు... పూర్తి పేరేంటి?" చెప్పు అంది.

"నా పేరు... నా పేరు... రాజా వేంకట కృష్ణసాగర బహదూర్..." అని శ్రమ తీసుకుంటూనే తన పూర్తి పేరు చెప్పగలిగాడు నాని.

"మా నాన్నగారు రాజా వీర రాఘున మహీపతి రాజానంద... అమ్మ రాణీ చిన్నమాంబాదేవీ జయప్రభ..." కూడబలుక్కుంటున్నప్పటికీ నాని స్పష్టంగా చెబుతూండడంతో అందరూ క్లాప్స్ ఇస్తున్నారు.

"నాకు లెక్కలు అంటే నచ్చుతుంది" ఇలా చెపుతున్నప్పుడు అతని దృష్టి వైట్ బోర్డుమీదున్న సున్నామీద కేంద్రీకృతమయివుండడాన్ని నిత్య గమనించింది. వెంటనే అతనేం చెబుతాడో కూడా కరక్టుగా ఊహించగలిగింది.

"నాకు ఫుట్‌బాల్ ఆట అంటే చాలా ఇష్టం" అన్నాడు నాని.

అందరూ చప్పట్లు కొడుతుంటే థ్యాంక్స్ చెబుతున్నట్లు చిరునవ్వుతో చూశాడు నాని. అలా పరిచయాలతో మొదలవడంతో ఇంచుమించు అందరి పేర్లూ నానికి గుర్తుండిపోయాయి.

ఆ రోజు లగాయితు రెండు నుంచి ఐదో తరగతివరకూ ఉండే సిలబస్‌ని తను ప్రత్యేకంగా తయారుచేసుకున్న నోట్స్ సాయంతో కవర్ చెయ్యడం మొదలెట్టింది నిత్య.

పది సంవత్సరాల వయసు పిల్లల తీరుతెన్నులు ఎలా ఉంటాయో అధ్యయనం చేసి నోట్స్ తయారుచేసుకున్న నిత్య నానిమీద నెగెటివ్ ఇంపాక్ట్ పడకుండా ఉండేలా చూసుకుంటూ తన ఆలోచనలను అమలుచేస్తోంది.

ఒక వారం రోజులు గడిచేసరికి నాని పదేళ్ళ వయసులో ఉండే మానసిక పరిపక్వత దగ్గర స్థిరపడిపోయాడు. ఇప్పుడున్న పిల్లల సమవయస్కుడిలా భావిస్తూ అదే రీతిన ప్రవర్తిస్తున్నాడు.

చదువూ, ఆటలూ, పాటలూ అన్నీ వయస్సుకి తగ్గవిధంగా సాగిపోతున్నాయి. సరిగ్గా అలాంటి సిట్యుయేషన్లో పోటీతత్వానికి తెరతీసింది నిత్య.

నానితో కలిపి మొత్తం పదకొండు మంది ఉన్నప్పటికీ ఓ కుర్రాడు చేయి ఫ్రాక్చర్ అయ్యి బ్యాండేజీ కట్టుమీద వున్నందున అతనిని పక్కనపెట్టి

## జరిగిన కథ 11

తన తల్లి కండిషన్ నార్మల్‌గా ఉందని తెలిసి సంతోషపడ్తుంది నిత్య. పంచవటిలో పనిచేసే నూకరత్నం, మిగతా పనివాళ్ళు తన పట్ల చేసే నిరసనల్ని గమనించి అసలు తనెందుకు ఇక్కడికొచ్చిందీ చెప్పడం ప్రారంభిస్తుంది నిత్య.

ఆ తరువాత ఆమె చెప్పిందంతా తమ శ్రేయస్సుకోసమేనని అర్థం చేసుకుంటారు. దివాణం పదికాలాలపాటు పచ్చగా ఉండాలంటే అబ్బాయిగారైన నాని బాగుపడాలని కోరుకుంటారు పంచవటిలో పనిచేసేవాళ్ళంతా.

నిత్యను అపార్థం చేసుకున్నందుకు పశ్చాత్తాపపడుతుంది నూకరత్నం. రవళి, మంజుల, చంద్రరావు అంతాకూడా నిత్య మాటలకు ప్రభావితులవుతారు.

బాలశిక్ష సాయంతో నానికి అక్షరమాలను నేర్పుతుంది నిత్య.

గట్టుమీదనుండి పడబోయిన ఓ పసిబిడ్డను రక్షిస్తాడు వీల్‌ఛెయిర్‌లో నుండి పరిగెత్తిన నాని.

అదంతా నిత్య వ్యూహమని అతనికి తెలీదు. అంతా అతని సాహసాన్ని పొగడడంతో గర్వంగా ఫీలౌతాడు నాని. చంద్రరావు సాయంతో నాని మెల్లగా నడవడం మొదలుపెడతాడు. ఇక చదవండి.

మిగిలిన పదిమందిని రెండు గ్రూపులుగా విభజించింది నిత్య.

"ఈ అయిదుగురూ ఒక గ్రూప్... ఈ గ్రూప్ పేరు ఆల్ఫా..." ఏదో కొత్త కాన్సెప్ట్‌తో నిత్య స్టార్ట్ చెయ్యబోయే ఈవెంట్ ఏమిటి అన్న ఉత్సాహం వెల్లుబుకుతూంటే ఎగ్జయిటింగ్‌గా చూస్తున్నారు అందరూ.

"ఆల్ఫా గ్రూపులీడర్ చింటూ" నిత్య సైగ చేసినమీదట అతను బెంచిమీదనుంచి లేచి వచ్చి నిత్య పక్కన నిలబడ్డాడు.

"సో... ఇక రెండో గ్రూప్ పేరు... బీటా..." మరో పేరు ఎనౌన్స్ చేసింది నిత్య "మరి ఈ గ్రూపు లీడర్ ఎవరు అంటే..." ఇలా అని ఆగిపోవడంతో సస్పెన్స్ నెలకొంది. ఆమె ఎవరి పేరు చెబుతుందా! అన్న ఆసక్తితో కళ్ళార్పకుండా చూస్తున్నారందరూ.

"ఈ గ్రూప్ లీడర్..." మరోసారి పాజ్ ఇచ్చిన నిత్య కొద్ది సెకన్లతర్వాత సస్పెన్స్‌ని బ్రేక్ చేసింది "బీటా గ్రూప్ లీడర్ నాని" అందరూ క్లాప్స్ ఇస్తూంటే నానిమాత్రం షాక్ అయ్యాడు.

తన పేరుని టీచర్ చెబుతుందని ఏమాత్రం ఊహించని అతను కలవరపాటుకి గురయ్యాడు. తనకేం తెలియని పని అప్పజెప్తే చెయ్యడం ఎలా అన్న ప్రశ్న మెదులుతోంది.

స్టూడెంట్స్ మాత్రం నానిని లీడర్‌గా ఎన్నుకోవడాన్ని చప్పట్లతో ఆహ్వానించారు. నిత్య చెప్పినమీదట నాని కూడా లేచొచ్చి చింటూపక్కన నిలబడ్డాడు.

"ఇక మిగిలిన ఎనిమిదిమందీ ఒక్కో టీమ్‌కి నలుగురు చొప్పున వెళతారు" నిత్య ఒక్కొక్కర్నీ చూస్తూ ఎటుపక్క వెళ్ళాలో సర్దుబాటు చేస్తోంది.

సూర్యకుమారి మాత్రం తాను చింటూ టీమ్‌లో ఉంటానంటూ నిత్యని బతిమాలడం మొదలెట్టింది.

సరే అలాగే కానీమన్నట్లు నిత్య తలూపడంతో ఆమె చింటూ గ్రూప్‌లో చేరింది. సూర్యకుమారికి చింటూ అంటే కాన్ఫిడెన్స్... నమ్మకం... పిచ్చి... అంతకుమించి అభిమానం.

ఇది ఎలా మొదలయిందో ఎప్పుడు మొదలైందో తెలీదు. బహుశా చింటూ అసలు పేరు తనపేరుకి దగ్గరగా ఉండడంచేత ఈ ఇంట్రెస్ట్ పెరిగిందేమోనని మిగతావాళ్ళు అనుకునే మాట.

ఈ భావోద్వేగం చింటూని అప్పుడప్పుడూ ఇబ్బంది పెట్టేస్తుంటుంది. మొత్తానికి అందర్నీ సర్దుబాటుచెయ్యడమయ్యాక ఇటూ అటూ అయిదుగురేసి చొప్పున నిలబడ్డారు.

"సో... ఆల్ఫా వర్సెస్ బీటా... ఈ రెండు టీముల మధ్యా పోటీ... మీ రెండు టీములకీ ఒక గ్రాండ్ క్విజ్ కంటెస్ట్ ఉంటుంది.

ఇవాల్టినుంచి ముప్ఫయ్యోరోజున ఉంటుందా పోటీ. ఏ టీమ్ ఎలా ఆడి గెలుస్తుందో చూద్దాం" నిత్య అసలు సంగతి చెప్పాక అక్కడంతా సందడిగా మారింది. ఆటలు అనగానే నాని సరదా చెప్పనలవికాదు.

"ఉదయం నుంచి సాయంత్రం నాలుగువరకూ చదవడం... ఆ తరువాత ఆరువరకూ మీరు ప్రాక్టీసు చేసుకోవడం... టీమ్ అందరూ కలిసి రివ్యూ చేసుకోవడం, గ్రాండ్ క్విజ్ గెలిచే టీమ్‌కి ఈ షీల్డ్‌తో పాటు ఇంకొన్ని ప్రయిజులుంటాయ్" నిత్య తన బ్యాగులోంచి ఒక షీల్డ్ తీసింది.

మిలమిల వెండిమెరుపు మెరుస్తున్న ఆ షీల్డ్ చాలా ముచ్చటగొలుపుతోంది. దాన్ని చూస్తున్న వాళ్ళందరికీ చాలా ఎగ్జయిటింగ్‌గా ఉంది "చూద్దాం.. విన్నర్ ఎవరవుతారో ఆల్ఫానా? బీటానా?"

అందరికీ కనపడేలా టేబుల్ మీద షీల్డుని ఉంచింది నిత్య "ఈ నెల్లాళ్ళూ ఇది ఇక్కడే ఉంటుంది. ప్రతీరోజూ మీ కళ్ళముందరే కనిపిస్తుంటుంది. అక్కడ్నుంచీ మొదలైంది పోటీ వాతావరణం.

అందరూ రెండు వర్గాలుగా చీలిపోయి అటూ ఇటూ కూర్చున్నారు. చివరిగా నిత్య క్లారిఫై చేసింది.

"స్టూడెంట్స్... మీ పోటీ, కాంపిటీషన్, సవాల్, ఛాలెంజ్... పోటీ జరిగేంతవరకూమాత్రమే. ఆ తర్వాత మీరంతా బెస్ట్‌ఫ్రెండ్స్... ఓకేనా?"

"ఎస్ టీచర్..." ముక్తకంఠంతో అన్నారందరూ.

అప్పట్నుంచీ సిలబస్ ప్రకారం అన్ని సబ్జెక్టులకీ పీరియడ్స్‌ని నిర్ణయించి, ఆ ప్రకారంగా క్లాసులు మొదలయ్యాయి. రవళీ, మంజులకు కూడా కొన్ని సబ్జెక్టులు అప్పజెప్పింది.

ఇంగ్లీషు, మ్యాథ్స్‌తోపాటు జనరల్ నాలెడ్జి అంశాలు తను చెపుతుండగా మిగిలిన సబ్జెక్టులు చెప్పే బాధ్యత రవళీ, మంజులా తీసుకున్నారు.

ఈ నెల్లాళ్లపాటు బడిలో చెప్పే విషయాలమీదే క్విజ్ ఉంటుందని చెప్పడంచేత రెండు టీములవాళ్ళూ చాలా కేర్‌ఫుల్‌గా టీచర్లని ఫాలో అవుతున్నారు. చింటూ తన టీమ్‌లోని మెంబర్సుతో మాటిమాటికీ మాట్లాడుతూ ఆ రోజు టీచర్ చెప్పిన పాఠం మీద ఎలాంటి ప్రశ్నలు రావచ్చు అనేది చర్చిస్తున్నాడు.

చింటూ మూవెంట్స్‌ని అబ్జర్వ్ చేస్తూ క్రమంగా నానికూడా లీడర్‌షిప్ బాధ్యతలను అందిపుచ్చుకుంటున్నాడు. తన టీమ్ మెంబర్స్‌తో పదే పదే గుమిగూడుతున్నాడు.

ఏం చేద్దాం! ఎలా చేద్దామని! అడుగుతున్నాడు. అందరూ శ్రద్ధగా నోట్సు రాయాలని తీర్మానించుకున్నారు.

ఒక్కొక్కరూ ఒక్కో సబ్జెక్టులో లీడ్ తీసుకుని ప్రిపేర్ అవ్వాలని నిర్ణయించుకున్నారు. ఎదుటి వర్గంలోనివాళ్ళు ఎలాంటి స్టాండ్ తీసుకుంటున్నారో నిశితంగా గమనించడం, అందుకు అనుగుణంగా తమ విధానాలను మార్చుకోవడం ఇలా రెండువైపులా కొనసాగుతోంది.

ఇదంతా తానేం పట్టించుకోనట్లే దన్న ఫీల్ ఇస్తున్నప్పటికీ నిగూఢంగా నిత్య అంతా గమనిస్తోంది.

అవసరమయిన చోట ఇన్‌డైరెక్టుగా గైడెన్స్ ఇస్తోంది. గడిచిన నెలకీ, ఈ నెలకీ బడి నడపడంలో నిత్య చూపుతున్న వైవిధ్యానికి అందరూ మెస్మరైజ్ అవుతున్నారు.

ఎంతైనా ఫిన్లాండులో చదువుతూ బ్రేక్ ఇచ్చి వచ్చిన నిత్య విద్యాబోధనలో కూడా తనదైన ప్రజ్ఞ చూపుతోంది.



సినీరంగంలో బోలెడంత సెక్సిజం వుంది... అది బాహాటంగా కనిపించదు... అంతర్లీనంగా వుంటుంది.
-నందితా దాస్, దర్శకురాలు



## అదేం లేదు

ఓ జంట కలసి కనిపిస్తే చాలు, వారిమధ్య ఏదో ఉందంటూ ఒకటే పుకార్లు రేగుతుంటాయి. ఈ మధ్య పరిణీతిచోప్రా చుట్టూ కూడా ఇవే పుకార్లు పరిభ్రమిస్తున్నాయి. అర్జున్‌కపూర్‌తో పీకల్లోతు ప్రేమలో ఉందన్న వార్తలు జోరుగా షికారు చేస్తున్నాయి.

పెళ్ళి ఎప్పుడంటూ నెటిజన్లు ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. తాను పెళ్ళికి ఖాళీగా లేనని పరిణీతి జవాబిస్తే, తనకింకా పెళ్ళివయస్సు రాలేదని.చిన్నవాడినంటూ అర్జున్‌కపూర్ చెప్పుకున్నాడు.ఇద్దరూ కలసి నటించిన 'సందీప్ ఔర్ పింకీ ఫరార్' సినిమా ప్రమోషన్‌కోసం ఓ మేగజైన్‌కు ఇద్దరూ కొత్త దంపతులుగా ఫోటోలకు పోజులిచ్చారు.ఇవి సోషల్ మీడియాలో వైరల్ అయ్యాయి.

గత నెలలో ఆటలకీ, ఇంటరాక్షన్‌కీ ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చిన నిత్య ఈ నెల చదువుకీ, పోటీతత్వం పెరగడానికీ, నాయకత్వ లక్షణాలను వెలికి తీయడానికీ ప్రాముఖ్యత ఇచ్చిన విషయము అర్థమవుతోంది.

అదే తీరున నాని ధోరణిలో కూడా మార్పు కొట్టొచ్చినట్లు కనపడుతోంది. చురుకుదనం, పోరాట పటిమ, విశ్లేషించే గుణం ఇలాంటివన్నీ అతని మూమెంట్స్‌లో కనిపిస్తున్నాయి.

గత కొద్దిరోజులుగా నాని రాత్రిళ్ళు మధ్యరాత్రప్పుడు లేచి పుస్తకాలు చదవడాన్ని గమనించినట్లుగా చంద్రావు చెప్పాడు.

ఇదిలా ఉంటే పంచవటి జనాలకి వేరేరకంగా ఎగ్జైటింగ్‌గా ఉంది. టీచర్ల హైరానా, పిల్లల హడావుడీ చూస్తుంటే ఇదేదో వరల్డ్ కప్పు పోటీకి సమాయత్తమవుతున్నట్లు అనిపిస్తోంది. అలా చూస్తుండగానే నెల గడిచిపోయింది.

మర్నాడు శనివారం మధ్యాహ్నాం రెండు గంటలకి నడిం వాకిటి నడిబొడ్డున క్విజ్ కంటెస్ట్ జరుగుతుంది. అందుకోసం ఏర్పాట్లు కూడా జరుగుతున్నాయి. ఇటూ అటూ రెండు టీములూ కూర్చునేందుకు వీలుగా బల్లలని ఏర్పాటుచేశారు.

మధ్యలో ఒక టేబుల్... దానిమీద ఎల్సీడీ ప్రొజెక్టర్... దాన్నుంచి ప్రజెంటేషన్ చేసేందుకు వీలుగా కాస్త దూరంలో స్క్రీన్. వీటితోపాటు మైక్ సెట్. మరోపక్క స్కోర్ రికార్డు చెయ్యడానికి ఒక పెద్ద సైజు వైట్ మార్కర్ బోర్డ్. నాలుగురోజుల క్రితమే పీటన్నింటినీ సిటీనుంచి తెప్పించింది నిత్య.

రేపటి క్విజ్ కోసం పూర్తిస్థాయిలో సమాయత్తం అవడానికి పిల్లలంతా నెల్లాళ్ళనుంచీ బోధిస్తున్న సిలబస్‌ని పునశ్చరణ చేయడంలో తలమునకలయ్యారు. మర్నాడు తెల్లారాక యథాలాపంగా నడింవాకిట్లోకి వచ్చి చూసే వాళ్ళకి అక్కడ కనిపిస్తున్న ఏర్పాట్లు కుతూహలాన్ని కలిగిస్తున్నాయి.

ఆల్ఫా బీటా రెండు టీములనూ విష్‌చేస్తున్నట్లు రెండుపక్కలా బ్యానర్లు వెలిశాయి. షీల్డ్‌తోపాటు మరిన్ని ప్రైజ్‌లు గిఫ్ట్ ప్యాక్ చేయబడ్డవన్నీ పొడుగాటి టేబుల్‌మీద పేర్చబడివున్నాయి.

ఇక ఆడియన్స్ వరండాల్లో కూర్చొని వీక్షించేందుకు వీలుగా దళసరి జంబుఖానాలు పరచపడి వున్నాయి. పంచవటిలో ఎన్నడూ చూడని హడావుడీ నెలకొంది. ఈ పోటీలో ఎవరు గెలుస్తారో అన్న ఆసక్తితో జనం గుమిగూడి మాట్లాడుకుంటున్నారు.

అబ్బాయిగారు గెలిచేస్తారేమో అనుకుంటూనే ఒకవేళ తను ఓడిపోతే పరిస్థితి ఏంటి అన్న ప్రశ్నకు తోచినవిధంగా సమాధానంచెప్పుకుంటూ గుసగుసలు పోతున్నారు. టీచర్లు ఏదోలా అబ్బాయిగార్ని గెలిపించేస్తారేమో అని కొంత మంది ఊహించుకుంటున్నారు.

ఇలాంటి ఊహాగానాలమధ్య తెలీకుండానే మధ్యాహ్నాం అయిపోయింది. లంచ్ ముగించిన వాళ్ళంతా ఇక్కడికే చేరుకుంటున్నారు. సరిగ్గా ఒంటిగంటన్నర అయ్యేసరికి రెండు టీములూ అక్కడికి చేరుకున్నాయి.

తమకోసం కేటాయించిన సీట్లలో కూర్చున్నారు.

మిగతా పిల్లలతోపాటు తల్లులూ, పనేం లేని తండ్రులూ వరండాల్లో తచ్చాడుతున్నారు. ఇంకో పదినిమిషాల్లో నిత్య, ఆమెతోపాటు రవళీ, మంజులా అక్కడికి చేరుకున్నారు.

అంతవరకూ తమలో తాము గుమిగూడి మాట్లాడేసుకుంటున్న పోటీదారులంతా సైలెంట్టైపోయారు.

"గుడ్ ఆఫ్టర్ నూన్ స్టూడెంట్స్... రవళి మేడమ్, మంజులా మేడమ్ అండ్ మైసెల్ఫ్... ఉయ్ వెల్ కమ్ యూ ఫర్ ది గ్రాండ్ కంటెస్ట్..."

నిత్య తన ల్యాప్‌టాప్‌ని ఎల్సీడీ ప్రొజెక్టర్‌కి కనెక్ట్ చేసింది. కొద్ది క్షణాల తర్వాత ఆమె ల్యాప్‌టాప్ ఫోల్డర్ ఎల్సీడీ స్క్రీన్‌మీద కనిపిస్తోంది.

"సో... స్టూడెంట్స్... ఈ కంటెస్ట్ గంటన్నరపాటు సాగుతుంది. అన్ని ప్రశ్నలూ దృశ్యరూపంలోనే అంటే విజువల్ ఇమేజెస్‌లాగే స్క్రీన్‌మీద కనిపిస్తాయి. ప్రతీ ప్రశ్నకూ మల్టిపుల్ ఆన్సర్స్ ఉంటాయి. ఒక్క నిమిషం వ్యవధిలో టీమ్‌నుంచి ఒకరుమాత్రమే ఆన్సర్ చెయ్యాలి..."

నిత్య చెపుతున్న పోటీని నిబంధనలను జాగ్రత్తగా వింటున్నారందరూ.

"ప్రశ్నని సెలక్టు చెయ్యడానికి ఒక కంప్యూటర్ అప్లికేషన్ వాడుతున్నాం. మీ టర్న్ వచ్చినప్పుడు డాటా బేస్‌లో ఉన్న వందలాది ప్రశ్నల్లోంచి రాండమ్‌గా ఒక ప్రశ్నని సిస్టమ్ సెలక్ట్ చేస్తుంది.

ఏ ప్రశ్న ఇవ్వాలన్నది మనం ప్రపోజ్ చేయలేం. అంతా కంప్యూటర్ ప్రోగ్రాంలోని లాజిక్ చేస్తుంది. ఇందులో ఎవరు ఏమీ చెయ్యడానికి లేదు"

అడ్వాన్స్‌డ్ విధానంలో కండక్టు చెయ్యబోయే క్విజ్‌మీద అంచనాలు పెరిగిపోతున్నాయి.

"తప్పు చెబితే ఆ ప్రశ్న తదుపరి టీమ్‌కి పాస్ ఆన్ అవుతుంది. వాళ్ళు కరెక్టుగా చెప్పగలితే అరమార్కు ఇవ్వబడుతుంది" స్కోరర్ బాధ్యతలను మంజుల తీసుకుంది. నిత్య మోడరేటర్‌లా వ్యవహరిస్తూండగా రవళికి ల్యాప్‌టాప్ బాధ్యత అప్పజెప్పింది.

సరిగ్గా రెండు గంటల సమయం అయినట్లు బెల్ మోగినతర్వాత ఈవెంట్ మొదలయింది.

"తొలి రౌండ్‌లో సైన్సులో కవర్ చేసిన టాపిక్స్‌మీద ప్రశ్నలుంటాయి. ముందుగా ఆల్ఫా టీమ్‌కి ఈ ప్రశ్న" ల్యాప్‌టాప్‌కీ బోర్డుమీది బటన్‌ని ప్రెస్ చేసింది రవళి.

ఎల్సీడీ స్క్రీన్‌మీదవరసగాఏబీసీడీలతో నాలుగు ఇమేజీలు ప్రత్యక్షమయ్యాయి. "ఇక్కడ ఉన్న పక్షులలో ఎగరలేని పక్షి ఏది?"

అంతా నిశ్శబ్దం ఆవరించి ఉంది. ఆల్ఫా టీమ్ మెంబర్లంతా గుమిగూడి డిస్కస్ చేసుకున్నారు. ఒకటికి రెండు సార్లు నిర్ధారించుకున్నాక చింటూ లేచి నిలబడి సమాధానం చెప్పాడు.

నిత్య కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది. రవళి కూడా అదే టెంపో మెయింటెన్ చేసింది. "బాగా ఆలోచించుకునే చెపుతున్నారా? కావాలంటే మరోసారి డిస్కస్ చేసుకోండి"



## ▸ తిండే తిండి!

టెలివిజన్‌లో ఫేమ్ అయిన రాధికా మదన్ బాలీవుడ్‌లో 'పటాఖ' చిత్రంతో ఎంట్రీ ఇస్తున్నది. ఈ సినిమాలో పాత్రకోసం రాధిక ఏకంగా పదికిలోల బరువు పెరిగింది. వినోదభరితంగా సాగే ఈ పాత్ర బాడీలాంగ్వేజ్ కోసం ఆమె బరువు పెరగాల్సివచ్చింది.

నెలరోజుల్లో కొద్ది కిలోల బరువు పెరిగానంటూ హుషారుగా చెప్పింది. "నేను బరువు తగ్గకుండా ఉండేందుకు సెట్‌లో ప్రతి ఒక్కరూ శ్రద్ధ చూపారు. క్రమంతప్పకుండా నా బరువును మానిటర్ చేస్తూ, అవసరమైన ఆహార సలహాలు ఇచ్చారు. సన్నగా కనబడ్డానంటే లంచ్‌లో స్వీట్లు, అరటిపండ్లు పెట్టేవారు. తినడం మినహా మరో ఆప్షన్ లేదు" అంటూ నవ్వేసింది.



విద్యాసంస్థలు నిధులకోసం ప్రభుత్వాన్ని అడగటంకన్నా తమ పూర్వ విద్యార్థులను ఆశ్రయించాలి.

-ప్రకాశ్ జవదేకర్, కేంద్రమంత్రి

ఎందుకయినా మంచిదని చింటూ మిగతావాళ్లతో ఓసారి మాట్లాడి కన్ఫర్మ్ చేశాడు "మా ఆన్సర్ కరక్టే టీచర్" ఓకే అనేసి రవళికేసి చూసింది నిత్య.

ఆమె సంజ్ఞని అర్థంచేసుకుని ఆన్సర్‌ని రిలీవ్ చేసింది రవళి "యస్... కరక్ట్ ఆన్సర్... ఆల్ఫా టీమ్ గాట్ వన్ పాయింట్"

తొట్టతొలి మార్క్ సాధించడంతో ఆల్ఫా టీమ్ మెంబర్లు చప్పట్లుచరుస్తూ గోల చేశారు. మంజుల బోర్డుమీద స్కోర్ అప్‌డేట్ చేసింది.

"తర్వాత ప్రశ్న బీటా టీమ్‌కోసం" స్క్రీన్‌మీద ప్రశ్న మారింది.

ఈసారి వాల్లు జంతువుల బొమ్మ లున్నాయి. "వీటిల్లో మాంసాహారం తినని జంతువు ఏది?"

బీటా టీమ్‌లోని మెంబర్లందరూ చర్చించుకున్నారు. నాని ఒక్కొక్కళ్ళతో మాట్లాడి ఎవరయినా వేరే ఆప్షన్ కరక్టు అనుకుంటున్నారా అన్నది డిస్కస్ చేశాడు. అందరూ ఏకాభిప్రాయానికి వచ్చాక నిలబడి ఆన్సర్ చెప్పాడు.

నాని టీమ్‌కి మార్క్ వస్తుందా! రాదా! అన్న ఉత్కంఠతో చూస్తున్నారంతా. కొద్ది క్షణాల సస్పెన్స్ తరువాత ఆ ఆన్సర్ కరక్టే అని నిర్ధారించింది రవళి. దాంతో ఇటుపక్క టీమ్‌లో కూడా చప్పట్లు మార్మోగాయి.

ఆలా పాజిటివ్‌గా మొదలైన పోటీ నువ్వా! నేనా! అన్నట్లు కొనసాగుతోంది. ఒక్కోసారి ఆల్ఫా టీమ్ ఒకట్రెండు పాయింట్లు ఎక్కువ ఉంటే మరోసారి బీటా టీమ్ దాటుతోంది.

ఆడియన్స్ మాత్రం రెండు టీము వాళ్ళనీ ఎంకరేజ్ చేస్తున్నారు.

ఈజీగా సమాధానాలు చెప్పగల ప్రశ్నలనుంచి మొదలుపెట్టి కొంచెం కఠినమయిన ప్రశ్నలనీ సంధిస్తోంది కంప్యూటర్ ప్రోగ్రామ్. అలాంటప్పుడు మార్కులు కోల్పోయే పరిస్థితిని రెండు టీములూ ఫేస్ చేస్తున్నాయి.

సైన్సూ, జనరల్ నాలెడ్జితోపాటు మ్యాథ్స్, ఇంగ్లీషు, సోషల్ అన్ని సబ్జెక్టుల నుంచీ ప్రశ్నలు కురుస్తున్నాయి.

గంటన్నర గడిచిపోయినట్లుగా బెల్ మోగింది. విచిత్రం ఏమిటంటే రెండు టీమ్‌ల స్కోరూ సమానంగా ఉండడం. ఇప్పుడేం చేస్తారో అన్న సందేహం నెలకొంది. "స్టూడెంట్స్... ఇలాంటి పరిస్థితి ఊహించి ఒక ప్లాన్ సిద్ధం చేసివుంచాం. అదేంటంటే బజ్జర్ రౌండ్.

టీమ్ లీడర్స్‌కి బజ్జర్ యూనిట్స్ ఇస్తాం. ప్రశ్న స్క్రీన్‌మీద రాగానే ఎవరు ముందుగా బజ్జర్ ప్రెస్ చేస్తారో వాళ్ళకి సమాధానం చెప్పే అవకాశం ఇస్తాం.

తప్పు చెప్తే ఇక ఆ ప్రశ్న పాస్ ఆన్ అవదు. ఇలా మూడు కొత్త ప్రశ్నలు అడగడం జరుగుతుంది. ఈ రౌండులో ఎక్కువ స్కోరు చేసే టీమ్‌ని విన్నర్‌గా డిక్లేర్ చెయ్యడం జరుగుతుంది"

నిత్య ఇచ్చిన వివరణ అందరికీ అర్థమయింది. కొద్దినిమిషాల వ్యవధి తర్వాత బజ్జర్ రౌండ్ స్టార్ట్ అయ్యింది. "మొదటి ప్రశ్న..." స్క్రీన్ మీద ఇమేజ్ ఇలా వచ్చిందో లేదో క్షణకాలం వ్యవధిలో చింటూ బజ్జర్ నొక్కేశాడు.

నాని టీమ్ మెంబర్లు నిరాశపడిపోయారు. తడుముకోకుండా చింటూ కరక్టు ఆన్సర్ చెప్పేశాడు.

"బజ్జర్ రౌండులో ఆల్ఫా టీమ్ మొదటి పాయింట్ సాధించింది. ఇంకా రెండు ప్రశ్నలు ఉన్నాయి..."

వరండాల్లో నిలబడి వీక్షిస్తున్నవారిలో ఓ కార్నర్ దగ్గర ఆడాళ్ళ గుంపు ఉంది. వాళ్ళమధ్య గుసగుసలు పెరిగాయి. నూకరత్నం సన్నని గొంతుతో మిగతా వాళ్ళతో మాట్లాడుతోంది.

**ఇంకా ఉంది**

పర్సనల్ ఎజెండా

# ఎలెనా ఫెర్నాండెజ్

అనేక కమర్షియల్స్ చేస్తూ, అలా... అలా అల వోకగా సినిమాల్లోకి కాలుపెట్టింది ఎలెనా ఫెర్నాండెజ్. 'కపూర్ & సన్స్'లో క్యామియోతో బాలీవుడ్‌లో తొలి సినిమా చేసింది. ఆమె వ్యక్తిగతంలోకి వెళ్తే-

▸ **బాలీవుడ్ బ్రేక్:** నిజాయితీగా చెప్పాలంటే అనకాశాల కల వుంది కాని, తీరుతుందని అనుకోలేదు.

ధర్మా ప్రొడక్షన్స్‌నుంచి పిలుపు వచ్చింది. అలా క్యామియో అప్పియరెన్స్ వచ్చింది

▸ **నా మూలాలు :** అవి ఏంటో చెప్పనా... సగం ఇండియన్, సగం దక్షిణ అమెరికా

▸ **ఈ మూలాలవల్ల:** సినీ పరిశ్రమలో ఎటువంటి ఇబ్బందులూ నాకు ఎదురవలేదు.

అదృష్టంకొద్దీ సపోర్ట్ వాతావరణం ఉంది. నా మిక్స్‌డ్ సంస్కృతి నాకో గుర్తింపును ఇస్తూ వచ్చింది

▸ **భాషాపరమైన ఇబ్బందులు :** నేను హిందీ అర్థం చేసుకోగలను. అభ్యాసం కొనసాగిస్తున్నాను.

ఇండియా వచ్చిన కొత్తలో కమ్యూనికేట్ చేయడం కష్టంగా వుండేది. ఎదుటివారు మాట్లాడుతున్నప్పుడు వినడానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేదాన్ని. దీనివల్ల పదాలు ఎలా పలకాలో బాగా అర్థం అయింది

▸ **నేను నిజంగా:** చాలా అదృష్టవంతురాలిని. నా కాస్టింగ్ దర్శకులు, నిర్మాతలు నేను స్క్రిప్టు చదువుకునే విషయంలో చాలా సహనంగా సపోర్ట్ ఇచ్చారు

▸ **మగవాడిలో నన్ను ఆకర్షించేది:** పర్సనాలిటీ, జంతు ప్రేమ, తను భద్రతగా వుంటూ అవసరంలో వున్న వారిని ఆదుకునే మగవారంటే నాకు ఇష్టం.

చరిత్రను, రాజకీయాలను,ఇతర అంశాలను చర్చించే వ్యక్తి అంటే చాలా ఇష్టం

▸ **మగవాడిలో నచ్చనిది:** అహం.కరుణ లేకపోవడం

▸ **నా వెంట వుండే మూడు అత్యవసరాలు:** వాటర్ బాటిల్, పిల్లులకు ఫుడ్, హ్యాండ్ శానిటైజర్.

వీధుల్లో తిరిగే జంతువులకు ఎప్పుడూ ఆహారం పెడుతుంటాను

▸ **బాలీవుడ్‌లో నా దృష్టిలో హాటెస్ట్ :** ఐశ్వర్యారాయ్ బచన్. తను పర్‌ఫెక్ట్. అందమైనది

▸ **నాకే సూపర్ పవర్ వస్తే :** బాధల్ని తీసేస్తా. జంతువులు, మనుషులు నొచ్చుకోకుండా వుండేలా చేస్తా

▸ **నేనిచ్చే ఆరోగ్య, అందాల టిప్స్:** క్యాలరీల లెక్కలు వద్దు. శరీరానికి పోషకాలు అందించాలి.

శరీరం చెప్పే మాట వినాలి. నియంత్రణలు విధించుకుంటే సంతోషం వుండదు. చిరాగ్గా వుంటుంది. చర్మాన్ని ఎప్పటికప్పుడు ఎక్స్‌ఫాలియేట్ చేస్తే చాలు



చందమామ రావే

# అపాత్రుడికి వరం



ఒక ఊళ్ళో రంగడు అని ఒక పనికిమాలిన కుర్రవాడు ఒకడు ఉండేవాడు. వాడి తల్లి వడలుచేసి అమ్ముతూ ఇళ్ళు గడిపేది. రంగడికి చదువు ఏ మాత్రమూ అంటలేదు.

కాని వాడుమాత్రం తాను చాలా తెలివిగల వాడిననీ, తన తెలివితేటలు ఎవరూ అర్థంచేసుకొనటంలేదనీ అనుకునేవాడు.

వడలు అమ్మటంలోనైనా రంగడు తనకు సహాయపడతాడేమో, తాను మరేదన్నా పనులు చూసుకోవచ్చునని తల్లి ఆశపడింది.

కాని, రంగడు వడలుకొనేవాళ్ళతో పోట్లాటలు తెచ్చుకుని,తల్లి ఆశ నిరాశచేశాడు. చివరకు ప్రాణం విసిగి తల్లి వాణ్ణితిట్టి, ఇంటినుంచి వెళ్ళగొట్టింది.

రంగడికి పౌరుషం వచ్చింది. తన తెలివితేటలు అందరూ గుర్తించేటట్టు చెయ్యాలని నిశ్చయించుకుని, వాడు ఇల్లువదిలి, ఊరిఅవతల ఉన్న అరణ్యంలోకి ప్రవేశించాడు. ఎక్కడా మనుష్య సంచారంలేని అడవిలో వాడికి కొంచెం భయం వేసింది.

దానికి తోడు చీకటి కూడా పడబోతున్నది. వాడు ఒక చెట్టు ఎక్కి కూర్చున్నాడు.

అదే చెట్టుమీద చాలాకాలంగా ఒక భూతం ఉంటున్నది. ఆ భూతానికి ఒక చెల్లెలు ఉండేది. ఒక మంత్రవేత్త ఆమెను ఒక సీసాలో బంధించి, ఆ చెట్టు మొదట్లో పాతిపెట్టాడు. చెట్టుమీద ఉన్న భూతం తానే నేల తవ్వి, చెల్లెల్ని విడిపించలేదు. కాబట్టి అందుకు ఎవరి సహాయమైనా కావాలి.

ఇప్పుడు ఎవరో మనిషి చెట్టెక్కినట్టు గ్రహించి ఆ భూతం, "ఎవరయ్యా నువ్వు?" అని అడిగింది. తనలాగే మరో మనిషి చెట్టు మీద ఉన్నాడనుకుని రంగడు "నా పేరు రంగడు. చాలా తెలివైన వాణ్ణి" అన్నాడు.

"ఆహా తెలివైనవాడివైతే నాకొక చిన్న సహాయం చెయ్యి" అన్నది భూతం.

తనను ఒకరు సహాయం అడుగుతున్నందుకు రంగడు ఎంతో గర్వపడి-

"తప్పకుండా చేస్తాను. ఏం సహాయం కావాలో చెప్పు?" అన్నాడు.

"చెట్టుదిగి చెట్టుమొదట్లో తవ్వి, నేలలో పాతి ఉన్న సీసా తియ్యి" అన్నది భూతం.

రంగడు చెట్టు దిగి, నేలను వేళ్ళతో తడిమి చూశాడు. నేల గట్టిగా ఉన్నది.

"తవ్వటానికి గునపం కావాలి!" అన్నాడు వాడు.

"నీ తెలివి ఉపయోగించు" అన్నది భూతం.

రంగడు చుట్టూ చూశాడు. దూరాన ఎక్కడో వెలుగు కాస్త కనిపించింది.

"అక్కడెవరో మనుషులున్నట్టున్నారు. గునపం పట్టుకొస్తాను" అంటూ రంగడు అటుకేసి వెళ్ళాడు.



అక్కడ నిజంగానే ఒక కోయవాళ్ళ గుడిసె ఉంది. అందులో కోయదంపతులున్నారు. తన ఊహ నిజమైనందుకు రంగడు చాలా గర్వపడి, "ఇప్పుడే తిరిగి ఇచ్చేస్తాను. ఒక గునపం ఇయ్యండి" అని కోయదంపతులను అడిగాడు.



వాళ్ళకు గునపం అంటే ఏమిటో తెలియలేదు.

"అసలు నువ్వు ఎవరు? ఇక్కడికెందుకువచ్చావు?" అని వాళ్ళు రంగణ్ణి అడిగారు.

"నేను చాలా తెలివిగలవాణ్ణి. త్వరగా నాకు గునపం ఇచ్చెయ్యండి" అన్నాడు రంగడు.

తమ వెంట రమ్మని వాళ్ళు రంగణ్ణి ఆ సమీపంలోనే ఉన్న ఒక మునీశ్వరుడి దగ్గరికి తీసుకుపోయారు. మునీశ్వరుడు రంగణ్ణి చూస్తూనే వాడి సంగతంతా గ్రహించి

"నువ్వు ఒట్టి అమాయకుడివి నాయనా. నువ్వు బాగుపడేందుకు ఒక వరం కోరుకో, ఇస్తాను" అన్నాడు.

"నాకు వరం అక్కర్లేదు, గునపం కావాలి" అన్నాడు రంగడు.

"గునపం కూడా ఇస్తాను" అంటూ మునీశ్వరుడు వాడికి ఒక గునపం ఇచ్చాడు.

రంగడు విజయగర్వంతో చెట్టు దగ్గరికి తిరిగివచ్చి, చెట్టు మొదట్లో తవ్వి, ఒక సీసా పైకి తీశాడు. చెట్టుమీద ఉన్న భూతం, రంగడుచేసిన పనికి సంతోషించి, "భేష్! ఆ సీసాను పగలగొట్టు" అన్నది.

"ఇంత కష్టపడి సీసా తీసింది పగలగొట్టటానికా? నేనేం తెలివితక్కువవాడిననుకున్నావా?" అన్నాడు రంగడు.

"అందులో బంగారం ఉంది. సగం నీకిస్తాను" అన్నది భూతం.



తన తెలివితేటలతో బంగారం సంపాదిస్తున్నందుకు రంగడు ఎంతో గర్వపడి, సీసాను నేలకేసి గట్టిగా కొట్టాడు. అంతే పెద్ద చప్పుడుతో సీసాలోనుంచి భూతం బయటికి వచ్చింది.

"ఎక్కడ నా బంగారం?" అంటూ అరిచాడు రంగడు. వాడు భూతాన్ని చూడలేదు. చెట్టుమీది భూతం వాడిముందు కొన్ని బంగారు నాణాలు విసిరింది.

రంగడు వాటిని ఏరుకుని, తన ప్రయోజకత్వం తల్లికి రుజువు చేద్దామని, చీకట్లోనే పడి ఇంటి దారి పట్టాడు. మధ్య దారిలో వాన వచ్చింది.

వానలో ఇంకా ఎంతో దూరం నడవటం వాడికి చిరాకు అనిపించింది. మునీశ్వరుడి వరం జ్ఞాపకంవచ్చి "నేనుండే దేశంలో వానలు ఉండరాదు" అని కోరుకున్నాడు.

వెంటనే వర్షం ఆగిపోయింది.

రంగడు తన తెలివితేటలకు అమితంగా సంతోషపడి, ఇంటికి పోయి తల్లికి బంగారం ఇచ్చి, తాను సాధించిన ఘనకార్యాలన్నీ తల్లికి గర్వంగా చెప్పాడు. మునీశ్వరుడు ఇచ్చిన వరంతో వాడు వాన ఆపాడని తెలియగానే వాడి తల్లి అదిరిపడింది.

ఈ సంగతి తెలిస్తే పదిమందీ కలిసి వాడ్ని చంపేస్తారు. అయినా వాడు వెర్రిబాగులవాడు గనుక వాడు చెప్పినది నిజం కాకపోవచ్చునని ఆమె తనను తాను సమాధానపరచుకున్నది.

కాని అదిమొదలు ఆ దేశంలో వానలు లేవు. తీవ్రమైన కాటకం ఏర్పడింది.

అయితే దేశం సంపన్నమైనది కావటంచేత, రాజు ఇతర దేశాలనుంచి ఆహారధాన్యాలు కొని ఆ సంవత్సరం గడిపేశాడు. కాని మరుసటి ఏడుకూడా దేశంలో వర్షంలేదు.

విచిత్రమేమిటంటే చుట్టుపక్కల దేశాలలో భారీగా వర్షాలు కురుస్తూనేఉన్నాయి.

రంగడి తల్లికి ఇప్పుడు రంగడివరంలో నమ్మకం కుదిరింది. ఆమె తన కొడుకుతో, అరణ్యంలో మునీశ్వరుడు ఉండే చోటికి పోయింది.

అయితే ఆ మునీశ్వరుడు అక్కడ లేడు. ఆయన ఎక్కడికి వెళ్ళాడో కోయవాళ్ళకు కూడా తెలియదు. రంగడితల్లి రాజును చూడబోయి "మహారాజా, నా కొడుక్కి అభయం ఇచ్చేటట్టుంటే వానలు కురవకపోవటానికి కారణం చెబుతాను. దేశాన్ని కాపాడే మార్గం మీరే చూడండి" అన్నది.

"నీ కొడుక్కు అభయం ఇస్తున్నాను, చెప్పు" అన్నాడు రాజు.

ఆమె జరిగినదంతా చెప్పి "ఎందుకూ పనికిరాని నా కొడుకు దేశానికి కూడా పనికిరాకుండాపోయాడు" అని కళ్ళనీళ్ళు తుడుచుకున్నది.

రాజుకు మతిపోయింది. ఆయన తనమంత్రితో "ఆడిన మాట నిలబెట్టుకుని అపఖ్యాతి రాకుండా చూసుకోనా, లేక ఈ పనికిరాని కుర్రవాణ్ణి చంపి, ప్రజల ప్రాణాలు కాపాడనా?" అన్నాడు.

మంత్రి ఒక్కక్షణం ఆలోచించి, "రంగడు పనికిరానివాడు ఎలా అవుతాడు. ప్రభూ? వాడు ప్రాణాలతో ఉంటే మీరు చక్రవర్తి కావచ్చు" అన్నాడు.

"అది ఎలా?" అన్నాడు రాజు.

"రంగడు తాను ఉండే దేశంలో వానలుపడకుండా వరం కోరుకున్నాడు. వాడు ఏ దేశంలో ఉంటే ఆ దేశంలో వానలుపడవు. వీడ్ని రెండేళ్ళపాటు ఏదేశంలో ఉంచితే ఆ దేశం ఆర్థికంగా దెబ్బతిని, మనకు సులభంగా వశమవుతుంది" అన్నాడు మంత్రి.

మంత్రి ఆలోచన బ్రహ్మాండంగా పారింది. కొద్ది సంవత్సరాల కాలంలో చుట్టుపక్కల ఉన్న దేశాలన్నీ రాజుకు లొంగిపోయాయి. ఆయన ఆ అన్ని దేశాలమీదా చక్రవర్తి అయ్యాడు.

ఇప్పుడు రంగణ్ణి ఏం చెయ్యాలన్న సమస్య వచ్చింది. రాజువే అన్ని దేశాలూనూ.

ఈ సామ్రాజ్యంలో రంగడు ఎక్కడ ఉన్నా అంతటా కాటకం వస్తుంది.

చక్రవర్తికి మంత్రి మరొక అమోఘమైన ఆలోచన చెప్పాడు. దాని ప్రకారం రాజు ఒక చిన్న గ్రామాన్ని స్వతంత్రరాజ్యంగా ప్రకటించి, దానికి రంగణ్ణి రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

రంగడి రాజ్యంలో వానలుపడవు, పంటలు పండవు. కాని చక్రవర్తి నుంచి రంగడి రాజ్యానికి ఎంత కావాలంటే అంత ధనసహాయం లభిస్తూ ఉంటుంది.

సోమరిపోతులకూ, విలాసజీవితాలు గడపదలచినవారికీ అది అద్భుతమైన దేశం.

ఒక ముని ఒక అపాత్రుడికి ఇచ్చిన వరం ఆ రాజ్యం రూపంలో వెలిసింది! **వసుంధర**



# నేనెవరో తెలుసా!

రష్యన్స్‌కి హిందీ సినిమాలు అంటే ఒకప్పుడు మహామోజు. అందునా రాజ్‌కపూర్ సినిమాలంటే చాలా ఇష్టపడేవారు. ఆయనకు పాటలు పాడిన ముఖేష్‌అన్నా వారికి చాలా ఇష్టం.ఆ దేశంలో ఒక రోడ్డుకి రాజ్‌కపూర్ పేరు పెట్టుకున్నారు.

అయితే రాజ్‌కపూర్‌తోపాటుగా రష్యన్‌లచేత అంతే గౌరవం అందుకున్న మరో తారవుంది.ఆమె అసలు పేరుకన్నా ఆమె ఒక చిత్రంలో నటించిన పాత్ర పేరు రష్యన్‌లకు బాగా గుర్తుండిపోయింది.

ఆ పాత్రద్వారా ఆమె రష్యన్ ప్రేక్షకుల మనసులను ఎంతగా దోచిందంటే ఆమె పేరున, అంటే ఆమె ధరించిన పాత్ర పేరున రష్యాలో ఒక స్టాంప్‌ని అధికారికంగా విడుదలచేశారు. ఇంతా చేస్తే ఆమె హిందీనటి కాదు. దక్షిణాది భాషా నటి.

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు **6 అక్టోబరు 2018 తేదీలోగా పంపించండి.** కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

దక్షిణాది నుండి వెళ్ళి బాలీవుడ్‌నే కాదు, ఐరోపా దేశాలలోనూ మెప్పుపొందిన ఆ నటిగురించి దక్షిణాదివారు దాదాపుగా మరచిపోయారేమో.

ప్రభుత్వపరంగా అవార్డులు రాకపోవటం ఒక రకంగా ఆమె గుర్తులేకపోవటానికి కారణమేమో.

దేశానికి స్వాతంత్ర్యం రావటంతోటే బాలీవుడ్‌లో ఒక కొత్త ఫార్ములా మొదలైంది. ఉత్తరాది హీరోలకు,దక్షిణాది హీరోయిన్‌లను కలిపి చక్కని చిత్రాలను నిర్మించారు. ఆ వరసలోనే దక్షిణాదిన విజయం సాధించిన అమ్మాయిలంతా బాలీవుడ్‌లో అవకాశాలను వెతుక్కుంటూ వెళ్ళారు.

హేమమాలిని, జయప్రద, శ్రీదేవి వంటి తారలు బాలీవుడ్‌లో బ్రహ్మాండంగా విజయం సాధించారు. అటువంటి దక్షిణాది తారలకు స్ఫూర్తి 1950ల్లోనే ముంబయి వెళ్ళిపోయిన దక్షిణాది తారలు.

వారిలో విజయవంతమైన తారగా వైజయంతిమాలను చెప్పుకుంటారు. కాని వైజయంతిమాలకు పోటీగా, సమకాలికురాలిగా బాలీవుడ్‌లోకి ప్రవేశించి, విజయం సాధించిన మరో నటి వుంది.

దక్షిణాది తారలు అంటే సాంప్రదాయ నృత్యాలలో బాగా శిక్షణ పొందివుంటారని బాలీవుడ్ వారికి తెలుసు. సాంప్రదాయ నృత్యం వస్తే ముఖంలో భావాలు అతిసులభంగా పలుకుతారు. నృత్యతారలందరూ దాదాపుగా అందమైనవారే.

అటువంటి ఒక అందచందాల తార తన 16వ ఏటనే నేరుగా బాలీవుడ్‌లోకి అడుగుపెట్టింది.

ఆ మలయాళీ ముద్దుగుమ్మచేసే నృత్యం, నటన చూసి ఆ రోజుల్లోనే ప్రేక్షకులు మతులు పోగొట్టుకున్నారు. సాంప్రదాయ కుటుంబంలో పుట్టిన ముగ్గురు అక్కాచెల్లెళ్ళలో మధ్యది ఈమె. అక్కా, చెల్లెలు కూడా నృత్యంలో శిక్షణ పొందినవారే.

ముగ్గురూ సినీరంగంలోకి వచ్చినవారే. అయితే ఈమెకు మిగిలిన ఇద్దరికన్నా మంచి గుర్తింపు వచ్చింది. కథాకళి, భరతనాట్యంలు రెండింటిలో మంచి నైపుణ్యం సంపాదించింది.

అలా ఒకసారి 'పారిజాతాపహరణం' నృత్య నాటిక ప్రదర్శిస్తుండగా చూసిన ఒక ప్రముఖుడు ఆమెలో మంచి నటి వుందని, ఎప్పటికైనా సినీరంగానికి వెళ్ళి తీరుతుందని దీవించారు.

1940ల్లో దేశంలోనే కాక అంతర్జాతీయంగా కూడా మంచి గుర్తింపు పొందిన నృత్యకళాకారుడు ఉదయశంకర్, సితార విద్వాంసుడు రవిశంకర్ సోదరుడు. ఆయన భార్య అమలశంకర్ కూడా నృత్యకళలో ఆరితేరింది.

వారిద్దరూ జంటగా నృత్య ఆధారిత హిందీసినిమా ఒకటి తలపెట్టారు. అందులో మంచి నాట్యగత్తెలు అవసరం. వారు వెతుకుతున్న నృత్యకళాకారిణి వారికి ఈమె రూపంలో కనిపించింది.

ఆ పదిహేడేళ్ళ అమ్మాయి నేరుగా బాలీవుడ్‌లోకి వెళ్ళిపోయింది. ఆమె కోసమే జెమినీ స్టూడియో నిర్మాతలు హిందీలో ఆర్.కె.నారాయణ నవల ఆధారంగా సినిమా తీశారు.

ఆ తర్వాత తమిళ సినిమాల్లో, ఆపైన తెలుగు సినిమాల్లో, తన మాతృభాష మలయాళంలో వరసగా ఆఫర్స్‌వచ్చాయి. అన్ని భాషల్లో ఆమె గుర్తింపు పొందినా తమిళంలో ప్రత్యేకంగా ఆదరించారు.

ఆనాటి టాప్ హీరోలందరి సరసనా నటించింది. శివాజీ, ఎమ్.జి.ఆర్., ఎన్.టి.ఆర్ వారందరితో సినిమాలు చేసింది.ఆమె అందం, భావోద్వేగాల ప్రదర్శన, నృత్యం కలగలిపి ప్రత్యేక గుర్తింపు తెచ్చింది. అప్పటికే గుర్తింపుగలిగిన నృత్యకళాకారిణి సినీ నటి వైజయంతిమాల. ఆమెతో కలిసి నృత్య ప్రదర్శనలు ఇవ్వటానికి భయపడేవారు.

అటువంటి వైజయంతిమాలతో కలిసి ఒక సినిమాలో నృత్య పోటీ సన్నివేశంలో చెయ్యాల్సివచ్చింది. ఇద్దరు పెద్ద నాట్యగత్తెలను కలిపి తియ్యటం కష్టమన్నారు. పైగా కళాకారిణుల మధ్య వుండే పోటీ, అహం గురించి అప్పటికే ప్రచారంలో వుంది.

అయినా వారిద్దరూ చేస్తామన్నారు. చక్కని నృత్య దర్శకుడు దొరికాడు. ఆ తమిళ సినిమా నృత్యంలో వారి హావభావాల గురించి అరవై ఏళ్ళ తర్వాత కూడా నేటికీ చెప్పుకుంటారు.

వైజయంతిమాలకు అన్ని రకాలుగా గట్టి పోటీ ఇచ్చిన కళాకారిణిగా ఆమె పేరు పొందింది.

1950లలో ఆమే అత్యధిక పారితోషికం అందుకున్న తమిళ నటి. ఒక్క శివాజీ గణేశన్‌తోనే 59 చిత్రాలలో హీరోయిన్‌గా నటించింది. తెలుగులో చేసిన సినిమాలు తక్కువే అయినా ఆమె అందం, నటన నాటి ప్రేక్షకులను కట్టిపడేసేది.

సినీరంగంలో ఒక వెలుగు వెలుగుతున్న సమయంలో ఆమె తల్లి చూపించిన ఒక వైద్యునితో తాళికట్టించుకుంది. ఒక్కసారిగా సినిమా రంగాన్ని వదిలి భర్తతో కలిసి అమెరికా వెళ్ళిపోయింది. అమెరికాలో ఆమె తన పేరుతో ప్రారంభించిన నృత్య శిక్షణా కేంద్రంనేడు భారతీయ నృత్యకళలను నేర్పే వాటిలో అతిపెద్ద కేంద్రంగా గుర్తింపు పొందింది.

మళ్ళీ 70ల్లో సినీరంగంలో ఆమె రెండవ ఇన్నింగ్స్ మొదలుపెట్టింది.ఎక్కడ ఆరోజు ఆపిందో సరిగ్గా అక్కడినుంచి మళ్ళీ తన కెరీర్ మొదలు పెట్టింది. ప్రేక్షకులు మళ్ళీ ఆదరించారు.

తన వయసుకు తగిన పాత్రలను ఎంపికచేసుకుంటూ నటించి, తాను పోషించిన అమ్మమ్మ పాత్రకు 1985 సంవత్సరంలో ఫిల్మ్‌ఫేర్ అవార్డు అందుకున్నది.ఆర్ట్ ఫిల్మ్ చేయాలని,సత్యజిత్‌రే సినిమాలో చిన్నపాత్ర అయినా చేయాలన్నది ఆమె తీరని కోరిక.

ఆమె బంధుగణం చాలామంది ఆ తర్వాతి కాలంలో సినీరంగంలో ఒక వెలుగు వెలిగినవారే. నటి శోభన, నటుడు వినీత్ ఆమె బంధువులే. తిరిగి మాతృదేశానికి వచ్చి ఇక్కడే మరణించిన కళాకారిణి ఆమె. ఇంతకీ...

*1. ఆ నటి ఎవరు?*

*2. ఆమె అక్కాచెల్లెళ్ళని కలిపి ఏమని పిలిచేవారు?*

21.9.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :

1. పండిత నరేంద్రజీ,
2. ఉత్తరప్రదేశ్.

**₹ 500/- బహుమతి పొందిన విజేత :**
జె.వసంత, 5-1-613, ట్రూప్ బజార్,
హైదరాబాద్ 500 095.

# WhatsApp

అడవిలో కరివేపాకు చెట్టు ఆకుల్ని ఓ ఏనుగు తింటోంది. ఇంతలో ఒక ఈగ, దాని చెవి దగ్గర చేరి రొదపెట్టసాగింది.

ఏనుగు, తన పెద్ద చెవులతో దాన్ని దూరంగా తోలివేసింది, మళ్ళీ ఆకుల్ని తినసాగింది.

ఈగ మళ్ళీ చెవిలో రొద మొదలుపెట్టింది.

ఏనుగు ఈగను మళ్ళీ దూరంగా తరిమింది. అయినా ఈగ మాటిమాటికీ ఏనుగు దగ్గరకు వస్తూనేవుంది. ఏనుగు తోలుతూనేవుంది.

ఇలా చాలాసార్లు జరిగినతరువాత ఏనుగు ఈగని అడిగింది-

"నువ్వు ఎందుకు ఎప్పుడూ హడావిడిగా అటూ ఇటూ తిరుగుతుంటావు? ఒకచోట నిలకడగా ఉండవెందుకు? అని.

ఈగ : నాకు ఏం కనిపించినా ఏం వినిపించినా ఏ వాసనొచ్చినా వాటివైపు వెంటనే ఆకర్షితురాలి నవుతాను. అందుకే ప్రతిక్షణం అన్ని ప్రక్కలకు ఆగకుండా తిరుగుతూవుంటాను" కానీ, "ఓ ఏనుగా! నువ్వెప్పుడూ దేనికీ కంగారు లేకుండా ప్రశాంతంగా ఎలా ఉండగలుగుతున్నావు?"

ఏనుగు : 'నేను నా పంచేంద్రియాలు (కన్ను, ముక్కు, చెవి, కాళ్ళు, చేతులు) చెప్పింది వినను. నేను ఏం నిర్ణయించుకుంటే అదే చేస్తాను. అందువల్లే ఏ పనైనా లీనమై చేయగలుగుతున్నాను. ప్రశాంతంగా ఉండగలుగుతున్నాను.

నీతి : 'ఈగ'ది చంచలమైన మనసు. ఎప్పుడూ ఏదో విషయంవైపు పరుగెడుతూనేవుంటుంది. 'ఏనుగు'ది సరైన నిర్ణయాలు తీసుకునే బుద్ధి. దాంతో ఎప్పుడూ ప్రశాంతంగా ఉంటుంది. మనిషి మనసు వెళ్ళినచోటికల్లా వెళ్ళకుండా మంచి బుద్ధితో నిర్ణయాలు తీసుకుంటే హాయిగా ప్రశాంతంగా జీవిస్తాడు.

ఓ నా ప్రియమైన దేవుడా! ఇప్పటివరకు, ఈ రోజు అన్నీ సరిగానే చేశాను. ఎవరిగురించీ చెత్త వాగలేదు. ఎవరిమీదా ఆవేశపడలేదు. స్వార్థంగా ప్రవర్తించలేదు. అత్యాశకు పోలేదు. ఇలా ఉన్నందుకు నేను సంతోషంగా ఉన్నాను.

ఓ దేవా! మరికొద్ది నిమిషాలలో నేను మంచం మీదనుండీ లేచి, రోజువారీ పనులు మొదలు పెట్టబోతున్నాను. అప్పుడు నీ సహాయం నాకు ఎంతో అవసరం. దగ్గరుంటావు కదూ! నీకు ఇవే నా ధన్యవాదాలు.

ఒకరిని బాధపెట్టటం నీటిలో రాయి వేసినంత సులువు. కానీ, వారిని తిరిగి మామూలు స్థితికి తీసుకురావటం, నీటిలో నుండి రాయిని తిరిగి తీసుకొచ్చినంత కష్టం.

జనక మహారాజు గొప్పరాజు, అంతేగాక గొప్ప యోగి అనికూడా మునులు చెప్పుకుంటుంటే విన్నాడు వేదవ్యాస మహర్షి. కుమారుడైన శుకుడు, తండ్రిని ఇలా ప్రశ్నించాడు- "నిరంతరం రాజరిక వ్యవహారాలతో సతమతం అయ్యే రాజు, యోగి ఎలా కాగలడు?" నీ సందేహనివృత్తికోసం జనక మహారాజుని దర్శించమన్నాడు వ్యాసుడు.

శుకుడు జనకుని రాజసభలో ప్రవేశించాడు. శుకునికి అన్ని మర్యాదలు చేసి, వచ్చిన పని ఏదో చెప్పమన్నాడు జనకుడు.

శుకుడు తన సందేహం తీర్చమన్నాడు.

అప్పుడు జనకుడు, శకుని చేతిలో ఒక వెలుగుతున్న దీపాన్నిచ్చి, ఆరకుండా చూసుకుంటూ రాజప్రాసాదమంతా చుట్టి రమ్మన్నాడు. శుకుడు ఆయన చెప్పినట్లే చేసి, తిరిగివచ్చాడు.

మహారాజు : రాజప్రాసాదంలో జరుగుతున్న విశేషాలు ఏంటి మునికుమారా?"

శుకుడు : దీపం ఆరకుండా, కాపాడుకోవటంపైనే నా దృష్టి నిలిచిపోయింది. చుట్టూ ఏం జరుగుతోందో గమనించలేదు.

మహారాజు : శుకా! ఈసారి దీపాన్ని కాపాడుకుంటూనే, చుట్టూ ఏం జరుగుతోందో చూసి నాకు వివరంగా చెప్పండి.

శుకుడు : ఈసారి దీపాన్ని కాపాడుకుంటూనే రాజప్రాసాదములో జరిగే విశేషాలను సాక్షి మాత్రంగా గమనిస్తూ వెళ్ళాడు. తిరిగి రాజును సమీపించాడు. ఇలా అన్నాడు-

"రాజర్షీ! ఒక మనిషి లౌకిక వ్యవహారాలలో మునిగివుండి, యోగి ఎలా కాగల్గుతాడని అనుకున్నాను. నీవు పెట్టిన పరీక్షతో నాకు జ్ఞానోదయమయింది. యోగసాధనకు బయటి వ్యవహారాలు అడ్డుకావని తెలిసింది.

మనసు నిశ్చలంగా వుండి ఒక సాక్షిలా అన్నింటినీ చూస్తూవుండటమే కావలసింది" ◆

మన మేలు కోరేవారు దారిదీపాలవంటివారు. దూరాన్ని తగ్గించలేరుకానీ, ప్రయాణాన్ని సుఖవంతంమాత్రం చేయగలరు.

రమేష్ సురేష్‌తో : ఏరా! మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు? ఉద్యోగం వచ్చిందా?

సురేష్ : వాడికింకా ఉద్యోగం రాలేదు. కాని, ఈ మధ్య రోజూ 'ధ్యానం' చేస్తున్నాడు.

రమేష్ : ధ్యానం చేయడమేమిట్రా

సురేష్ : ఏం చేయకుండా ఖాళీగా కూర్చోకుండా ఏదో ఒకటి చేయుటం మంచిదికదా?

మౌనం మనసును, స్నానం దేహాన్ని, ధ్యానం బుద్ధిని, ప్రార్థన ఆత్మను ఉపవాసం శరీరాన్ని శుద్ధిచేస్తాయి. అలాగే క్షమాపణ మానవ సంబంధాలను శుద్ధి చేస్తుంది.



Courtesy : AROGYA SANJEEVANI





## కామెడీ కథ

# గృహవిష్ణు

## స్వర్ణప్రసాద్

"మీ పద్ధతేం నచ్చలేదు. మీరక్కడ నేనిక్కడ. ఎక్కువ చిరాకుపెట్టకుండా నన్నుకూడా హైద్రాబాద్ తీసుకెళ్ళండి" ఆదివారం ఇంటికి వచ్చిన మొగుడ్ని పడగ్గదిలో ఒంటరిగా పట్టుకుని దుల పడం మొదలెట్టింది కొత్తగా పెళ్ళైన పంకజం.

"మాంచి లోకాలిటీలో ఇల్లు వెతుకుతూనే ఉన్నానే పంకజం. దొరగ్గానే వెళ్ళిపోదాం. నాకు మాత్రం బలవంతపు బ్రహ్మచారి బతుకు ఇష్టమా చెప్పు"అంటూ అనునయించబోయాడు రాంబాబు.

"సీరియస్‌గా వెతికితే ఇల్లెందుకు దొరకదు? ఉంటే హైద్రాబాద్‌లో మీతోటే. లేకుంటే పుట్టింట్లో మావాళ్ళతోటి. నేనెక్కడ ఉండాలో తేల్చుకోండి. వచ్చిపోయేవాళ్ళకి వండిపెట్టలేక చస్తున్నాను"

పంకజం ఆలోచన కొంచెం సబబుగానే తోచింది రాంబాబుకి.వెంటనే ఆ ఆలోచన అమ ల్లోకి వచ్చింది. మరుసటి ఆదివారమే హైద్రాబాద్‌లో కొత్తింట్లో గృహప్రవేశం జరిగిపోయింది.

ప్రతి ఆదివారం సినిమాలు. ప్రతి సెలవుదినం సరదాలు. పంకజం కాపురం మూడు పువ్వులు, ఆరుకాయలు. మిగిలిన పనిచేయడానికి పనిమని షిని కూడా పెట్టుకున్నారు.

పుట్టింట్లో పనీ పాట లేకుండా ఖాళీగా ఉన్న రామలక్ష్మికి చెల్లెలు పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయేసరికి ఏం చేయాలో తోచడం పూర్తిగా మానేసింది. ఉత్తి పుణ్యానికే తినికూర్చోడం మూలంగా ఊబకాయం కూడా మొదలయింది. దాంతో లేస్తే ఆయాసం... కూర్చుంటే నీరసంలా తయారైంది ఆమె పరిస్థితి.

ఓ రోజు మధ్యాహ్నం కుదుమట్టసంలా కుర్చీలో శరీరాన్ని కుదేసి ఏం ఆలోచిస్తే బాగుంటుందా? అని ఆలోచిస్తున్న రామలక్ష్మికి ఏ ఆలోచనా తట్టక పక్కనే ఉన్న సెల్‌ఫోన్ అందుకుని పంకజానికి ఫోన్ చేసింది. "ఏమే పంకజం... మమ్మల్నందర్నీ పూర్తిగా మరిచి పోయినట్లున్నావు. ఎలా ఉన్నారేంటి?" ఆరాతీయడం మొదలుపెట్టింది రామలక్ష్మి.

"నేను హాయిగా ఉన్నానక్కా. మీరెలా ఉన్నారు?" అడిగింది పంకజం.

"ఏమోనే... తింటే ఆయాసం. తినకపోతే నీరసం" కుర్చీలో కుదేసిన శరీరాన్ని కొద్దిగా అటూ ఇటూ కదపడానికి ప్రయత్నంచేసి చోటుచాలక ఆ ప్రయ త్నం మానుకుంది రామలక్ష్మి.

"మీ ఆయన కంట్రోల్‌లోనే ఉన్నాడా? నీమీద లేనిపోని పెత్తనంచేయడానికి ట్రైచేయడం లేదుకదా!" రామలక్ష్మి ప్రశ్నకి కిసుక్కున నవ్వింది పంకజం.

"జాగ్రత్తమ్మా! మొదట్లో మొగుళ్ళు మంచిగానే ఉంటారు. అతిగా నమ్మకు. అసలు రంగు బయట పడడానికి టైం పడుతుంది. ఎక్కడా తోక ఝాడించ డానికి అవకాశం ఇవ్వకు"రామలక్ష్మి సలహాఇచ్చింది.

మొదట్లో ఏం తోచనప్పుడు చెల్లెలికి ఫోన్ చేసే రామలక్ష్మి... ఇప్పుడు తీరిక దొరికినప్పుడల్లా ఫోన్ చేసి "మొగుడ్ని అదుపులో ఉంచుకోవడం ఎలా?" అన్న శీర్షిక పెట్టుకుని చెల్లెలికి ఉపదేశంలా ప్రవచ నాలు చెప్పడం మొదలుపెట్టింది.

కాలక్రమేణా అక్క సందేశాలసారం పంకజా నికి పూర్తిగా వంటబట్టి రాంబాబుమీద 'పండంటి కాపురానికి పద్దెనిమిది నియమాలు' ప్రయో గించడం మొదలుపెట్టింది.

మొదట్లో రోజుకో ఫోన్ చేసే రామ లక్ష్మి ఇప్పుడు రాంబాబు ఇంట్లో ఉండని సమయాలలో పాతిక సార్లు ఫోన్ చేసే స్థాయికి చేరుకుంది. చెల్లెలుదగ్గర నొక్కేసిన చీరలు పాత బడిపోయాయి మరి.

ఏం తోచని ప్రాణానికి వ్యాపకం దొరికింది.రాంబాబు మాత్రం తన వెనుక జరుగు తున్న కుట్ర తెలియక అదే అమాయ కత్వంతో పెళ్ళాం కొంగున అమాయకంగా తిరుగుతున్నాడు. కాలం గడుస్తోంది.

ప్రవచనాలు తారాస్థాయికి చేరుకున్నాయి. పంకజం ప్రవర్తనలో మెల్లగా మార్పు మొదలైంది.

పనిమనిషి రానట్లుంది... వంటింట్లో శబ్దాలు వినిపిస్తున్నాయి. పంకజం పన్లో ఉన్నట్లుంది. ముసుగు గట్టిగా బిగించి పడుకున్నాడు రాంబాబు.

రెండునిమిషాలతరువాత "ఇక లేవండి... పడు కుంది చాలు. ఇంటెడు పనీ ఒక్కదాన్ని చెయ్యలేక ఛస్తున్నాను. పెళ్ళి చేసుకుని పెళ్ళాన్ని కాదు... పని మనిషిని తెచ్చుకున్నారు.

బురదలో పడుకున్న ఊర పందిలా ఎంతకీ మంచం దిగకపోతే మంటపుడుతోంది నాకు"పంకజం భాషకి అదిరిపడి లేచి కూర్చున్నాడు రాంబాబు.

ఈలోపునే పంకజం అక్కడ్నుంచి వెళ్ళిపోయింది. ఆ రోజు వంటలో ప్రతి వంటకంలోనూ ఉప్పెక్కు వైంది. అన్నం అడుగంటిపోయింది.

"ఇదేంటి పంకజం ఏమైంది ఈరోజు నీకు. వంట ఇలా తగలెట్టావ్?" చిరాగ్గా అన్నాడు రాంబాబు.

"నేనేం మీ వంటమనిషి అనుకున్నారా? జీతం

భర్తలేని పనిమనిషిలా, వంటమనిషిలా మార్చేశారు" పంకజం మాటలకి రాంబాబుకి కోపం వచ్చింది.

"నీకేం తక్కువ చేశాను. నాకు వీలైనంతలో బానే చూసుకుంటున్నాను కదా!"

"ఏం ఎక్కువ చేశారో... అది చెప్పండి. ఇక, మీతో నేను వేగలేను. పుట్టింటికి పోతున్నాను..."

రాంబాబు కేం మాట్లాడాలో అర్థంకాలేదు. ఒక్క క్షణం నిశ్చేష్టుడయ్యాడు. "సరే... పోతే పో... డబ్బులు బీరువాలో ఉన్నాయి" కోపం పట్టలేని రాంబాబు కూడా సీరియస్‌గా అన్నాడు.

మాటకు మాట పెరిగింది. నీటికి నాచు తగిలింది. పంకజం అప్పటికే సర్దుకుని సిద్ధంగా ఉంచుకున్న సూట్‌కేస్ అందుకుంది.

"నేను పోతున్నాను. వెళ్ళగానే లాయర్‌ని కలిసి విడాకుల నోటీసు పంపిస్తాను. మ్యూచువల్‌కి ఒప్పుకుని సంతకంపెడతావో... లేదా నీమీద 498 సెక్షన్ కింద కేసుపెట్టిలోపలికితోయించాలో నువ్వే తేల్చుకో. అదీ కాదంటావా? కోర్టు ద్వారా ప్రొసీడయ్యి రచ్చరచ్చ చెయ్యమంటే అందుకూ నేను సిద్ధం..."

నిన్న టీవీలో చూసిన ప్రోగ్రామ్ తాలూకు మత్తు దిగని పంకజం గుమ్మం దాటింది.

దీనికి ఇన్ని సెక్షన్లు... కోర్టు భాష ఎలా తెలిసాయబ్బా. ఇంతకీ నేను చేసిన తప్పేమిటో? అనుకుంటూ తలపట్టుక్కూచున్నాడు రాంబాబు. పెట్టే బేడా సర్దుకుని పుట్టింటి బస్సెక్కేసింది పంకజం.



ఆర్నెల్లు గడిచిపోయాయి. పశ్చాత్తాపపడి కాళ్ళ బేరానికి వస్తాడనుకున్న పంకజం అంచనాలు తల్లకిందులయ్యాయి. ఆర్నెలల్లో రాంబాబు నుంచి ఒక్కసారికూడా ఫోన్ రాలేదు పంకజానికి.

ఆ రోజు మంగమ్మ... అదే పంకజం మొగుడిమీద పెట్టిన గూఢచారిణి నుంచి ఫోన్ వచ్చింది. "పోయిన నెల జీతం ఇవ్వలేదు" నిష్ఠూరంగా అంది.

"నీ దుంపతెగ. మొత్తం ఒక్కసారే లంసంగా చేతికిస్తాగాని అసలు విషయం ఏమిటో చెప్పు"

"నిన్న అయ్యగారు ఇంట్లోనే పెద్ద పార్టీ చేసుకున్నాడు. ఆడా-మగా కలిసి అయిదారుగురుదాకా వచ్చారు. ఆ హడావుడి, ఆ గోల ఏం చెప్పమంటారు? పాటలు, డ్యాన్సులూ. రెండు మూడు మందు బాటిల్స్ కూడా తెచ్చుకున్నారట"

మంగి మాటలు విని హతాశురాలైంది పంకజం. చూస్తుంటే పరిస్థితులు చేయిదాటిపోయాయా అనిపించింది. మొట్టమొదటిసారి అక్క తెలివితేటల మీద అనుమానం వచ్చింది.

"అమ్మా! నువ్వు ఇంకా ఇలాగే బిగదీసుకుని కూర్చున్నావనుకో... ఎవతో ఒకతి మీ ఆయన్ని తగులుకోవడం ఖాయం. వాళ్ళింట్లో నేను మళ్ళీ పనికి కుదురుకోవడం ఖాయం..." అంటూ మంగి పంకజానికి భవిష్యత్ దర్శనం చేయించింది.

పనికిమాలిన సలహాలిచ్చి తన కాపురాన్ని కొల్లేరు చేసిన అక్కమీద పీకలదాకా కోపంవచ్చినా తమాయించుకుని ఆలోచించడం మొదలెట్టింది.

"ఏమయిందే పంకజం... అలా ఉన్నావు?" పెరట్లో ఒంటరిగా కూర్చుని ఎదురుగా ఉన్న ఇంటివైపు దీర్ఘంగా చూస్తూ ఆలోచిస్తున్న పంకజాన్ని సమీపించి అడిగింది రామలక్ష్మి.

"ఏముంది కొంప కొల్లేరైంది. బతుకు బస్టాండు అయింది. పెళ్ళాం అలిగి పుట్టింటికి పోయిందన్న సంగతే మర్చిపోయి అవకాశం దొరికింది కదాని అనుభవించు రాజా అంటూ సాంగ్ ఎంజాయ్ చేస్తున్నాట్ట మీ మరిది" వేడి వేడి పెనంమీద దోసెలపిండి పోసినట్లు కస్సుమంది పంకజం.

"ఇలాంటప్పుడే ఆడది గట్టిగా ఉండాలే పంకజం. ఈ ఆటలు ఎంతకాలం సాగుతాయి? ఇప్పుడు వెంటతిరిగే మొగుళ్ళకి కొంపలుండవా? పెళ్ళాం పిల్లలుండరా? ఒకరోజు తిరిగాను.

రెండురోజులు తిరుగుతారు. మూడో రోజు వాళ్ళ పెళ్ళాలు వంటింట్లో మొట్టికాయలు వేస్తే వాళ్ళు నీ మొగుడి ముఖంకూడా చూడరు.

నువ్వేం దిగులుపడకు. ఎంత తిరిగినా చివరికి నీ మొగుడు నీ కాళ్ళ దగ్గరికి రావాల్సిందే. నీకు దాసోహం అనాల్సిందే..." మళ్ళీ పంకజానికి హితబోధ మొదలుపెట్టింది రామలక్ష్మి.

పంకజానికి చిరాకు నషాళానికి అంటింది-

"మగాళ్ళందరూ బావలాగ ఉండరు. మా ఆయన ఉద్యోగం చేస్తున్నాడు తెలుసా?" ఆపుకోలేక ముఖం మీదే అనేసింది పంకజం.

"అదేమిటే... అంత మాట అనేశావు. నేను మా ఆయన్ని మహారాజులా చూసుకుంటాను తెలుసా? సంపాదన చేతకాదన్న ఒక్క లోపం తప్పితే మీబావకేం తక్కువే. నా మాట జవదాటడు. నేను చెప్పిందల్లా తు.చ. తప్పకుండా చేస్తాడు.

మొగుడ్ని కంట్రోల్‌లో పెట్టుకోవడం చేతకాకపోతే నేనేం చేయగలను. పెద్దదానిగా నీ మంచికోసం తోచిన నాలుగు మంచి మాటలు చెప్పగలనుతప్ప" చెల్లి మాటలకి దిమ్మతిరిగిన రామలక్ష్మి నెపమంతా పంకజం నెత్తిన నెట్టేయడానికి ప్రయత్నించింది.

పంకజం అక్కడ్నుంచీ లేచి విసవిస వెళ్ళిపోయింది. "అమ్మా! నేను మా ఇంటికి వెళుతున్నాను. ఒంటరిగా వెళ్ళమంటావా...? ఎవరైనా దిగబెడతారా...?" చేతిలో సూట్‌కేస్ పట్టుకుని ఎదురుగా నిల్చున్న కూతురిని చూసి అయోమయానికి లోనైంది తల్లి.

పంకజం ఇంటికి చేరే సమయానికి రాంబాబు ఇంట్లో లేడు. చేసేదేం లేక గుమ్మం ముందు మెట్ల మీద కూర్చుని రాంబాబు రాకకోసం ఎదురుచూడ

## కంటెంట్ వుండాలి

సినిమాలకు సంతకాలు చేయడంలో తన కెంతమాత్రం తొందరలేదంటున్నది శోభిత ధూళిపాళ. 'గూఢచారి' సినిమాతో తెలుగు పరిశ్రమలోకి అడుగుపెట్టిన శోభిత సరయిన అవకాశం కోసం చూస్తున్నానంటున్నది.

"నేను తెలుగమ్మాయినే అయినా నా తెలుగు సినిమా ఆలస్యమైందని నేనసలు అనుకోలేదు. మంచి స్క్రిప్టులో మాత్రమే భాగం కావాలన్నది నా అభిమతం. 'గూఢచారి' సినిమా బాగానచ్చింది. దానికి మంచి ఫాలో అప్ ఉండాలి కదా. ఆఫర్లు వస్తున్నాయి కాని, ఏదో ఒకటిలే అని అందిపుచ్చుకోలేను" అని నొక్కినొక్కి చెప్పింది.



**హిందీ భాషను ద్వేషించకండి. మీరు ఎంతగా ద్వేషిస్తే అది అంత ఎత్తుకు ఎదుగుతుంది.**

-పరేష్ రావల్, బి.జె.పి. ఎం.పి.

సాగింది పంకజం. రాత్రి ఎనిమిదిన్నర అవుతుండగా... ఈల వేసుకుంటూ హుషారుగా ఇంటికి చేరుకున్నాడు రాంబాబు. అప్పటిదాకా పంకజానికి ఆపసోపాలు పడుతూ మెట్లమీదే కూర్చోవాల్సివచ్చింది.

తలుపు తాళంతీసి లోపలికి నడిచాడు రాంబాబు. పంకజంకూడా లేచి నిలబడి సూట్‌కేస్ అందుకుని భర్తని అనుసరించింది.

ఇల్లంతా ఎంత కంగాళిగా ఉంటుందో... ఓ కొలిక్కి తేవడానికి ఎన్ని నెలలు పడుతుందో? అన్న అనుమానంతో ఇంట్లోకి ప్రవేశించిన పంకజానికి అక్కడి వాతావరణం మతిపోయేలా చేసింది.

ఇల్లంతా కూడా శుభ్రంగా సర్ది ఉంది. ఎక్కడా ఏమాత్రం దుమ్మూ ధూళీ లేకుండా అద్దంలా తళతళలాడిపోతోంది. ఎక్కడుండాల్సిన వస్తువులు అక్కడ పొందిగ్గా అమర్చబడివున్నాయి.

నిజం చెప్పాలంటే తాను కూడా ఏనాడూ ఇంటిని ఇంత అందంగా పొందిగ్గా ఉంచుకోలేదు. ఈ విషయంలో మొగుడి టాలెంట్‌ని మెచ్చుకోకుండా ఉండలేకపోయింది పంకజం. ఆలోచిస్తుండగానే కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యాడు రాంబాబు.

"భలే భలే... ఆర్నెల్లు పెళ్ళాలు ఇంట్లో లేకపోతే మొగుళ్ళు మంచి పనిమంతులవుతారన్నమాట" మొగుడ్ని చూసి తెగ ముచ్చటపడుతూ ఆనందం పట్టలేక కూర్చున్న చోటునుంచి లేచి హాలు మధ్యలో గొబ్బిళ్ళ డ్యాన్స్ మొదలుపెట్టింది పంకజం.

పంకజం రెడీ అయి వచ్చేసరికి వేడివేడిగా ప్లేట్లలో అచ్చం టీవీలో చూపించినట్లుగా దోసెలు సర్దిసిద్ధంగా ఉన్నాయి. "మసాలా దోసెలు నేను బాగా చేస్తానని మా ఫ్రెండ్స్ అందరూ అంటుంటారు" అంటూ మరో దోసె వడ్డించబోయాడు రాంబాబు.

"వద్దు... ఇప్పటికే ఎక్కువయింది" అంటూ ప్లేట్‌లోని దోసెల్ని ఖాళీచేసి చేతులు కడుక్కుని మంచం మీదకి చేరింది పంకజం. ఇంకా షాక్‌నుంచి కోలుకోని పంకజం ఆలోచిస్తూవుండగా... వంటింట్లో రాంబాబు సర్దుకుంటున్నాడు.

ఈ కాలపు మొగుళ్ళు పెళ్ళాలు మొరాయిస్తే... మచ్చిక చేసుకునే ప్రయత్నం చేయడం లేదు. అందుబాటులో ఉన్న క్యాబ్‌లు, ఆటోలు వాడిపని కానిచ్చేసుకుంటున్నారు. ఆలస్యం చేసుంటే ఎంత అనర్థం జరిగివుండేదో? ఆలోచిస్తుండగానే నిద్రపట్టేసింది పంకజానికి. మర్నాడు పంకజం రెడీ అయి వచ్చేసరికి రాంబాబు ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

ఉదయాన్నే మామగారు, అత్తగారు వచ్చినట్లున్నారు. హాల్లో అత్తగారు టీవీ చూస్తూ కనిపించారు. పంకజం వంటింట్లోకి సరాసరి వెళ్ళి కాఫీ తెచ్చుకుని అత్తగారిముందు కూర్చుంది.

"అలా వెళ్ళిపోయావేంటమ్మా? ఒంట్లో కుదురుగానే ఉందా?" సానుభూతిగా పంకజాన్ని చూస్తూ అడిగింది అత్తగారు.

"వంట్లో కులాసాగానే ఉంది అత్తయ్యా. కానీ, ఇంట్లోనే అసలేం జరిగిందంటే..." సూటిగా పాయింట్‌లోకి వచ్చే ప్రయత్నం చేసింది పంకజం.

"మాకు అంతా తెలుసమ్మా. నువ్వు పుట్టింటికి వెళ్ళిపోయాక మేం రావడం ఇదే మొదటిసారి కాదు. అనుకోకుండా నువ్వు వెళ్ళిన వారంరోజులకే ఇక్కడికి రావడం తటస్థించింది.

అప్పుడయినా ఈ బడుద్ధాయి జరిగిన విషయం చెప్పివుంటే పరిస్థితి ఇక్కడిదాకా వచ్చేది కాదు... ఏదీ నోరెత్తితేనా? అంతా గుంభనమాయె.

గుంభనంగా ఉండాల్సిన కాపురాన్ని రట్టు చేసుకున్నారు. అయినా, వీడి వాలకం చూసినప్పుడే పరిస్థితులు అర్థమయ్యాయి..." పంకజాన్ని మధ్యలోనే ఆపుచేస్తూ అంది అత్తగారు.

## ▸ సిగ్గు... సిగ్గు...

మహిళల హక్కులపై పోరాడితే ఫెమినిజం ముద్ర వేస్తున్నారంటూ కంగనా రనౌత్ ఫైర్ అయిపోతున్నది. అంతేకాదు- అలా అనేవారిపై సామాజిక మాధ్యమాల్లో వాళ్ళు సిగ్గుపడే స్థాయిలో ట్రోల్స్ పెట్టాలని ఘాటుగా విమర్శించింది.

నచ్చిన దుస్తులు వేసుకోవడానికి పోరాడాల్సి వస్తున్నది, ఇష్టం అయిన సమయంలో బయటకు వెళ్ళడానికి పోరాడాల్సివస్తున్నది.

ఎన్నోసార్లు వ్యక్తిత్వానికి నచ్చకపోయినా సమాధానం చెప్పాల్సివస్తున్నది. ఇవన్నీ సిగ్గుపడాల్సిన సంగతులు" అంటూ మండిపడింది.

▸ ద్రవ్యోల్బణం అదుపులో ఉంది... జి.డి.పి. వృద్ధి 7.5 శాతం దాటుతుంది... ఆందోళన అనవసరం. -అరుణ్‌జైట్లీ, కేంద్రమంత్రి

"జరిగిందానికి నేను కూడా పశ్చాత్తాప పడుతున్నానత్తయ్యా. పెళ్ళైన ఆడది పుట్టింటికి పర్మినెంట్‌గా చేరితే ఏం జరుగుతుందో నిజం తెలుసుకున్నాను" అమాయకంగా చెప్పింది పంకజం.

"అయినా మీదాకా ఎలా వచ్చింది విషయం?"

అత్తగారు కోడలి అమాయకత్వానికి జాలిగా చూస్తూచెప్పింది. "మంచి తెలియకపోయినా ఇలాంటి విషయాలు గాలికన్నా వేగంగా ఊరంతా తెలుస్తాయమ్మా. నువ్వు నీ మొగుడిమీద పెట్టిన గూఢచారే ఇక్కడ జరిగిన విషయాలన్నీ ఎప్పటికప్పుడు మాకు చేరవేస్తోంది. ఇవాళోరేపో నువ్వు తిరిగివస్తావనూహించే మేమూ ఇక్కడికొచ్చాం" చెప్పింది అత్తగారు.

"అనుభవంతో చెప్తున్నాను విను. మగవాడికి ఆడదాని అవసరం ఎంత ఉందో.. ఆడదానికి మగవాడి అవసరం కూడా అంతే ఉంది. ఆలుమగల్లో ఒకరు ఎక్కువ ఒకరు తక్కువా కాదు. ఇంటిని ఇంటి పరువునీ పదిలంగా కాపాడుతుందనే ఇల్లాల్ని ఇంటికి దిక్కుని చేసి 'గృహలక్ష్మి' అంటారు.

ఒక్క పిల్లల్ని కనటంతప్ప ఆడది చేసే ప్రతి పనినీ మగవాడు కూడా చేయగలడు. పంకజం... ఈ వాస్తవం తెలుసుకుంటే ఆ కాపురం పదికాలాలపాటు పచ్చగా ఉంటుంది.

భర్త భార్యమీద ఆధారపడడం సహజం. అందులోనే అతనికి ఆనందం ఉంటుంది. దాన్ని అలుసుగా తీసుకుని నెత్తికెక్కి తాండవం చేయాలని చూస్తే మగవాడు 'గృహవిష్ణు' అవతారం ఎత్తుతాడు. ఇప్పుడు జరిగిందదే" అని చెప్పింది.

అత్తగారి మాటలు విన్న పంకజం కళ్ళు తెరుచుకున్నాయి. కళ్ళెంబడి రెండు చుక్కల కన్నీళ్ళు కార్చింది. సాయంత్రం నాలుగు కాకుండానే చక్కగా రెడీ అయి మొగుడి కోసం హాల్లో టీవీ చూస్తున్న నెపంతో ఎదురుచూస్తున్న పంకజంతో "ఈ సాయంత్రం బస్సుకే వెళ్ళిపోదాం అనుకుంటున్నామమ్మా" చెప్పింది అత్తగారు.

# వారఫలం

**సెప్టెంబర్ 27 నుండి అక్టోబర్ 3, 2018 వరకు**

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



**మేషం:** **అశ్విని, భరణి, కృత్తిక 1వ పా.** ఈ వారంలో ఊహించని విధంగా అనుకూలతలు పెంచుకోగలరు. మనోభీతులున్నా లెక్కచేయకుండా వ్యవహరించుకోగలరు. వృత్తి, ఉద్యోగాలందు గుర్తింపులేర్పరచుకుంటారు. స్పెక్యులేషన్ వంటివి లాభించగలవు. నూతన వ్యవహారాలు, గృహాలు చేపట్టుటకు ప్రయత్నాలు చేసే సూచనలున్నాయి. ప్రయాణాలు ప్రయోజనాలను ఇస్తాయి. ఈ రాశివారికి ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, సోమ, బుధవారాలు అనువైనవి.



**వృషభం:** **కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2పా.** మీ ప్రయత్నాలను అనుకూలింపచేసుకునే దిశగా సాగుతారు. ముందుచూపుతో సాగుతారు. సాహసకార్యాలు తలపెట్టకుండా మీకు అనుకూలమైనవి చేపట్టుకుని పూర్తిచేసుకోండి. ప్రయాణాలలో సాధారణ జాగ్రత్తలకు ప్రాధాన్యతనీయండి. మానసిక ప్రశాంతతలు సాధించుకోగలరు. తండ్రితరుపు వారిచే ప్రయోజనాలు ఏర్పడతాయి. ఈ రాశివారికి శని, ఆది, సోమవారాలు అనువైనవి.



**మిథునం:** **మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.** ఈ వారంలో ఆరోగ్య సమస్యలపై ఎక్కువ ప్రాధాన్యతను ఇవ్వవలసి ఉంటుంది. ఇతరులపై ఎక్కువ ఆధారపడక అన్నిటా స్వీయ పర్యవేక్షణలు అవసరం. చెల్లింపులందు తగుజాగ్రత్తలు అవసరం. సంతాన విద్యా విషయాలందు జీవనోపాధి మార్గాలందు ఆటంకాలు తొలగుతాయి. స్పెక్యులేషన్లకు, సాహసకార్యాలకు దూరంగా ఉండండి. ఈ రాశివారు పనులు చేపట్టుటకు గురు, శుక్ర, సోమ, బుధవారాలు అనువైనవి.



**కర్కాటకం:** **పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష.** ఈ వారంలో గతంకంటే అన్నిటా మేలైన ఫలితాలుంటాయి. స్థిరాస్తులను ఏర్పరచాలనే కోరికలు ఏర్పడతాయి. వృత్తి, ఉద్యోగాలలో మీరంటే ఏమిటో నిరూపించుకునేందుకు మంచి అవకాశాలు ఏర్పడతాయి. అతిగా మాట్లాడకుండా లౌక్యంగా వ్యవహరించుకోండి. ఖర్చుల విషయంలో తెలివిగా వ్యవహరించుకోగలరు. పూర్వార్జితాలకు రూపురేఖలు మార్చగలరు. ఆరోగ్యం అనుకూలం. గురు, శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి.



**సింహం:** **మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా.** ఈ వారంలో అనవసరమైన ఖర్చులు ఏర్పడకుండా ఆలోచనలతో సాగాలి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో వృద్ధిని పొందగలరు. సంతానపు వ్యవహారాలు ఎక్కువ ఆలోచింపచేస్తాయి. యంత్ర, వస్తు మార్పిడిలు వంటివి పూర్తిచేసుకోగలరు. యత్నీకృత కార్యారంభాలకు పట్టుదలలతో సాగవలసి ఉంటుంది. శని, ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



**కన్య:** **ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా.** మీ ప్రయత్నాలను అనుకూలింపచేసుకోగలరు. వీరికి శన్యేతర గ్రహాలు అనుకూల సంచారం. అవకాశాలను అందిపుచ్చుకోగలరు. తృప్తికరంగా రోజులు సాగుతాయి. కాలమును-ధనమును సద్వినియోగం చేయగలరు. ప్రభుత్వతరహా ప్రయోజనాలు పొందుటకు అనువైన సమయం. నూతన బంధుమిత్రత్వములు ఏర్పడతాయి. మార్కెటింగ్ ఉద్యోగులు టార్గెట్స్ పూర్తిచేసుకోగల్గుతారు. శివాలయ దర్శనాలు తప్పనిసరిచేయండి. ఈ రాశివారికి గురు, శుక్రవారాలందు అన్నిటా మెలకువలు అవసరం.



**తుల:** **చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా.** ఈ వారారంభంలో అకాల నిద్రాహారాలు- మీకు మీరుగా కొన్ని నిబంధనలు ఏర్పరచుకోవడం వంటివి ఉంటాయి. అయితే తెలియని ఆందోళనలు కొన్ని నిరాశలను ఏర్పరచగలవు. కొన్ని అదనపు చెల్లింపులు చేయవలసి రావచ్చును. నూతన వ్యాపార, వ్యవహారాలకు చేసే యత్నాలను కొంతకాలం వాయిదావేసుకోండి. స్త్రీల వివాహ, శుభకార్య యత్నాలు అనుకూలిస్తాయి. ఈ వారమంతా సాధారణ పనులతోనే సాగటంవలన మేలుతనములు ఉంటాయి.



**వృశ్చికం:** **విశాఖ 4వపా, అనూరాధ, జ్యేష్ఠ.** కుటుంబ ఆర్థిక వ్యవహారాలను అర్థవంతంగా పూర్తిచేసుకోగలరు. బకాయిలను కొన్నిటినైనా తీర్చుకోగల్గుతారు. వృత్తి, ఉద్యోగాలలో స్థిరమైన నిర్ణయాలతో సాగుతారు. బంధుమిత్రులకిచ్చిన సలహా, సూచనలు ఉపకరిస్తాయి. సత్సాంగత్యాలు ఏర్పడతాయి. స్థిరాస్తులపై ఏర్పడిన చికాకులు తగ్గుతాయి. మనోధైర్యాలతో యత్నాలను సాగించండి. వీరు సోమ, మంగళ, బుధవారాలందు అన్నిటా యోచనలతో సాగండి.



**ధనుస్సు:** **మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా.** వారారంభంలో తెలియని ఆటంకాలను ఎదుర్కోవలసి వచ్చినా ఆదివారంనుండి తలపెట్టుకున్న పనులను అనుకూలింపచేసుకుంటారు. ఖర్చులు కొన్ని ఎక్కువుగా ఉంటాయి. ఊహించుకున్న వ్యక్తులనుండి సహాయ-సహకారాలు పొందుతారు. స్పెక్యులేషన్లు చేసేటప్పుడు మీ పరిమితులను గుర్తెరిగి వ్యవహరించుకోవాలి. అనారోగ్య భావనలు క్రమేపి తగ్గగలవు. సంతానపు విద్యా విషయాలలో అనిశ్చిత స్థితులు తగ్గుతాయి. ఈ రాశివారికి ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



**మకరం:** **ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా.** విమర్శలకు దూరంగా ఉంటూ అన్నిటా అప్రమత్తంగా వ్యవహరించుకోవాలి. చేపట్టుకున్న పనులు మందంగా సాగుతాయి. ఆదాయాలు మీరనుకున్నట్లుగా ఉంటాయి. ఇతరులు గౌరవించట్లేదను భావాలకు దూరంగా ఉంటూ ఆత్మీయంగా వ్యవహరించుకోండి. స్థిరాస్తులను ఏర్పరచుకోవాలన్న కోరికలు బలపడతాయి. సంతానపు అవసరాలను తీర్చగలుగుతారు. ఈ రాశివారికి ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



**కుంభం:** **ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా.** అనారోగ్యం విషయంలో జాగ్రత్తలు అవసరం అవుతాయి. ఊహించుకున్న ప్రయాణాలు కొన్ని వాయిదాపడగలవు. కుటుంబ వ్యవహారాలలో భాగస్వామి నిర్ణయాలకు ప్రాధాన్యతనిచ్చుకోండి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు అదనపు బాధ్యతలు వంటివి ఏర్పడతాయి. ఖర్చులకు తగిన సంతృప్తిని పొందుతారు. ఒప్పందాలందు పునర్విచారణలు అవసరమవుతాయి. విద్యార్థులకు అనుకూల సమయం. ఈ రాశివారు ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, శనివారాలు అనువైనవి.



**మీనం:** **పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి.** ప్రయోజనాలు ఏర్పడుతున్నా సంతృప్తిని పొందలేకపోతారు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో మీదైన తరహాలో సాగగలరు. కుటుంబంలో ఏకవాక్యత సాధించేటట్లు సంయమనాలతో సాగండి. స్పెక్యులేషన్లచే ఆర్థిక ప్రయోజనాలు పొందగలరు. షార్ట్ జర్నీస్ చేయగలరు. భ్రాతృవర్గంచే ప్రయోజనాలు పొందుతారు. విద్యార్థులు క్రమవిధానాలకు ప్రాధాన్యతనిచ్చి పునశ్చరణలు చేసుకోవాలి. ఈ రాశివారు ముఖ్యమైన పనులు చేపట్టుటకు శని, ఆది, సోమవారములు ఎంతో అనువైనవి.

**ఉన్నత ఆలోచనలు, ఆశయాలు ఉంటే చక్కటి నడవడిక అలవడుతుంది.**

# SEX AND సైకాలజీ



డా॥జి. సమరం

కె.ఎల్. విజయవాడ

నేను అందమైన స్త్రీని అయినప్పటికీ నా మనస్సు మగవాళ్ళమీద ఉండదు. అందమైన స్త్రీలని చూస్తూంటే వాళ్ళతో శృంగారంలో పాల్గొనాలనుంటుంది. మగవాళ్ళెవరైనా నాకు లైన్‌వేసినట్లైతే కంపరం పుడుతుంది. వాళ్ళ ముఖంమీదే ఛీ కొడతాను.

ఏ స్త్రీ అయినా నా పక్కన కూర్చుంటే హగ్ చేసుకుంటాను. ముద్దులు పెట్టుకుంటాను. ఆమె కళ్ళల్లోకి క్రేజీగా చూస్తాను. ఆమె ముంగుర్లతో ఆడుకుంటాను. నేను ఆడదాన్ని అయినప్పటికీ ఇలాంటి బుద్ధులు ఎందుకు వచ్చాయి? ఒక్కొక్కసారి నా కోరిక తీరక డిప్రెషన్ వస్తుంది. చచ్చిపోవాలనిపిస్తుంది.

నేనేం చేయాలి? చివరికి చావే గతా? నేను చాలా వేదనతో ఈ ఉత్తరం రాస్తున్నాను. నన్ను బాగుపరచటం ఎవరికైనా సాధ్యమా? సలహా ఇవ్వండి.

మీలాంటివాళ్ళని 'లెస్బియన్స్' అంటారు. ఆడవాళ్ళే అయినప్పటికీ ఆడవాళ్ళ మీద కామం కలుగుతుంది. వాళ్ళతో శృంగారం చేయాలనిపిస్తుంది. మీకు మారాలని ఉంటే బిహేవియర్ మోడిఫికేషన్ థెరపీ ద్వారా మార్చవచ్చు. డాక్టర్‌ని సంప్రదించండి.

కె.యమ్. కాకినాడ

నేనూ, నా స్నేహితుడు కలిసి మా ఫ్రెండు ఇంటికి బస్‌లో అతని ఊరికి వెళ్ళాము. బస్ దిగేటప్పటికీ రాత్రి పదిగంటలు అయింది. మా ఫ్రెండు ఊరు ఒక చిన్న గ్రామం. బస్ దిగగానే టీకొట్టులో టీ తాగాము. అదే సమయంలో టీ కొట్టు పక్కనే నీడలో నలుగురు అమ్మాయిలు నిలబడివున్నారు.

వాళ్ళు మా వంకచూసి రమ్మని చేతులూపారు.

డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్
విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370
E-mail drsamaram@hotmail.com
www.gsamaram.com

Courtesy : MAXIMINDIA

మేమిద్దరం ఫన్‌గా వాళ్ళ దగ్గరికి వెళ్ళాము. వాళ్ళు మా మీదకు వచ్చి ముద్దులుపెట్టారు. అదే సమయంలో మా జేబుల్లో ఉన్న సెల్‌ఫోన్లని తీసేసుకున్నారు. సెక్స్‌లో పాల్గొంటేనే అవి తిప్పి ఇస్తామన్నారు. లేకపోతే 500 రూపాయలు ఇచ్చి తీసుకోవలసిందే అన్నారు.

ఎంతకీ మా సెల్‌ఫోనులు మాకు ఇవ్వకపోవడంతో చెరొక 500లు ఇచ్చి వాళ్ళనుండి బయటపడ్డాము. ఇప్పుడు మాకు పట్టుకున్న భయము ఏమిటంటే మామీదపడి ముద్దులుపెట్టారుకనుక వాళ్ళకి హెచ్ఐవి ఉంటే మాకు వచ్చే ప్రమాదం ఉందా? ఏదో ఫన్ చేద్దామనుకుంటే మా పని అయిపోయిందా? చాలా భయంగా ఉంది. మమ్మల్ని ఆదుకోండి.

ముద్దులు ఎంత పెట్టుకున్నప్పటికీ హెచ్.ఐ.వి. రాదు. లైంగికంగా కలిస్తేనే వస్తుంది. లైంగికంగా మీరు కలవలేదు కనుక ఆ భయం అవసరంలేదు.

ఇకముందు ఫన్‌కోసమైనా ఇటువంటి సాహసాలు ఎప్పుడూ చేయకండి. జాగ్రత్తగా ఉండండి.

ఆర్.కె.ఎస్. నాగపూర్

మేము ఇద్దరం మిత్రులం. మా ఇద్దరికీ పెళ్ళిళ్ళు అయ్యి పిల్లలు ఉన్నారు. ఇటీవల నా మిత్రుడు వ్యవహారం వింతగా మారింది. అతనికి అతని భార్యమీద అనుమానం ఎక్కువైంది.

కొద్దిరోజుల క్రితం నా మిత్రుడు తన భార్యతో సెక్స్‌లో పాల్గొనే ముందు ఆమె తొడలని ముచ్చటగా చూశాడట. ఆమె తొడల మీద ఏదో పదార్థం గంజిలాగా అంటుకుని కనబడిందట. దాంతో ఆమె ఎవరితోనో శృంగారం జరిపిందని, ఆ వ్యక్తి వీర్యం తొడలకి అంటుకుందని నిర్ణయానికి వచ్చేశాడు.

ఆమె అటువంటి పని ఏదీ చేయలేదని, తనకు తెల్లబట్ట అవుతోందని, ఆ తెల్లబట్టవల్లే తొడల దగ్గర అలాకనిపించిందని చెప్పిందట. కాని ఇతను నమ్మడం లేదు. ఇద్దరి మధ్య పెద్ద గొడవలయిపోతున్నాయి.

భార్యని వదిలేస్తానంటున్నాడు. చివరికి అతని సంసారం నిలవాలంటే మీరే ఏదైనా చెప్పాలనే ఉద్దేశ్యంతో మీకు ఉత్తరం రాస్తున్నాను. ఆమె నిజంగానే పరపురుషుడితో శృంగారం జరిపిందంటారా?

స్త్రీలకి వైట్ డిశ్చార్జి అవుతున్నప్పుడు తొడలకి గంజిలాగా అంటుకోవడం మామూలు విషయమే. కొందరికి వైట్ డిశ్చార్జి చాలా ఎక్కువ అవుతుంది.

యోనిలో నుంచి మీగడలాగా కూడా బయటకు వస్తుంది. సాధారణంగా స్త్రీలు తరచూ యోనిదగ్గర నీళ్ళతో వాష్ చేసుకుని శుభ్రంగా ఉంటారు.

మీ మిత్రుని భార్య విషయంలో జరిగిన కొద్దిపాటి నిర్లక్ష్యం ఇంత గొడవకి కారణం అయింది. అతడు అనుమానం వదిలి మామూలు అవడం అవసరం.

పి.కె. రాజోలు

నాకు సిగరెట్ తాగే అలవాటుంది. మానలేకపోతున్నాను. ఆ అలవాటు మానాలని ఎంతగా ఉన్నప్పటికీ ఎందుకనో నా తరం కావడంలేదు. నాకు పెళ్ళి అయ్యింది. ఇంతవరకు సంతానం లేదు. నా సిగరెట్ అలవాటే పిల్లలు పుట్టకపోవడానికి కారణమా? సిగరెట్ తాగేవారికి పిల్లలు పుట్టరా?

సిగరెట్‌లో నికోటిన్ అనే పదార్థం ఉంటుంది. ఇది ఒక రకం విషపదార్థం. ఈ విషపదార్థం కణాలని చంపేస్తుంది. సిగరెట్ అలవాటు అధికంగా ఉన్న వాళ్ళకి కొంతకాలానికి టెస్టికల్స్‌లో వీర్యకణాలు డ్యామేజ్ అవుతాయి. రోజు రోజుకీ తగ్గిపోతాయి. దాంతో సంతాన సాఫల్యత తగ్గుతుంది.

కొందరిలో సెక్స్ సామర్థ్యం కూడా సన్నగిల్లుతుంది. ఈ రెండింటికీ ప్రధాన కారణం స్మోకింగ్ వల్ల వృషణాలు దెబ్బతినడమే.

మీ విషయంలో ఇంతవరకు సంతానం కలగకపోవడానికి స్మోకింగ్ కారణం కావచ్చును. డాక్టరుకి చూపించి పరీక్షలు చేయించుకోండి. అలాగే స్మోకింగ్ మానడానికి సైకోథెరపీ చేయించుకోండి.

స్మోకింగ్ మానేస్తారు. స్మోకింగ్ మానేసిన కొంతకాలానికి వృషణాలు మళ్ళీ యాక్షన్‌లోకి వస్తాయి. డాక్టరు చెప్పినట్లు చేయండి.

# సీరియల్

అంతా అర్థమైనట్టు తలపంకించాడు నిషాంత్.

"ఓకే మేడమ్. మీరు భరోసా ఇస్తున్నారు గాబట్టి ఇట్స్ ఓకే" అన్నాడు.

"థాంక్యూ. దెన్ ఇట్సాల్‌రైట్. డోన్ట్‌వర్రీ. ఖచ్చితంగా కిడ్నాపర్ మన ట్రాప్‌లో పడతాడు. మీ బ్యాంక్‌నుంచి లోన్‌లు తీసుకుని వాయిదాలు కట్టలేక కోట్లలో బకాయిలు పడ్డ మొండిఖాతాల జాబితా ఒకటివ్వండి. మీ కంపెనీలో పనిచేస్తూ సుదీర్ఘ కాలంగా ప్రమోషన్ రానివాళ్ళ లిస్ట్‌కూడా కావాలి.

అలాగే మీ కంపెనీల్లో సస్పెండ్ అయినవాళ్ళ లిస్ట్, డిస్‌మిస్ అయినవాళ్ళ లిస్ట్‌కూడా కావాలి. రెండోది మీ వైఫ్ సుమిత్రగారి ఫోటో ఒకటి కావాలి" అడిగింది కామ్య.

"ఓకే. మా పి.ఎ. నైనా మీకా లిస్ట్ ఇస్తుంది" అంటూ నైనావంక చూసి ఆ పని చూడమని కళ్ళతోనే ఆర్డర్ వేశాడు నిషాంత్. వెంటనే తన క్యాబిన్‌లోని కంప్యూటర్‌వైపు పరుగెత్తింది నైనా.

"ఫైవ్ మినిట్స్‌లో లిస్ట్ మీ చేతుల్లో ఉంటుంది. బట్. ఇది ఆఫీసు, ఇక్కడ నా భార్య ఫోటోలు ఏమీ లేవు. మీవద్ద ఉండే సెల్‌ఫోన్‌తోగానీ, కెమెరాతోగానీ కావాలంటే ఫోటో తీసుకోవచ్చు. అదో... నేనూ, నా వైఫ్ తీయించుకున్న ఫోటో గోడకు వేలాడుతోంది" అంటూ ఎదురుగా హాలుచివర గోడవైపు చూపించాడు. అక్కడ చేతికి అందే ఎత్తులోనే ముప్పై అంగుళాల పెద్ద ఫోటోఫ్రేమ్ వేలాడుతోంది.

ఫోటోలో నిషాంత్ పక్కనే ఉంది చిరునవ్వులు చిందిస్తూ సుమిత్ర. విశ్వాస్ వెళ్ళి తన పాకెట్‌లోని చిన్న కెమెరాతో ఫోటోలు తీసుకునివచ్చాడు. ఈలోపు నిషాంత్ తన వాలెట్‌లోంచి తను, తన భార్య కలిసి దిగిన చిన్న ఫోటో ఒకటి కూడా ఇచ్చాడు. మరో ఐదునిముషాల్లో నైనా పరుగున వచ్చి బకాయిలు పడ్డవాళ్ళ లిస్ట్‌ని కామ్య చేతికి అందించింది.

"ఓకే" అంటూ లిస్ట్ మడిచి జేబులో పెట్టుకుంటూ లేచింది కామ్య.



"ఇక మేము వెళతాం. ఎగ్మోర్ స్టేషన్‌లో కలుద్దాం. డోన్ట్‌వర్రీ మిస్టర్ నిషాంత్. మీ వైఫ్‌ని సేఫ్‌గా తీసుకొచ్చే బాధ్యత మాది. బై" అంటూ నిషాంత్‌తో చెప్పి బయల్దేరింది కామ్య. విశ్వాస్ కామ్యను అనుసరించాడు.

E-mail: Suryadevaranovelist@gmail.com

పోర్టికో నుంచి కారు వెళ్ళిపోయేవరకు ఆగి తన పి.ఎ. నైనావంక తిరిగిచూశాడు నిషాంత్. "నైనా! నాకు టైమ్ లేదు. ఇంటికి వెళుతున్నాను. నువ్వు ఓ పని చెయ్యి. డ్రైవర్ని పిలిచి ఆఫీసు మొత్తం క్లోజ్‌చేసి తాళాలు వెంటతీసుకుని కార్లో ఇంటికి వెళ్ళిపో" అన్నాడు.

"ఓకే బాస్. మీరుమాత్రం జాగ్రత్త. టేక్కేర్" అంది నైనా.

"డోన్ట్‌వర్రీ..." అంటూ భుజంతట్టి చరచరా పోర్టికోవైపు అడుగులేశాడు నిషాంత్.

సూర్యదేవర రామ్మోహనరావు

# డబ్బులెవరికీ ఊరికే రావు



అతడి వెనకే బయటికొచ్చిన నైనా కారులో నిషాంత్ వెళ్ళిపోయేవరకు ఆగి వరండా చివర సెక్యూరిటీ వాళ్ళతో కూర్చునున్న ఆఫీసు డ్రైవర్‌ని పిలిచింది. జోరుగా శబ్దంచేస్తూ వర్షం కురుస్తూనేవుంది.

ఎగ్మోర్ వెళ్ళటానికి కోడంబాక్కం లోకల్ స్టేషన్లో కశ్యప్ సిటీ రైలు ఎక్కాడు. చలి వణికిస్తోంది. గాలి విసుర్లకు ఛెళ్ళున వాననీళ్ళు రైల్లోకి కొడుతున్నాయి. ప్రయాణీకులు కొందరు ముడుచుకు కూర్చునున్నారు. చాలామంది నిలబడేవున్నారు.

ఆ వాతావరణానికి అతీతంగా కశ్యప్ ఆలోచనలు సాగిపోతూనేవున్నాయి. ఆ ఆలోచనల్లో జనరేట్ అవుతున్న హీట్ చలి అతడిని తాకకుండా చేస్తోంది.

అతను చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

జీవితంలో ఎప్పుడూ తను రాంగ్‌రూట్‌లో పోలేదు. కష్టమైనా, నష్టమైనా, ఒత్తిళ్ళనైనా తనే ఎదుర్కొని తట్టుకుంటూ వచ్చాడు. చివరికి తొలిసారిగా సుమిత్ర కోసం దారితప్పాల్సి వచ్చింది. కాదు కాదు... తన అప్పుల సమస్యలు సుమిత్రా తెచ్చిన ఆఫర్‌కి తనను లొంగిపోయేలా చేశాయి.

లోకంలో చాలామంది చాలారకాల తప్పులు చేస్తున్నారు. అవి రొటీన్‌గా వాళ్ళకి అలవాటయిపోయిన పనులు గాబట్టి వాళ్ళకెలాంటి టెన్షన్ ఉండదు. తను అలా కాదే. మొదటిసారి చేస్తున్న తప్పు. ఇది సక్సెసయితే సరే.

ఒకవేళ ఖర్మగాలి ఫెయిలైతే, తను దొరికిపోతే... ఈ ఊహే కశ్యప్‌ను అతలాకుతలం చేస్తోంది. అదే జరిగితే తన జీవితం సర్వనాశనమైపోతుంది. తను చేస్తోంది చిన్నా చితకా నేరం కాదు. కిడ్నాప్... ఆడేది నాటకమైనా చట్టం శిక్షించాలనే చూస్తుంది.

అసలు తను దొరికిపోయే అవకాశం ఉందా...? నిషాంత్‌లాంటి కోట్లకు అధిపతి అంత సులువుగా డబ్బు ఇచ్చేస్తాడంటే నమ్మబుద్ధిగావటంలేదు.

అందుకు అతడి ఆధిపత్యం అహం రెండూ అంగీకరించవు. మరి ఎలా స్పందించే అవకాశం ఉంది?

డబ్బివ్వకుండానే కిడ్నాపరూ పట్టుబడాలి. తన భార్యా సేఫ్‌గా దొరకాలి. ఒకే దెబ్బకు రెండు పిట్టలు. ఎస్... ఈ కోణంలోనే ఆలోచించి ఏదో ప్లాన్ వేసే అవకాశం ఉంది. అలా జరగాలంటే ఒకటి తన మనుషులనైనా అరేంజ్ చేసుకోవాలి లేదా పోలీసులను ఆశ్రయించి వాళ్ళ సాయం తీసుకోవాలి. రెంటిలో ఏది జరిగినా తను పెద్ద ప్రమాదంలో పడినట్లే.

ఎందుకంటే నిషాంత్ దగ్గరికి కాయిన్‌బాక్స్ నుంచి ఫోన్‌చేసి క్యాష్‌బ్యాగ్‌ను ఫ్లైఓవర్ మెట్లపక్కనో లేక టీ బంక్‌పక్కనో వదిలివెళ్ళమని చెప్పటం తన ప్లాను. బహుశా అలాగే చేస్తాడు నిషాంత్.

తను గుడ్డిగా వెళ్ళి బ్యాగ్ పట్టుకున్న మరుక్షణం డేగలమూదిరి మూగి తనను పట్టేస్తారు పోలీసులు. నో... అలా జరక్కూడదు. రిస్క్‌లేని మరో మార్గం ఆలోచించాలి. డి.సి.ఎం. రైలు కోడంబాక్కం వదిలినప్పట్నుంచి ఇలా రకరకాలుగా ఆలోచిస్తున్న కశ్యప్‌కి తర్వాత వచ్చిన నుంగంబాక్కం, చట్‌పెట్ స్టేషన్లు ఎప్పుడు దాటినవో కూడా తెలీదు.

అతడి ఆలోచనలు ఓ కొలిక్కి రాకముందే రైలు ఎగ్మోర్ స్టేషన్‌కొచ్చి ఆగింది. పాసింజర్స్‌తోపాటు ప్లాట్‌ఫామ్‌మీద అడుగుపెట్టాడు కశ్యప్.

ఇరవై సెకన్లలో రైలు కదిలి బీచ్ స్టేషన్‌వైపు వెళ్ళిపోయింది. అప్పటికి టైమ్ రాత్రి ఎనిమిదిగంటల ముప్ఫైనిముషాలు. పగలు, రాత్రీ భేదం లేకుండా

## జరిగిన కథ 4

నిషాంత్ భార్య సుమిత్ర కిడ్నాప్ కేస్‌ను పోలీస్ కమీషనర్ వీరిద్దరికీ అప్పజెబుతాడు. కశ్యప్ భార్య గాంధార, ఆమెకోసం చాలా డబ్బు నష్టపోతాడు. కానీ ఆమెకు భర్త అంటే ప్రేమా, గౌరవం రెండూ వుండవు.

కశ్యప్ భార్యతో గొడవపడి బైటకు వచ్చేస్తాడు. కిడ్నాపర్ ఫోన్‌కోసం ఎదురుచూస్తుంటాడు నిషాంత్. యాభైకోట్లు తీసుకుని ఎగ్మోర్ రైల్వే స్టేషన్‌కి రమ్మని నిషాంత్‌కు ఫోన్‌లో చెబుతాడు కిడ్నాపర్.

కిడ్నాపర్ వేషంలో ఉన్న కశ్యప్, నిషాంత్‌ను కలిసేందుకు బయలుదేరతాడు.

విశ్వాస్, కామ్య నిషాంత్‌ని కలిసి ఎంక్వయిరీ మొదలుపెడతారు. కిడ్నాపర్ చెప్పినట్లే చేయండి, అతన్ని పట్టుకునే బాధ్యత మాది అని భరోసా ఇస్తారు ఆ ఇద్దరూ.

ఇక జరగబోయేది చదవండి.



నాన్‌స్టాప్‌గా వర్షం పడుతూనేవుంది.

రైలు దిగినవాళ్ళు మెట్లమీదుగా ఫ్లైఓవర్ ఎక్కి ఎగ్మోర్ స్టేషన్ టెర్మినల్స్‌వైపు వెళ్ళిపోతున్నారు. క్రమంగా జనం పల్చబడుతున్నారు.

కశ్యప్ దిగినవైపు గాకుండా అవతలి ప్లాట్‌ఫారం మీదే జనం ఎక్కువ కన్పిస్తున్నారు.

ఎందుకంటే పైకి వెళ్తే బీచ్ స్టేషన్ ఒకటే వస్తుంది. అదే లాస్ట్ స్టాప్... కాని దిగువకు తాంబరం దాటి వండలూరువరకు చాలా స్టేషన్‌లు వున్నాయి. కాబట్టి ఆ పక్కజనం అధికంగా ఉన్నారు. స్టేషన్ అన్ని ప్లాట్ ఫారాలమీదా పట్టపగల్లా లైట్లు వెలుగుతున్నాయి.

అవతలి ప్లాట్‌ఫారంమీదికి వెళ్ళేందుకు మెట్లదారి వైపు నాలుగడుగులు వేసిన కశ్యప్ అక్కడే ఆగి పోయాడు.రాకూడని అనుమానమే వచ్చిందతడికి.

తను నిషాంత్‌కి ఇచ్చిన టైము తొమ్మిదిగంటలు. కాస్త అటూ ఇటూ అయినా అర్ధగంటపైగా తను ఏ రైలూ ఎక్కకుండా ప్లాట్‌ఫామ్‌మీద తచ్చాడాలి. అది అంత మంచిది కాదు అనిపించింది.

ఈ లోపల రైల్వే సెక్యూరిటీ ఎవరన్నా చూస్తే అనుమానాస్పదంగా సంచరిస్తున్నావంటూ నిలదీసే ప్రమాదం ఉంది. కాబట్టి తొమ్మిదిగంటలవరకు తను ఇక్కడే ఉంటే మంచిది.

అక్కడ మఫ్టీలో పోలీసులుగాని, గూండాలుగాని తిరుగుతుంటే తను ఈజీగా పసిగట్టొచ్చు. నిషాంత్ అక్కడికొచ్చాకే తను వెళ్ళటం మంచిది.

ఈ ఆలోచన రాగానే రెయిన్ కోటు దగ్గరకు లాక్కుని ముఖంమీద వెలుతురుపడకుండా హ్యాట్ ముందుకు లాక్కుని సిగరెట్ ముట్టించుకున్నాడు.

## అన్నీ సాహసాలే

బాబ్‌కట్‌తో, జర్నలిస్ట్‌గా బ్రహ్మాండమైన 'యు టర్న్' తీసుకున్నది సమంత. పెళ్ళయ్యాక సమంత సినిమాల ఎంపికలో కాస్తంత సాహసమే కనపడు తున్నది. ఇదే విషయాన్ని అడిగితే, నిజంగానే బోలెడన్ని సాహసాలు చేశానంటూ నవ్వేసింది.

"'రంగస్థలం'లో పల్లెటూరి అమ్మాయిగా, 'అభి మన్యుడు', 'మహానటి', ఇప్పుడు 'యు టర్న్'లలో పాత్రలు సాహసోపేతమైనవే. 'యు టర్న్'లో స్టార్ హీరోలు ఎవరూ లేరు. నా కెరీర్‌లో ఇది అతిపెద్ద సాహసం. ఇకపై అన్నీ ప్రయోగాత్మక పాత్రలే చేయాలన్నది నా కోరిక" అని చెప్పింది.

అక్కడికి ప్లాట్‌ఫారం ఆ చివరనుంచి ఈ చివరకు స్పష్టంగా కన్పిస్తోంది. ప్రతి అయిదు నిముషాలకు ఒక రైలు వస్తోంది, పోతోంది.

వచ్చినవాళ్ళు రైలెక్కి వెళ్ళిపోతుంటే కొత్తవాళ్ళతో తిరిగి ప్లాట్‌ఫారం నిండిపోతోంది. వర్షం శబ్దం రైళ్ళ చప్పుళ్ళు జనం గొడవతో సందడిగా ఉంది అంతటా. క్షణాలు గడిచిపోతున్నాయి.

కశ్యప్ దృష్టి అవతలి ప్లాట్‌ఫారమ్‌మీదే ఉంది. టెన్షన్... టెన్షన్. క్షణక్షణానికీ కశ్యప్‌లో టెన్షన్ పెరిగి పోతోంది. ఏం జరగనుంది. తన ప్లాన్ వర్కవుటవు తుందా లేక దారుణమైన ఇబ్బందుల్లో పడేస్తుందా! అసలు నిషాంత్ క్యాష్‌తో వస్తున్నట్టా! రానట్టా?

ఒకవేళ తన ఏర్పాట్లేవో తను చేసుకునివుంటే ఈపాటికే ప్లాట్‌ఫామ్‌మీదికి రావాలి. అలాగే పోలీ సులుగాని, రౌడీలుగాని వాళ్ళ ఉనికి తెలియాలి. అలాంటి సూచనలేవీ కన్పించటంలేదు.

నిజంగానే ఎలాంటి ట్రిక్కు ప్లే చేయకుండా డబ్బి చ్చేసే ఉద్దేశంతోనే ఉన్నాడా...? ఏదీ అర్థంగావటం లేదు. వర్షం కారణంగా మరీ స్పష్టంగా అటు గమ నించటం కశ్యప్‌కి సాధ్యంగావటంలేదు.

కళ్ళు చికిలించి దృష్టి సారిస్తున్నాడు.అతని టెన్ష న్‌లో అతనుండి గమనించలేదుకాని.... శ్రద్ధగా చుట్టు పక్కలకే కాకుండా కొంచెం పైకికూడా చూసుంటే పదిహేను అడుగుల ఎత్తులో సి.సి. కెమెరాల్ని సరి చేస్తున్న టెక్నీషియన్స్ కనపడేవారే.

అప్పటికే ఆ స్టేషన్‌లో 50 సి.సి. కెమెరాల్ని బాగు చేసి, యాక్టివేట్ చేసిన టెక్నీషియన్స్ అల్యూమిని యమ్ నిచ్చెనలు దిగి, వాటిని ఫోల్డ్ చేసుకొని వెళ్ళి పోతున్నారు. రైల్వేస్టేషన్ మానిటరింగ్ రూమ్‌లో క్రైమ్‌బ్రాంచ్ కాప్స్ కొందరు ప్రతి మూమెంట్‌ని, ప్రతి వ్యక్తినీ డేగ కళ్ళతో చూస్తున్నారు.

సమయం ఇంకో పావుగంట ముందుకు సాగింది. అప్పుడు... సరిగ్గా అప్పుడు కశ్యప్ దృష్టిలో పడ్డాడో వ్యక్తి. సివిల్ డ్రెస్‌లోనే ఉండి రెయిన్ కోటు బటన్స్ పెట్టుకోకుండా వదిలేశాడు.

పోలీస్ క్రాపు నడక తీరు చూస్తే వాడు కాప్ అని ఇట్టే చెప్పొచ్చు. వాడు ప్రయాణీకులను నిశితంగా గమనిస్తూ ప్లాట్‌ఫామ్ ఎగువకు వెళుతున్నాడు.

అలాంటివాళ్ళు ఇంకా ఎంతమంది ఉండొచ్చు? లేచి నిలబడి జాగ్రత్తగా గమనించిన కశ్యప్ అక్క డక్కడా సుమారు పదిమందిని గుర్తించగలిగాడు. తనకు తెలిసే ఇంతమంది ఉంటే తనకు తెలీకుండా ఇంకెంతమంది ఉన్నారో. తన అంచనా కరక్టైంది.

నిషాంత్ భారీ ఏర్పాటే చేసుకున్నాడు. తను ఇవతలే ఆగిపోవటం చాలా మంచిదయింది. ఇప్పుడు తనేం చేయాలి?

కశ్యప్ ఆలోచనలు ఓ కొలిక్కి రాకముందే ప్లాట్ ఫామ్‌మీద చాయ్‌వాలా అరుపులు విన్పించాయి.

అటు చూశాడు.

క్యాన్ ఫ్లాస్క్‌లో చాయ్ తీసుకుని చాయ్‌వాలా ఒకడు మెట్లుదిగి వస్తూ కన్పించాడు. అక్కడక్కడ నిలబడిన ప్రయాణీకులు వాణ్ని చుట్టేశారు.

వర్షం కారణంగా ఇటుపక్క ప్లాట్‌ఫారాల మీద టీ బంక్‌లు క్లోజ్ చేశారు. దాంతో చాయ్‌వాలాకి గిరాకీ పెరిగింది. తనూ అటు వెళ్ళి చాయ్ తీసు కున్నాడు కశ్యప్. పేపర్ కప్‌లో చాయ్ తాగుతుంటే చలికి హాయిగా ఉంది. మరోసారి అవతలి ప్లాట్ ఫామ్‌ని గమనిస్తూ నిలబడ్డాడు.

చాయ్ తాగి ఫ్రెష్‌గా మరో సిగరెట్ వెలిగించాడు. ఇంతలో అతడి కంటపడ్డాడు నిషాంత్.

బయటినుంచి పై ఓవర్‌మీద నేరుగా అటు వెళ్ళి పోయినట్టున్నాడు. మెట్లుదిగి బరువైన ట్రాలీబ్యాగ్‌ను లాక్కొంటూ ప్లాట్‌ఫామ్ మధ్యకు వస్తూ కన్పించాడు. ఆ బ్యాగ్‌లో యాభైకోట్లు క్యాష్ ఉంది. కాని అది తన చేతికి వస్తుందా లేదా? తిరిగి కశ్యప్‌లో టెన్షన్ ఆరంభమైంది. సిగరెట్ దమ్ముకొడుతూ మరింత నిశితంగా గమనించసాగాడు.

నిషాంత్ ప్లాట్‌ఫామ్‌మీద నిలబడి ఓ చేత్తో ట్రాలీ బ్యాగ్ పిడిని గట్టిగా పట్టుకుని చుట్టూ చూస్తున్నాడు. మాటిమాటికీ సెల్‌ఫోన్‌లోకి చూస్తున్నాడు. డౌట్‌లేదు.



**ఒక సమస్య పరిష్కారానికి హడావుడి నిర్ణయాలు తీసుకుంటే ఆర్థిక రంగానికి మరింత నష్టం వాటిల్లుతుంది.**

-పీయూష్ గోయల్, కేంద్రమంత్రి



**ఐదేళ్ళ తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో నిరుద్యోగులే లేకుండా చేస్తాం.**

**-లోకేష్, ఏ.పి. మంత్రి**

అతడు తనకోసం తన ఫోన్‌కోసం చూస్తున్నాడు.

మరోపక్క మఫ్టీలో తిరుగుతున్న పోలీసులు, అక్కడ రైలుకోసం ఎదురుచూస్తున్న జనానికి ఇవేమీ తెలీదు. ఒక హైడ్రామాకి ఆ ప్లాట్‌ఫామ్ వేదికైందన్న సంగతే వాళ్ళకెవరికీ తెలీదు. తొమ్మిది గంటలవటానికి ఇంకా ఐదునిముషాలే టైముంది.

ఇంతలో మెట్లుదిగి ప్లాట్‌ఫారంమీదికొస్తున్న మరో జంట కశ్యప్‌ని ఆకర్షించింది. వాళ్ళని గుర్తుపట్టగానే షాకయ్యాడు. ఎందుకంటే వాళ్ళెవరో కాదు, క్రైమ్ బ్రాంచ్ అండర్ కవర్ కాప్స్ కామ్య, విశ్వాస్‌లు.

గతంలోనే ఆ ఇద్దరూ కశ్యప్‌కు తెలుసు. ఓసారి వాళ్ళ కారు సరిగ్గా తన గ్యారేజ్‌ముందే ఆగిపోయింది. పిలిచి చూడమన్నారు. ఆ రోజు తనే రిపేర్ చేసి అర్ధ గంటలో రెడీ చేసిచ్చాడు. మాటల సందర్భంగా వాళ్ళిద్దరూ క్రైమ్‌బ్రాంచ్ కాప్స్ అని తెలిసింది.

తన పనికి మెచ్చి ఏదన్నా సాయం కావాలంటే ఫోన్ చేయమని తన సెల్ నెంబర్ ఇచ్చిందామె. ఆ నెంబరు ఇప్పటికీ తన గ్యారేజ్ ఆఫీస్ రూమ్‌లోని టెలిఫోన్ డైరీలో ఉంది. తను వాళ్ళకి గుర్తుండక పోవచ్చు. కాని వాళ్ళు తనకు బాగా గుర్తు.

సో... తను భయపడినట్టే జరిగింది. తన అంచనా అక్షరాలా నిజమైంది. నిషాంత్ క్రైమ్ బ్రాంచ్ హెల్ప్ తీసుకున్నాడు. వాళ్ళు కిడ్నాపర్‌కోసం ప్లాట్‌ఫామ్‌మీద ట్రాప్ సిద్ధం చేసి కాచుక్కూర్చున్నారు. ఇప్పుడు తనేం చేయాలి? రకరకాల ఆలోచనలతో కశ్యప్ మస్తిష్కం వేడెక్కిపోతోంది.నుదుట స్వేదం అలుముకుంది. అరచేతులు చెమటలు పోస్తున్నాయి.

సిగరెట్ చివరంటా కాలి వేళ్ళను చురుక్కుమనిపించటంతో దాన్ని అవతలకు విసిరి ఫ్రెష్‌గా మరో సిగరెట్ ముట్టించుకున్నాడు. ఇప్పుడు తనకు మిగిలింది ఒక్కటే దారి. గప్‌చుప్‌గా వెనక్కి వెళ్ళిపోవటం.

కాని నిషాంత్ చేతిలోని ట్రాలీబ్యాగ్‌ని, అందులోని క్యాష్‌ని వదిలిపోవాలంటే మనసొప్పటంలేదు. యాభైకోట్ల రూపాయలు. మాటలా! అందుకే ఏదోటి చేయమంటోంది మనసు. ఏం చేయాలి?

ఉన్నట్టుండి ఒక నిశ్చయానికొచ్చేశాడు కశ్యప్.

ఎగువన బీచ్ స్టేషన్‌వైపునుంచి లోకల్ రైలు వస్తున్న హారన్ విన్పిస్తోంది. ఇంకో రెండు నిముషాల్లో అది అవతలి ప్లాట్‌ఫారానికొచ్చేస్తుంది.

ఇప్పుడిక ఆలోచించి ప్రయోజనం లేదని అర్థమైపోయింది. సక్సెసైనా కాకపోయినా చివరి ప్రయత్నం చేసి రైలెక్కేయాలన్న నిశ్చయంతో అక్కడ్నుంచి వేగంగా కదిలాడు కశ్యప్. మెట్లదారివెంట పైన ఫ్లైఓవర్‌ని చేరుకున్నాడు. అవతల హెడ్‌లైట్ల కాంతిలో స్టేషన్‌లోకి వచ్చేస్తోంది రైలు.

రైలుకోసం వెళుతున్నవాడిలా ఎడంపక్క పరుగెత్తి అక్కడినుంచి వేగంగా మెట్లు దిగనారంభించారు. కశ్యప్ చివరి మెట్టు దిగుతూండగానే రైలు ప్లాట్‌ఫారానికి వచ్చేసింది. అందరి దృష్టి రైలుమీద ఉంది.

రైలు ఆగింది. ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు. దిగేవాళ్ళు దిగుతున్నారు. కశ్యప్ జనంలో అడ్డదిడ్డంగా పరుగు తీస్తూనిషాంత్ వెనకతట్టునుంచి ముందుకు పోతూ అతడిముందు మూడు సెకన్లు ఆగాడు.

"పోలీసుల్ని తెచ్చి తప్పు చేశావ్. నీ వైఫ్ సేఫ్‌గా రావాలంటే క్యాష్‌బ్యాగ్‌తో నా వెనకే రైలు ఎక్కు" అంటూ నిషాంత్‌కి విన్పించేలా హెచ్చరించి వేగంగా రైలు డోర్‌వైపు వెళ్ళిపోయాడు. తన ముఖం నిషాంత్‌కి తెలీకుండా జాగ్రత్తపడ్డాడు.

చిన్నగా లోగొంతుతో కశ్యప్ చేసిన హెచ్చరికను నిషాంత్ మాత్రమే వినగలిగాడు. షాక్‌తో క్షణంపాటు అలాగే నిలబడిపోయాడు. కిడ్నాపర్‌ను వెనకనుంచి మాత్రమే చూడగలిగాడు. వాడు రైలెక్కేస్తున్నాడు.

తనూ రైలెక్కాలని రెండడుగులు ముందుకేసి కూడా చటుక్కున ఆగిపోయాడు. అతడి చెవుల్లో కామ్య హెచ్చరిక గింగిర్లు తిరుగుతోంది.

ఎట్టి పరిస్థితిలోనూ కిడ్నాపర్ వెనక రైలు ఎక్కకూడదని కామ్య హెచ్చరించింది. ఇప్పుడు తను రైలు ఎక్కాలా వద్దా? కన్ఫ్యూజన్‌లో- "ఏయ్! ఆగు, ఆగరా" అంటూ పెద్దగా అరిచాడు.

కాని ఆగలేదు కశ్యప్. అప్పటికే అడ్డంగా ఉన్న వాళ్ళని రఫ్‌గా తోసుకుంటూ లోపలికెళ్ళిపోయాడు.

## తాజా అందాలు

కిక్ బాక్సింగ్ ఛాంపియన్‌షిప్‌లో జాతీయ స్థాయిలో సిల్వర్ మెడలిస్టు, హిందీ సీరియల్స్ ఫేమ్ అయిన నైరాషా ఇంతకుముందు తెలుగులో తళుక్కుమన్నది. ఇప్పుడు 'బుర్రకథ'లో ఓ తారగా నటిస్తోంది. ఈ పాత్రకు తాజా అందాల తారను అద్దే క్రమంలో నైరాకు ఓటేశారు.

పాత్రకు అవసరమైనమేరకు ఆమెకు తగిన అనుభవం వుందనేది చిత్ర నిర్మాతల అభిప్రాయం కాగా, ఈ పాత్ర తనలోని ప్రతిభను వెలికితీయడానికి ఉపకరిస్తుందనేది నైరా ఆశ.



అంతా క్షణాల్లో జరిగిపోయింది. అంతలోనే రైలు మూవ్ అయింది. ఈ లోపల నిషాంత్‌ని గమనిస్తున్న కామ్య, విశ్వాస్‌లిద్దరూ పరుగెత్తుకొచ్చారు. మఫ్టీలోని పోలీసులూ వచ్చేశారు. ఈ హడావుడేమిటో అర్థంగాక ప్లాట్‌ఫామ్‌మీద మిగిలినవాళ్ళు తెల్లబోయి చూస్తున్నారు. "ఏమైంది?" వస్తూనే అడిగింది కామ్య.

"వాడు వెళ్ళిపోతున్నాడు మేడమ్. నన్ను రైలెక్కమని హెచ్చరించి రైలెక్కేశాడు. హీ ఎస్కేప్డ్. అయామ్ హెల్ప్‌లెస్" అన్నాడు విచారంగా నిషాంత్.

అంతా రైలువంక చూశారు. అది వెళ్ళిపోతోంది. రైలు వేగమందుకుంది. బోగీలు దాటిపోతున్నాయి.

నిషాంత్ మాటలు విన్న ముగ్గురు పోలీసులు పరుగెత్తి ఇంజను పక్క చివరి బోగీలోకి ఎక్కేశారు" కిడ్నాపర్‌ని పట్టుకోవాలని.

ఎక్కారుగాని కిడ్నాపరు ఎలా ఉంటాడో తెలిస్తే గదా పట్టుకోవడానికి. వాళ్ళది వృథాప్రయాసని తెలుస్తూనేవుంది. చూస్తుండగానే రైలు వెళ్ళిపోయింది.

ఈ లోకల్‌రైళ్ళకి ఆరుగాని ఎనిమిది బోగీలు కాని ఉంటాయి. ఒక బోగీలో సగం ఇంజను ఆక్రమించి ఉంటుంది. అలాంటివి మధ్యలో ఒకటి ముందుగాని వెనకగాని ఒకటి ఉంటుంది.

అంటే ఈ రైళ్ళు రెండు ఇంజన్లతో నడుస్తాయి. కాబట్టి ఈ చివరినుంచి ఆ చివరివరకు నడవటం వీలుకాదు. మధ్యలో ఇంజనుంటుంది.

పోలీసులు కశ్యప్ ఎక్కినవైపే చివరి బోగీలో ఎక్కారు. కాని లోపల ఎంత తిరిగినా కిడ్నాపర్‌ను గుర్తించలేక తర్వాతి స్టేషన్లో దిగి అటునుంచి వస్తున్న మరో రైల్లో ఎగ్మోర్‌కి తిరుగుముఖం పట్టారు.

ఈలోపల కిడ్నాపరు తప్పించుకుని రైల్లో వెళ్ళిపోయాడు. అది స్పష్టంగా అర్థంగానటంతో ఎక్కడలేని నీరసం ఆవహించి శక్తి లేనట్టు పక్కనున్న సిమెంట్ బెంచ్‌మీద కూలబడిపోయాడు నిషాంత్.

ఆ పరిస్థితిలో కూడా ట్రాలీ బ్యాగ్ పిడిని అతడి చేయి గట్టిగా పట్టుకునేవుంది. యాభైకోట్ల క్యాష్. తలవంచుకుని చాలా దీనంగా విచారంగా కూర్చున్న నిషాంత్‌ను చూస్తూ ఎదురుగా నిలబడిన కామ్య, విశ్వాస్‌లు ముఖముఖాలు చూసుకున్నారు.

చుట్టూ మఫ్టీలో కాప్స్ కాపలా ఉన్నారు.

అక్కడేం జరుగుతోందో అర్థంగాక ఆశ్చర్యంగా చూస్తున్నారు ప్లాట్‌ఫామ్‌మీదికొస్తున్నవాళ్ళు.

నిషాంత్‌కు విపరీతమయిన కోపం ముంచుకు వస్తోంది. ఆ కోపాన్ని ఎవరిమీద చూపించాలో అర్థంగాక కంట్రోల్ చేసుకుంటున్నాడు.

అతడి పరిస్థితి కామ్యకు అర్థమవుతోంది. 'మిస్టర్ నిషాంత్! డోన్ట్‌వర్రీ. కిడ్నాపర్ తప్పించుకోలేడు. ఇవాళ కాకుంటే రేపయినా పట్టుబడకతప్పదు...' అంటూ నచ్చచెప్పాలని చూసింది.

ఆ మాటతో పుండుమీద కారం చల్లినట్టై తలెత్తి చూశాడు నిషాంత్, "అవును మేడమ్. వాడు తప్పించుకోలేడు. మీరు ఏదో రోజు పట్టుకుంటారు. కాని ఈలోపల నా వైఫ్‌ని చంపి ముక్కలు చేసి పార్శిల్ పంపిస్తే... చనిపోయిన నా వైఫ్ తిరిగొస్తుందా?

మన కళ్ళముందే వాడు తప్పించుకుపోయాడుగా. మీరింతమంది ఉండి ఏం చేయగలిగారు.

ఈ డబ్బు వాడి చేతికి వెళ్ళిపోయుంటే ఇంకో గంటలో నా భార్య నా కళ్ళముందుండేది. మిమ్మల్ని నమ్ముకుని చెడ్డాను. వాడు ఖచ్చితంగా అన్నంత పనీ చేస్తాడు. వెళ్ళగానే నా వైఫ్‌ను చంపేస్తాడు..." అంటూ బొంగురుపోయిన గొంతుతో కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు నిషాంత్.

"నిషాంత్ జీ! మేం కిడ్నాప్ కేసులు చాలా చూశాం. మీరనుకున్నట్టు జరగదు. ధైర్యంగా ఉండండి. వాడు మీ వైఫ్‌ని చంపడు. ఎందుకంటే చంపితే వాడికేమీ రాదు. వాడికి కావలసింది డబ్బు. మీ వైఫ్ కాదు" అంది కామ్య.

"అంతేనంటారా మేడమ్?" బేలగా చూస్తూ అడిగాడు నిషాంత్.

"అవును. వాడు ఈ రాత్రికో రేపో మళ్ళీ మీకు ఫోన్‌చేసి ఇంకో అవకాశం ఇస్తాడు. అప్పుడు ఇంకో బెటర్ ప్లాన్ చేద్దాం" అంది.

"మీ మాట నిజమైతే అయామ్ హ్యాపీ. బట్ ఈసారి మీ హెల్ప్ నాకు అక్కర్లేదు. నేనే వాడు అడిగినచోట డబ్బు ఇచ్చేసి నా వైఫ్‌ని విడిపించుకుంటాను" అన్నాడు నిషాంత్.

"ఓకే. మీ ఇష్టం"

"ఇప్పుడు నేనేం చేయాలి?"

"ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు. ఇంటికి వెళ్ళిపోండి. లెటజ్ గో" అంది అందర్నీ చూస్తూ.

అటూ ఇటూ కామ్య, విశ్వాస్‌లు చుట్టూ పోలీసు బలగం మధ్య అక్కడనుంచి కదిలాడు నిషాంత్.

ఎగ్మోర్ స్టేషన్ బైట పార్కింగ్‌లో ఉంది నిషాంత్ కారు. నిషాంత్ కారు ఎక్కాడు.

క్యాష్‌బ్యాగ్ పక్కన పెట్టుకున్నాడు.

అతడి కారు బయలుదేరి వెళ్ళగానే క్రైమ్‌బ్రాంచ్ కాప్స్ అక్కడ్నుంచి కదిలారు. **ఇంకా ఉంది**

పెట్రోల్ ధరలను తగ్గించకపోతే నరేంద్రమోడీకి ఎన్నికల్లో దెబ్బతగులుతుంది.

-బాబా రామ్‌దేవ్, ఆధ్యాత్మిక గురు

# చిలిపి

**పేషెంట్‌ని చూడగానే ప్రయివేటు డాక్టరు ఎందుకు చిరునవ్వుతో పలకరిస్తాడు?**
ఎడ్మిషన్ ఫీజు ఇచ్చిన బాధను మరిపించడానికి.

**ఎంప్లాయ్‌మెంట్ కార్డ్ రెన్యూవల్ చేయించడం ఎందుకు?**
నిరుద్యోగులు ఎంతమంది సజీవంగా ఉన్నారో ప్రభుత్వానికి తెలియజేయడానికి.

**కొందరు ఆడవాళ్ళు గోళ్ళు పెంచుతారెందుకు?**
సిగ్గేసినప్పుడు గిల్లుకోవడానికి.

**ఆఫీసు తలుపు తెరవగానే వెంటనే లోనికి వెళ్ళేదెందుకు?**
న్యూస్‌పేపర్లు చదువుకోవడానికి.

**టీచర్ అంటే?**
స్టూడెంట్స్ ముందు బుద్ధిగా నిలబడి పాఠాలు అప్పజెప్పేవాడు.

**భార్య దృష్టిలో భర్త రాక్షసుడిలా కనిపించేది ఎపుడు?**
ప్రసవవేదన పడేటప్పుడు.

**దూరదర్శన్ అంటే ఏమిటి?**
దూరంగా ఉండి దర్శనం ఇచ్చేది.

Heaven is under our feet
as well as over our heads

## ఒక్క ముక్క తిన్నా చాలు

బాగా పండిన బొప్పాయి ముక్క ప్రతిరోజూ ఒక్కటి చొప్పున తింటున్నా ఎంతో మేలు జరుగుతుంది. జీర్ణవ్యవస్థ సజావుగా పనిచేస్తుంది.

రోగనిరోధకశక్తి పెరుగుతుంది. బొప్పాయి పండులో ఖనిజాలు, ఫాస్ఫరస్, కాపర్, పొటాషియం, క్యాల్షియం, ఐరన్, మెగ్నీషియం, మాంగనీస్ వంటివన్నీ లభిస్తాయి. శరీరానికి శక్తిని ఇస్తుంది.

సులువుగా జీర్ణం అవుతుంది. భోజనం తర్వాత తింటే మంచిది. పండులోని పీచు మలబద్ధకం లేకుండా చేస్తుంది. ఇన్‌ఫెక్షన్‌లను అడ్డుకోగల శక్తి వుంటుంది. చర్మం ముందస్తుగా ముడతలు పడకుండా కాపాడడంలో బొప్పాయిని మించింది లేదు. చర్మసంబంధిత వ్యాధులనుంచి పరిరక్షిస్తుంది. ◆

## భలే సొంఠి

అల్లాన్ని ఎండబెట్టి తయారుచేసే శొంఠిపొడి ఈ సీజన్‌కు మంచి ఔషధం వంటిది. వర్షంలో తడిస్తే వచ్చే జలుబు, దగ్గు, జ్వరాలకు మందు మాదిరి పని చేస్తుంది. జలుబు చేసినప్పుడు శొంఠిపొడిని నీటిలో మరగకాచి తాగితే ఉపశమనంగా వుంటుంది.

శొంఠిపొడిలో చిటికెడు బెల్లంపొడి కలుపుకుని ప్రతిరోజూ తీసుకుంటుంటే ప్రయోజనం కనపడుతుంది. వేడి అన్నంలో కొంచెం శొంఠిపొడి, పప్పునూనె కలిపి ప్రతిరోజూ తొలిముద్దగా తిన్నట్లయితే ఆకలి, జీర్ణశక్తి మరింత బావుంటాయి. ◆

## మూడు, నాలుగు కప్పులు

కాఫీ తాగడం మంచిదా? కాదా? ఎన్ని కప్పులు తాగవచ్చు? అన్న చర్చ ఎప్పటికప్పుడు కొత్తగానే ఉంటుంది. రోజుకు మూడు, నాలుగు కప్పులు కాఫీ తాగడంవల్ల అనేక వ్యాధులు, పరిస్థితులు అదుపులో వుంటాయని తాజా పరిశోధనల్లో గుర్తించారు.

క్యాన్సర్, కార్డియో వాస్క్యులర్ రుగ్మతల రిస్కు కాఫీవల్ల తగ్గుతుందనేది పరిశోధనల సారాంశం. ఎక్కువసార్లు కాఫీ తాగడంవల్ల సమస్యలున్నప్పటికీ, 3, 4 కప్పుల మోతాదుతో హానికంటే ఆరోగ్య ప్రయోజనాలే ఎక్కువని పరిశోధకులు స్పష్టంచేశారు.



Courtesy : VANITHA

# దక్షిత

డిగ్రీ ఫైనలియర్ చివరి పరీక్ష పేపరు రాసిన తర్వాత మానసిక ఒత్తిడి మాయమైన శుభ సందర్భాన్ని హాయిగా గడపాలని స్నేహితురాళ్ళతో కలిసి పంజాగుట్ట సెంట్రల్‌మాల్‌కి వెళ్ళింది దక్షిత. సినిమాకు ఇంకా సమయం ఉండడంతో అందరూ మెక్‌డొనాల్డ్‌లో కూర్చుని కబుర్లలో పడిపోయారు.

మామూలు కబుర్లుకాస్తా భవిష్యత్తు జీవితంవైపుకు మళ్ళాయి. "నాకిప్పుడే పెళ్ళి చేసేస్తామంటున్నారే మా పేరెంట్స్" దిగులుగా అందో అమ్మాయి.

"అదృష్టవంతురాలివే నీవు. నాకు పెళ్ళి చేసుకుందామని ఉన్నా మావాళ్ళు చేసేట్టు లేరు. ఇంకా ఏదైనా పీజీ చేసి ఉద్యోగం చూసుకోమంటున్నారు" అంటూ మరో అమ్మాయి నిట్టూర్చింది.

**గంపుల నరసింహారెడ్డి**

"నా నెక్స్ట్ ప్రోగ్రామ్ ఎప్పుడో ఫిక్స్ చేశారు మా డాడీ, యూఎస్‌లో బిజినెస్ మేనేజ్‌మెంట్ కోర్సు చేసి రావాలని ఆయన కోరిక" అంది దక్షిత.

ఆమె తండ్రి భారతి ఇండస్ట్రీస్ యజమాని విద్యాసాగర్. తల్లి పేరు భారతి. వారికి ఈ దక్షిత ఏకైక సంతానం."మనందరిలోకి దక్షిత నిజంగానే అదృష్టవంతురాలే. భవిష్యత్తు గురించి బెంగలేదు. ఆమె భవిష్యత్తు గురించి చక్కని రోడ్డు మ్యాప్ ఆమెతండ్రి ఎప్పుడో తయారుచేసి పెట్టారు" కించిత్తు ఈర్ష్యతో అంది ఇంకో అమ్మాయి.

"అవునే నా పేరును కూడా మా నాన్నగారు వ్యాపార దక్షత కలిగి ఉండాలని, చిన్నప్పటినుండే అలవరచుకోవాలని కాబోలు 'దక్షిత' అని పెట్టారు" అని నవ్వుతూ అంది.

"ఐతే త్వరలో యూఎస్‌కి ఎగిరిపోతావన్నమాట"

"అవునే. ఇక ఆ ప్రాసెస్ స్టార్ట్ చేయాలి..." అంటుండగానే ఆమె సెల్‌ఫోన్ మోగింది.

ఆమె తల్లి భారతి నుండి వస్తోందా కాల్.

"దక్షీ ఎక్కడున్నావే, అర్జంటుగా అపోలో హాస్పిటల్‌కిరా, నాన్నగారిని తీసుకెళ్తున్నాం అక్కడికి" అవతలివైపు తల్లి స్వరం కంగారుగా, ఆందోళనగా వినిపించింది: "అపోలోకా, నాన్నగారికేమైందమ్మా" ఆశ్చర్యం, ఆదుర్దా కలగలిసినట్లుగా అడిగింది దక్షిత.

"కాలు చేయి కదపలేకపోతున్నారు... నాకు భయంగా ఉంది తొందరగా వచ్చేయి"

"అమ్మా, అమ్మా..." అంటుండగానే ఫోన్ కట్ అయింది. అప్పటికే విషయం అర్థమయి స్నేహితురాళ్ళంతా సర్దుకొని నిలబడ్డారు.

దక్షితకు బదులుగా మరో అమ్మాయి కారు నడపగా తొందరలోనే హాస్పిటల్‌కు చేరుకున్నారు.

ఎమర్జెన్సీవార్డు దగ్గరికి చేరుకోగానే తల్లి ఎదురొచ్చి కూతుర్ని కావలించుకుని రోదించసాగింది.

"ఊర్కో ఊర్కో అమ్మా" అంటూ తల్లిని అనునయించి అక్కడే ఉన్న తమ ఫ్యాక్టరీ మేనేజరు వంక ప్రశ్నార్థకంగా చూసింది దక్షిత.

అతడు ఆమెను సమీపించి "మైల్డ్ పెరాలసిస్ స్ట్రోక్ అంటున్నారమ్మా డాక్టర్లు" అని చెప్పాడు.

తల్లి చెప్పినవిషయం విన్నప్పుడే దక్షిత ఊహించినది కూడా అదే కావడంతో ఆమె కలవరపడలేదు. తల్లితో కలిసి వెళ్ళి డాక్టరును కలిసింది.

"నథింగ్ టు వర్రీ నయమవుతుంది కాని దాదాపు సంవత్సరంపాటు ఇంట్లోంచి బయటకు వెళ్ళడానికి వీలుండదు. పైగా మానసికంగా ప్రశాంతంగా గడపాలి" అన్నాడు డాక్టరు. దాంతో కొంత ఉపశమనం కలిగింది వాళ్ళిద్దరికీ.

పదిహేనురోజుల తరువాత విద్యాసాగర్‌ని హాస్పిటల్‌నుండి డిశ్చార్జి చేశారు. బెడ్‌పైనే సపర్యలుచేయాల్సి వస్తూ ఉంది. ఒక మేల్ నర్సును అపాయింట్ చేసుకున్నారు. ఈలోగా ఫ్యాక్టరీ గురించి చాలా విషయాలు తెలుసుకుంది దక్షిత.

భారతి ఇండస్ట్రీలో ప్లాస్టిక్ క్యారీ బ్యాగ్స్ తయారుచేస్తారు. తక్కువ రేటులో తక్కువ నాణ్యత కలిగిన బ్యాగ్స్ తయారు చేస్తున్న కాలంలో బాగా లాభాలు వచ్చాయి. కాని ప్రభుత్వ విధానంవల్ల యాభై మైక్రాన్ల బ్యాగులు తయారుచేయవలసి రావడంతో పరిశ్రమ పరిస్థితి దిగజారడం ప్రారంభమైంది. యంత్రాలు పాతబడిపోవడం, కార్మికులతో యజమాని విద్యాసాగర్ వైఖరి సరిగా లేకపోవడంతో ఉత్పత్తి తగ్గుముఖం పట్టసాగింది.

మార్కెటింగ్ ఉద్యోగులకు సరైన శిక్షణ లేక కొత్త ఆర్డర్లు రావడం క్రమేపీ తగ్గుతూ వచ్చాయి.

దానికి తోడు వర్కింగ్ క్యాపిటల్‌కై బ్యాంకులో ఉన్న క్యాష్‌క్రెడిట్ అకౌంటులో రెగ్యులర్ ట్రాన్సాక్షన్లు లేక బ్యాంకు వారినుండి ఒత్తిడి మొదలైంది.

క్రెడిట్ లిమిట్ మొత్తం వాడేసుకుని వడ్డీ కూడా కట్టలేని పరిస్థితుల్లో మొత్తం బాకీ కట్టాల్సిందిగా బ్యాంకు నుండి నోటీసుకూడా వచ్చిందట.

పైగా ఉద్యోగులకు నెలనెలా జీతాలివ్వడం గగనమైపోయి మునిగిపోతున్న నావని తలపిస్తోంది ఫ్యాక్టరీ పరిస్థితి. ప్రస్తుత నెలలో పదిరోజులు గడిచిపోయినా గత నెలజీతాలు ఇంకా ఇవ్వకపోవడంతో ఉద్యోగులు ఆందోళన చెంది లేబర్ కమీషనర్‌ను ఆశ్రయించారట.

చర్చలకు రమ్మని లేబర్ కమీషనరు నుండి తాఖీదు వస్తుందేమోననే గాబరాతో నాలుగైదు రోజులుగా మథనపడుతున్నాడట విద్యాసాగర్. తండ్రి హాస్పిటల్‌నుండి ఇంటికి వచ్చిన వారం రోజుల తరువాత లేబర్ కమీషనర్ నుండి ఫోన్‌కాల్ వచ్చింది దక్షితకి.

తండ్రి ఆరోగ్య పరిస్థితి గురించి అడిగి అసలు విషయానికొచ్చారు ఆయన. "నీకు ఓ వారంరోజుల గడువు ఇస్తున్నానమ్మా ఈలోగా మీ పేరెంట్స్‌తో మాట్లాడి నిర్ణయం తీసుకొని మా ఆఫీసుకురా. వర్కర్స్ యూనియన్‌వాళ్ళని కూడా ఆ రోజే రమ్మంటాను. వివరంగా చర్చిద్దాం ఏం చేయాలో"

తల్లిని ఒంటరిగా కూర్చోబెట్టుకొని పరిస్థితి వివరించింది. భర్త చాటు ఇల్లాలు భారతి, పైగా సగటు భారతీయ మాతృమూర్తి మనస్తత్వం,వైఖరి ఆమెది. అందుకే "ఆ ఫ్యాక్టరీ వ్యవహారాలేవీ నాకు చెప్పేవారు కాదు మీ నాన్నగారు. నేను కూడా పట్టించుకునేదాన్ని కాదు. దాన్ని



లాభసాటిగా నడపడం మీ నాన్నగారివల్లే కాలేదు, మనమేం చేయగలం?

దాన్ని అమ్మేసి ఇవ్వవలసినవాళ్ళకి ఇచ్చేసి, మిగతా డబ్బుతో నీ యూఎస్‌లో చదువుకు కొంత, మా జీవనాధారానికి కొంత ఉపయోగించుకుందాం.

నీ చదువు పూర్తయి వచ్చిన తరువాత నీకు పెళ్ళి చేసేస్తే మా బాధ్యత తీరిపోతుంది" అంది.

తన తల్లి స్థానంలో ఇంకే మాతృమూర్తి ఉన్నా ఇలానే ఆలోచిస్తుందనుకుంది దక్షిత. నిజానికి తల్లి సూచించిన పరిష్కారం తప్ప వేరే దారి గోచరించడం లేదామెను."ఎందుకయినా మంచిది, మనం ఓ నిర్ణ యానికి వచ్చేముందు పరమేశ్వర్‌గారిని కూడా ఓ మాట అడిగితే బావుంటుందేమో దక్షీ" తల్లి తనే మళ్ళీ ఓ సలహా ఇచ్చింది దక్షితకి.

పరమేశ్వర్‌గారు వారి ఆడిటరు!

"చూడమ్మాయి, నీవు చాలా చిన్నదానివి. పైగా ఏమాత్రం అనుభవంలేనిదానివి. ఒక ఫ్యాక్టరీ ఎంత చిన్నదయినాసరే, దాన్ని లాభసాటిగా నడపాలంటే ఎంతో రిస్కుతో కూడుకున్న వ్యవహారం. నాక్కూడా మీ అమ్మగారి సలహానే సబబు అనిపిస్తోంది. మీ నాన్నగారి ఆకాంక్ష ప్రకారం ఎంబీయే చదివారా. ఆ నాలెడ్జితో కొత్తగా ఏదైనా స్టార్ట్ చేయవచ్చు" అన్నాడు పరమేశ్వర్ విషయమంతా విన్న తరువాత.

మరునాడు బ్యాంకుకు వెళ్దామని తయారవుతుండగా ఫీల్డ్ ఆఫీసరే స్వయంగా వచ్చాడు ఆమెను కలవడానికి వారి ఇంటికి. "ఏదో ఒక నిర్ణయం తీసుకోండి మేడమ్, అకౌంట్ సబ్‌స్టాండర్డ్ అయినందుకు మాకు మా రీజనల్ ఆఫీస్‌నుండి చాలా ప్రెషర్ ఉంది" అన్నాడా ఫీల్డ్ ఆఫీసర్.

తన తల్లీ,ఆడిటరూ ఇచ్చినసలహా గురించి చూచాయగా తెలియజేస్తూ "ఈ టూ, త్రీ డేస్‌లో వచ్చి మీ చీఫ్ మేనేజరుగార్ని కలుస్తానులెండి" అంది.

"నా సలహా కూడా అదే మేడమ్, ఇప్పుడు మీరున్న పరిస్థితుల్లో ఆ ఫ్యాక్టరీ రన్ చేయడం చాలా కష్టం" అన్నాడతను బయలుదేరుతూ.

ఆ మరునాడు ఎందుకో ఫ్యాక్టరీనిఓ మారు చూడాలనిపించి తల్లిని తీసుకొని వెళ్ళింది అక్కడికి.

సగం మంది కార్మికులతో ఫ్యాక్టరీ పనిచేస్తూనే ఉంది.యంత్రాల చప్పుడు విషాద సంగీతంలా ఉంది. ఉద్యోగులు నీరసంగా, నిరుత్సాహంగా కదులుతున్నారు. పెచ్చులూడి బూజుపట్టి,రంగు వెలసిన గోడలు శిథిల దశను సూచిస్తున్నాయి.

గాలిసైతం దిగులుగా వీస్తోంది. మొత్తం మీద ఆ ఫ్యాక్టరీ వాతావరణమంతా నీరసంగా, దీనంగా ఉంది. లోనికి ప్రవేశించిన దక్షితకు అసంకల్పితంగానే భయంకలిగి దేహమంతాకంపించి డీలాపడిపోయింది. మేనేజరుతో సహితంగా కార్మికులంతా ఆ తల్లీకూతుళ్ళ దగ్గరికి పరిగెత్తుకొచ్చారు."అయ్యగారికెలా ఉందమ్మా" ఒకతను అడిగాడు.

"పరవాలేదు కాని పూర్తిగా నయం కావడానికి ఒక సంవత్సరం పైనే పడుతుంది" జవాబిచ్చింది దక్షిత. జీతాలెప్పుడిస్తారని ఎవరైనా అడిగితే తన నిర్ణయం వెల్లడిద్దామని అనుకుందామె.

కాని ఎవరూ ఆ ప్రసక్తి తేవడానికి సాహసించడం లేదు. వారి దీనవదనాలు చెప్పకనే చెబుతున్నాయి జీతాలకై వారెంతగా ఎదురుచూస్తున్నారో.

ఇన్నాళ్ళుగా పనిచేస్తున్నవారికి సూచనగా అయినా తెలియజేయకుండా ఫ్యాక్టరీని మూసివేయడం అమానుషం అనిపించి "ఈ పరిస్థితుల్లో మేం ఫ్యాక్టరీని నడపలేం. గత నెల జీతాలు, ఈ నెల జీతాలుకూడా వారంరోజుల్లో ఇచ్చే ఏర్పాటు చేస్తున్నాం" అంది.

ఒక్క నిమిషం పాటు ఎవరూ మాట్లాడలేదు.

అక్కడ వీస్తున్న గాలి కూడా స్తంభించిపోయినట్లుగా భారంగా మారింది వాతావరణం.



**బోరా ముస్లిమ్‌లు తమ పనితీరుద్వారా వసుధైక కుటుంబ భావన ప్రతిఒక్కరికీ తెలిసేలా చేస్తున్నారు.** -నరేంద్రమోడీ, ప్రధాని

యంత్రాలుకూడా బాధతో ఆగిపోయి భయంకరమైన నిశబ్దం ఆవహించిందక్కడ. ఆ నీరవ నిశబ్దంలోంచి గుండెల్నిపిండేసే ఒక రోదన వినిపించింది. ఆ వెనువెంటనే ఎందరో ఏడుస్తున్నట్లుగా రోదనలు కలగలిసిపోయి భయానక వాతావరణం నెలకొంది. ఊహించని ఆ సంఘటనకి నిశ్చేష్టులైపోయారు ఆ తల్లీకూతుళ్ళు.

ఇంతలో ఒకతను ముందుకొచ్చి "మరీఫ్యాక్టరీ మూసివేస్తే ఇక్కడ పనిచేసే సగంమంది ఆత్మహత్య చేసుకుంటారు తల్లీ" అన్నాడు.

"అవునమ్మా, ఈ ఫ్యాక్టరీ మీదనే ఆధారపడి బతుకుతున్నాం. ఈ వయసులో మాకెవరు ఇంకో ఉద్యోగం ఇస్తారు?" ఏడుస్తూనే అన్నాడు మరో కార్మికుడు. "అవునమ్మా అతడు చెప్పేది నిజం. దీన్ని మూసివేయకండి" చాలామంది కోరస్‌గా అరిచారు, ఆర్తనాదాలు చేశారు.

"ఇంకో మూడు నాలుగు నెలలకు సరిపడినంత ముడిసరుకు ఉంది. మీరు కేవలం ఆర్డర్లు తెచ్చే ప్రయత్నం చేయండి. మేం ఇంకో గంట ఎక్కువసేపు పనిచేస్తాం, మీకు లాభాలు తెచ్చిపెడ్తాం" అన్నాడు మరో నడివయసు కార్మికుడు.

"అవునమ్మా నిజంగానే కష్టపడతాం, ఫ్యాక్టరీ మాత్రం మూసివేయకండి. ఎలాగైనా నడపండి" అందరూ ముక్తకంఠంతో వేడుకున్నారు. ఇంకొందరైతే వారిద్దరి పాదాలను పట్టుకోబోయారు. ఆశ్చర్యచకితులయ్యారు తల్లీకూతుళ్ళు.

"సరేసరే భయపడకండి,మా నిర్ణయాన్ని మేం పునరాలోచించుకుంటాం" అని వారికి సర్దిచెప్పి బయలుదేరారు. ఇద్దరి మనసులూ గందరగోళంగా తయారయ్యాయి. ఇంటికి చేరుకునేదాకా ఎవరూ మాట్లాడలేదు.మధ్యాహ్నభోజనం తర్వాత దక్షితనే ముందుగా ప్రస్తావించింది తల్లితో ఫ్యాక్టరీ గురించి.

"ఫ్యాక్టరీ రన్ చేస్తేనే బావుంటుందేమో అమ్మా, నా మాస్టర్ డిగ్రీ చదువుకు తొందరేంలేదు ఇప్పుడు.



## ఎక్కడున్నా సందడే

సెట్‌లో అడుగుపెట్టినా తనలో ఏ మార్పూ ఉండదంటున్నది అనుపమా పరమేశ్వరన్. ఇది సెట్. ఇది పని అనుకుంటూ కూర్చుంటే నటనలో సహజత్వం లోపిస్తుంది. అదే ప్రతిక్షణాన్నీ ఆస్వాదిస్తుంటే సహజంగా వుంటుందని నేను భావిస్తాను. అందుకే ఇంట్లో వున్నంత ఫ్రీగా సెట్‌లోనూ ఉండాలనుకుంటాను. అస్సలు కామ్‌గా ఉండలేను.

ఎప్పుడూ సందడిచేస్తూనే వుంటాను. ఎప్పుడన్నా మౌనంగా వున్నానంటే ఏమయిందంటూ అంతా నా చుట్టూ చేరిపోతుంటారు" అంటూ గొప్పలు పోయింది అనుపమా పరమేశ్వరన్.

ఇంకో రెండేళ్ళ తరువాతయినా చదవగలను"

"నేనూ నీలాగే ఆలోచిస్తున్నాను దక్షీ. ఫ్యాక్టరీ కార్మికుల పరిస్థితి చూసిన తరువాత వాళ్ళ కుటుంబాలు రోడ్డున పడకుండా ఉండడానికయినా మనం ఫ్యాక్టరీ నడపాలి" దృఢంగా అంది భారతి.

తల్లి కూడా తనలాగే ఆలోచిస్తున్నదని తెలియడంతో దక్షిత మనసు తేలికై ఫ్యాక్టరీని మూసివేయకుండా నడపాలనే నిర్ణయించుకుంది.

ఆ రాత్రి ఓ పెళ్ళివేడుకకి వెళ్ళినప్పుడు అక్కడ పెళ్ళివారు,వచ్చిన అతిథులకు రిటర్న్ గిఫ్ట్‌లని ఇస్తున్న క్యారీబ్యాగులను చూసిన తరువాత ఆమెలో ఒ కొత్త ఆలోచన రూపుదిద్దుకుంది.

"ఆ క్యారీబ్యాగ్‌పై వధూవరుల పేర్లను కూడా ప్రింట్ చేస్తే ఇంకా ఇంప్రెస్సివ్‌గా ఉంటుంది కదా. అందుకు డిజిటల్ ప్రింటింగ్‌లో అనుభవంఉన్న కొద్ది మంది సిబ్బంది, ఒక మెషిన్ కావాలి కాబోలు.

మ్యారేజ్‌డే వేడుకలు, బర్త్‌డే వేడుకలు చాలా ఆర్భాటంగా జరుపుకుంటున్నారీమధ్య.

అందుకు తగ్గట్టుగా కస్టమరైజ్డ్ బ్యాగ్స్ ఫర్ స్పెషల్ ఈవెంట్స్ అనీ పర్సనలైజ్డ్ బ్యాగ్స్‌అనీ రకరకాలుగా తయారు చేయవచ్చు. అందుకు ఫంక్షన్ హాళ్ళవారితో, కన్వెన్షన్ సెంటర్ల వాళ్ళతో, బాంక్వెట్ హాళ్ళ వారితో కాంటాక్టు కుదుర్చుకోవాలి. ఈ ఆలోచనలతో చాలా రోజుల తరువాత హాయిగా నిద్రపోయింది దక్షిత.

మరునాడు తల్లితో కలిసి బ్యాంకుకు వెళ్ళి మేనేజరుతో తండ్రి పరిస్థితీ ఫ్యాక్టరీ పరిస్థితినీ వివరించింది. అలాగే తన భవిష్యత్ ప్రణాళికను కూడా తెలియజేసి బ్యాంకు వారి సహాయసహకారాలు కావాలని కోరింది.

మేనేజరు ఆమె మాటల్లోని దృఢత్వాన్ని, పట్టుదలను గమనించి "నాకు చేతనయినంత సహాయం నేను తప్పక చేస్తానమ్మా, కాని అర్జంటుగా మీ అకౌంటు రెగ్యులర్ కావాలి,పైగా ఎంప్లాయిస్‌కి జీతాలివ్వాలి కాబట్టి మీ దగ్గర ఏమన్నా షేర్ సర్టిఫికెట్లు, మ్యూచువల్ ఫండ్స్, బ్యాంక్ డిపాజిట్లు, బంగారు నగలుంటే తెండి. తొందరగా ఓవర్ డ్రాఫ్ట్ ఇస్తాను. మీకు కొంత టెన్షన్ తగ్గుతుంది"

సంతోషంతో కృతజ్ఞతలు తెలియజేసి బయలుదేరబోతుండగా వారిని కూర్చోమని సైగ చేసి "నాదో సలహా" అన్నాడు మేనేజరు. "చెప్పండి" అంది.

"ఈ ఫ్యాక్టరీని నామినల్‌గా నడిపిస్తూ మీరు యజమానిగా మరో ఫర్మ్ స్టార్ట్ చేయండి. యంగ్ ఉమెన్ ఎంటర్‌ప్రీనర్స్‌కి ప్రభుత్వం ట్యాక్స్ మారటోరియం అంటూ సబ్సిడీ అంటూ చాలా ప్రోత్సాహకాలు ఇస్తోంది. ఆలోచించండి. మా బ్యాంకు కూడా చాలా తొందరగా మీకు లోన్ శాంక్షన్‌చేస్తుంది" అన్నాడు.

నిజంగానే మంచి ఆలోచన. దక్షిత మనసులో వేలాది పూలు వికసించుకున్నంత హాయి కలిగి గుండెలో స్ఫూర్తి కలిగింది. మేనేజరుకు కృతజ్ఞతలు తెలియజేసుకుని తమ ఆడిటరు పరమేశ్వర్‌గారి దగ్గరికి బయలుదేరారు.

ఆయన కూడా మేనేజరు చెప్పిన కొత్త ఆలోచనకు మెచ్చుకుని వీలైనంత తొందరగా ఫర్మ్ రిజిస్ట్రేషన్‌కు, లోన్ ప్రపోజల్‌కి కావాల్సిన పేపర్లు తయారు చేస్తానని హామీ ఇస్తూ "ఈ రెండు మూడు రోజుల్లో కొత్తఫర్మ్ పేరు ఆలోచించుకుని చెప్పమ్మా" అన్నారు.

ముందే ఆలోచించి పెట్టుకున్నట్లుగా దక్షిత వెంటనే అంది 'భారతి ఈస్థటిక్ బ్యాగ్స్' అనే పేరు ఎలా ఉంటుంది అంకుల్" ఆమె స్వరం నిండా ఉరకలెత్తుతున్న ఉత్సాహం! "బ్రహ్మాండంగా ఉందమ్మా, ప్రొసీడ్" అన్నారాయన నవ్వుతూ.

సరిగ్గా ఆరు నెలల తరువాత "భారతి ఈస్థటిక్ బ్యాగ్స్" ఫ్యాక్టరీలో అందమైన క్యారీ బ్యాగులు తయారుకావడం ప్రారంభమయింది.

మార్కెటింగ్‌కై దక్షితకున్న ఇంటర్నెట్ పరిజ్ఞానం చాలా ఉపయోగపడింది. కంపెనీ పేరుకు తగ్గట్టుగానే అందమైన, కళాత్మకమైన బ్యాగులకు బ్రాండ్‌నేమ్‌గా ఒక సంవత్సరకాలంలోనే పేరు గడించి ఊహించిన దానికన్నా ఎక్కువగా ఆర్డర్లురావడం ప్రాంభమైంది.

సంవత్సరం తిరక్కుండానే ఇంకో షిఫ్టు ఎక్కువగా పనిచేయాల్సి రావడంతో కొత్త ఉద్యోగులను నియమించింది. కూతురు దక్షిత గురించి తెలుసుకుంటున్న విద్యాసాగర్ మరో నాలుగు నెలల తరువాత పూర్తిగా కోలుకున్నారు.

కొత్తగా రూపుదిద్దుకున్న ఫ్యాక్టరీకి తండ్రి తొలిసారిగా వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని ఉద్యోగులందరితో ఓ సమావేశం ఏర్పాటుచేసింది దక్షిత. సభాముఖంగా తండ్రికి ఫ్యాక్టరీ అభివృద్ధిలో దూసుకుపోతున్న విషయాన్ని తెలియజేస్తూ" నాన్నగారూ, మన ఉద్యోగుల సహకారం లేనిదే నేనీ అద్భుతాన్ని సాధించగలిగేదాన్ని కాదు.

అందుకు కృతజ్ఞతగా జీతాలు పెంచడమేగాకుండా పిల్లల చదువుకూ, హాస్పిటల్ ఖర్చులకు కూడా బడ్జెట్ కేటాయిస్తున్నాను. వీటన్నింటినీ మించి వచ్చే రెండేళ్ళలో ఈ ఆవరణలోనే అందరికీ ఇండ్లు కట్టించి ఇవ్వాలనుకుంటున్నాను" అంది.

"ఉద్యోగులంతా ఆగకుండా ఆనందంతో చప్పట్లు కొట్టారు. అప్పుడు విద్యాసాగర్ మాట్లాడడం ప్రారంభించి ముగింపుగా ఇలా అన్నాడు..."

".... వ్యాపారం చేయాలనుకోవడం అంటే మనం బతకడానికే కాదు, పదిమందికీ బతుకుదెరువు చూపించడానికనీ,

వ్యాపారాభివృద్ధి అంటే కేవలం యజమాని కోట్లు కోట్లు పోగేసుకోవడానికి కాదు తనకింద పనిచేసేవారు కూడా అభివృద్ధి అయ్యేట్లుగా చూడాలని నాకు అర్థమయ్యేలా చేసింది నా కూతురు దక్షిత"

## కారణాలు కోకొల్లలు

సరైన అవకాశం రావాలే కాని, ఒకే ఒక్క సినిమాతో పూర్తిస్థాయి ప్రతిభను చాటిచెప్పవచ్చునంటున్నది అను ఇమ్మానుయేల్.

శైలజారెడ్డి అల్లుడు'లో అనుగా అహంకారం, పొగరుల్ని మేళవించి పగరుగా, వలపుగా నటించి మన్ననలు అందుకుంటున్నది.

సినిమాలో తాను కలిసి నటించినవారిని ప్రశంసలతో ముంచెత్తేస్తున్నది. అంతేనా, ఇంతకు ముందు తన సినిమాలు కొన్ని పరాజయం పాలయ్యాయని ఫ్రాంక్‌గా చెప్తోంది. "కారణాలు ఏవైనా జయాపజయాలన్నవి మన చేతుల్లో వుండవన్నది నాకు బాగా అర్థం అయింది. నా తప్పులనుంచి నేను చాలా నేర్చుకున్నాను" అంటూ తాజా విజయోత్సాహంలో తలమునకలైపోతున్నది.





కాంగ్రెస్‌పార్టీని నిర్వీర్యం చేయడం బ్రిటీష్‌వారికే సాధ్యం కాలేదు.... ఇక బి.జె.పితో అవుతుందా?

-వీరప్ప మొయిలీ, కాంగ్రెస్ నేత

# సెక్స్ కోరికలు తొంభై వరకు

సమాజంలో చాలా అంశాలు అలా ప్రచారం లోకి వచ్చి స్థిరపడిపోతాయి. అవి ఎందుకు, ఎవరు మొదలుపెట్టి వుంటారో తెలియదు. అందులో నిజం ఎంత వుందో తెలుసుకునే ప్రయత్నం జరగదు. కాని సమాజం మొత్తం అంగీకరిస్తుంది.

అలా స్థిరపడిన అభిప్రాయానికి భిన్నంగా ఎవరైనా వ్యవహరించాలన్నా భయపడేంతగా ఆ విషయం సమాజంలో స్థిరపడింది. ఆ విషయం తప్పని,అందుకు భిన్నంగా ఎవరైనా ప్రవర్తిస్తే సమాజం మొత్తం కలిసి మీదపడి రక్కినంత పనిచేస్తుంది.

అది తలచుకుంటేనే భయంకరమైన అనుభవంగా ఉంటుంది. కాబట్టి చేసేది లేక తలవొగ్గి అలా వుండి పోతారు చాలామంది. బలవంతంగా సమాజంమీద రుద్దబడిన అటువంటినమ్మకాలలో ఒకటి యాభై ఏళ్ళ వయసులో పడుతుండగానే ఆడవారిలో సెక్స్ కోర్కెలు తగ్గిపోతాయి అనేది.

యాభై ఏళ్ళ వయసులో ఆడవారి శరీరంలో మార్పులు వస్తాయి. అది వాస్తవం. అది సహజం.

ఆ మార్పులు ప్రకృతిసహజమైనది. ఆ మార్పు బహిష్టులు ఆగిపోవటం. నెలవారీ బహిష్టులు ఆగిపోవటాన్ని సెక్స్‌కోర్కెలు ఆగిపోవటంగా అర్థంచేసుకోవటం లోనే అసలు చిక్కువచ్చింది.

ఋతుచక్రం అనేది సంతానం పొందటంకోసం ఏర్పడినది. ప్రతినెలా ఒక అండాన్ని విడుదల చేస్తుంది మగువ. ఆ అండం ఫలదీకరణంకోసం ఎదురు చూస్తుంది. ఆ ఎదురుచూపులు మూడు, నాలుగు రోజులు మించివుండదు.

ఆ సమయంలో శుక్రకణం వచ్చి చేరితే ఆ అండం ఫలదీకరణం చెంది పిండంగా ఎదుగుతుంది. ఆమె కాస్తా అమ్మగా మారుతుంది. ఆ ఫలదీకరణం కోసం ఎదురుచూసి, మరుసటి నెలలో మరోసారి చూద్దాం అనుకుంటూ ఆ అండం రాలిపోతుంది.

అదే బహిష్టురూపంలో బయటకు వచ్చేది. కొంత మందిలో ఏదో ఒక కారణంవల్ల అండాల విడుదల సక్రమంగా జరగకపోవచ్చు. అంతమాత్రం చేత వారిలో సెక్స్‌కోర్కెలు కలగకుండా వుండవు. పిల్లలు పుట్టని వారు కూడా హాయిగా లైంగిక ఆనందం, తృప్తిని పొందటం తెలిసిందే. ఇదంతా చెప్పటానికి మూలం బహిష్టులకు, సెక్స్ కోర్కెలకు సంబంధం లేదని తెలుసుకుంటారనే.

## మెనోపాజ్ దశలో

ఒక వయసు తర్వాత స్త్రీ శరీరం సంతానం పొందే శక్తిని కోల్పోతుంది. ఆ దశలో శరీరంలో తిరిగి మార్పులు కనిపిస్తాయి. ఆ దశనే 'మెనోపాజ్' అంటారు. మెనోపాజ్ వయసు సంతాన ప్రక్రియకు 'ఫుల్‌స్టాప్' అని చెప్పేదేకాని ఇక సెక్స్‌కోర్కెలు ఆగిపోతాయి అని చెప్పటం మాత్రం కాదు.

ఈ తేడా తెలియక మెనోపాజ్‌కి రాగానే లైంగిక పరంగా తమ వయసు అయిపోయిందనుకుంటారు ఆడవారు.అది వాస్తవం కాదని వారికి తెలుసు.

అప్పుడప్పుడు వారి శరీరం ఆ వయసులో కూడా సెక్స్‌ని కోరుకుంటుంది. కాని ఆ విషయం బయటకు చెప్పుకోవాలంటే భయం. ఆ వయసులో సెక్స్ కోర్కెలను బలవంతంగా అణుచుకుంటారు చాలామంది. ఇది మన సమాజంలోని సామాజిక, గృహ వాతావరణం బలవంతంగా స్త్రీలమీద నెట్టిన ఆంక్ష తప్పించి, శారీరక సహజ లక్షణం కాదన్నది అనుభవంగల స్త్రీ వైద్య నిపుణులు చెప్పేమాట.

వయసులో వుండగా లైంగికపరంగా చురుకుగా వ్యవహరించటం చాలా సహజం.

ఆ చురుకుదనపు వయసులోనే తల్లి అవుతారు. తల్లి అవగానే పిల్లల ఆలనాపాలనా అనే కొత్త బాధ్యత నెత్తికెత్తుకుంటారు. వరుసగా కాన్పులు వస్తే ఇక తల్లి జీవితం మరింత బిజీ అయిపోతుంది. ఆ సమయంలో గృహిణి బాధ్యత ముందు లైంగిక అవసరాలు అంతగా కనిపించవు.

ఆ బాధ్యతలన్నీ చక్కబెట్టుకుని మరికొంచెం ముందుకు వచ్చేసరికి మరో కొత్త విషయం వెంటాడు తుంది. ఎదిగిన పిల్లల ఎదుట జాగ్రత్తగా వ్యవహరించాలనే విషయం ప్రతిక్షణం గుర్తుకువస్తుంటుంది.

ఇక చిన్న ఇళ్ళల్లో భార్యాభర్తలకు ఏకాంత సమయానికి చోటు వుండదు, సమయమూ ఉండదు.

## ఒక్కొక్కరిది ఒకలాంటి

ఉమ్మడి కుటుంబాలలో అయితే పెద్దవాళ్ళ కళ్ళు వీరినే వెంటాడుతుంటాయి. ఫలితంగా అటూ ఇటూ భయం భయంగా అడుగులువేస్తూ, తమ కోర్కెల గురించి బయటకు ఏమీ చెప్పలేని స్థితి.

అయితే ఆ వయసు ఆడవారందరూ ఒకేలా వుంటారనేందుకు వీలులేదు. యాభైల వయసులో అడుగుపెడుతుండగా ఒక్కొక్కరిది ఒకలాంటి అనుభవం. అయితే గతంలో వున్న సామాజిక, కుటుంబ పరమైన ఇబ్బందులు ఇప్పుడు లేవు. ఉమ్మడి కుటుంబాలు దాదాపుగా అంతరించిపోయాయి.

చిన్న కుటుంబాలు, పరిమిత సంతానం. పిల్లలు చదువుకుని ఇరవైఏళ్ళ వయసులోనే ఇంటికి దూరంగా వెళు

Courtesy : GRIHASHOBA



తున్నారు. ఫలితంగా యాభై ఏళ్ళ వయసులో దంపతులకు ఏకాంతం దొరుకుతోంది. తమ గురించి తాము ఆలోచించుకోగలుగుతున్నారు.

యాభైల వయసులో లైంగికపరంగా అంతా బాగానే వుంటుందని కాదు. ఆ వయసులో వచ్చే ఇబ్బందులు ఆ వయసులోవుంటాయి.

ఆ ఇబ్బందుల గురించి మాట్లాడగలిగిన ధైర్యం కూడా ఆ వయసుకు వచ్చి తీరుతుంది. బహిష్టులు ఆగిపోవటంతో హార్మోన్ల ఉత్పత్తిలో తేడా వస్తుంది. ముఖ్యంగా ఈస్ట్రోజన్ అనే హార్మోన్‌లు తగ్గటంతో యోనిభాగంలో ద్రవాలు ఊరటం తగ్గుతుంది.

యోని ద్వారం ఎండిపోయినట్టుగా వుంటే అంగ ప్రవేశం బాధ కలిగిస్తుంది. ఇది ఒక రకమైన ఇబ్బంది. చాలామంది ఆడవారిలో కనిపిస్తుంది. ఈ బాధను అర్ధంచేసుకునే భాగస్వామి అవసరం.



## మార్పులకనుగుణంగా

ఆ వయసులో భాగస్వామిలో శారీరకంగా, మానసికంగా వచ్చే మార్పులకు అనుగుణంగా స్పందించాల్సిన బాధ్యత మగవారిది. ఆ బాధ్యత మరచిపోయి తన ఆనందం తాను చూసుకునే పద్ధతిలో వ్యవహరిస్తే సంసారజీవితంలో ఇబ్బందులు వస్తాయి.

ఆ బాధ భరించలేక లైంగిక అనుభవాలకు దూరంగా వుంటుంది ఆమె. ఏదోక కారణం చెప్పి తప్పించుకునే యత్నం చేస్తుంది. దానిని పురుషుడు తప్పుగా అర్ధంచేసుకునే ప్రమాదముంది.

దంపతులలో యాభై ఏళ్ళ తర్వాత వచ్చే మరో ఇబ్బంది మగవారివైపునుండి. ఆమెలో కోర్కెలు చెలరేగుతుంటాయి ఆ వయసులోకూడా.

కాని ఆ కోర్కెలకు తగినట్టుగా ఆమెతో వ్యవహరించి, సంతృప్తిపరచలేని పరిస్థితి పురుషుడిది. ఆ వయసులో ఆమెలో కోర్కెలు తగ్గక ఆయనలో అంగస్తంభన సమస్య రావటంతో లైంగిక జీవితంలో అసంతృప్తి మొదలవుతుంది. అంగం స్తంభించినా ఎక్కువసేపు నిలుపలేకపోవటం ఒక సమస్య.

ఎంతో ఆశగా మొదలైన రాత్రి నిరాశతో, అసంతృప్తితో అంతమవటం అనే అనుభవం మొదటికే మోసంవచ్చి మానసిక సమస్యలకు దారితీస్తుంది.

తగిన తృప్తి అందించలేకపోతున్నానన్న ఆత్మన్యూనతాభావం ఆయనలో, తన శారీరపు కోర్కెలు చల్లబరచలేని మగాడు అన్న ఏహ్యాభావం ఆమెలో మొదలైతే జీవితం నరకమవుతుంది.

దాంపత్యజీవితం ప్రారంభంలో కొత్తజంట ఒకరినొకరు తెలుసుకునేందుకు, ఒకరి ఇష్టాలను మరొకరు అర్ధంచేసుకునేందుకు ప్రయత్నిస్తారు.

ఆ యత్నంలో మనసు విప్పి మాట్లాడుకోవటం కీలకం. సరిగ్గా యాభైల వయసులో ఆ దంపతులు మరోసారి ఒకరినొకరు అర్ధంచేసుకోవాలి.

అప్పుడు ఎలా మనసు విప్పి మాట్లాడుకున్నారో తిరిగి మెనూపాజ్ వయసులో అటువంటి సంభాషణే అవసరం. ఇద్దరిలో మిగిలివున్న కోర్కెలు, వాటి స్థాయి, వాటిని తీర్చుకోవటంలో ఒకరికొకరు సహకరించుకోవటం చాలా అవసరం.

ఆ వయసులో మహిళల ఆలోచనలు, కోరికలు, సమస్యలు ఎలావుంటాయనేది అర్ధంచేసుకునేందుకు ఒక సర్వే నిర్వహించారు. అందులో 400 మంది మహిళలు పాల్గొన్నారు. నలభై దాటి, అరవైకి లోపు వయసులో వున్న మహిళలు, అంటే మెనోపాజ్ దశలో వున్నవారు ఆ సర్వేలో పాల్గొన్నారు.

- సెక్సీ చురుకుదనం తగ్గవచ్చు... ఆగిపోదు
- యాభైలలో సమస్యలు అర్ధంచేసుకోవాలి
- తొలినాటివలెనే ఈ వయసులోనూ
- పరిష్కారం వున్న సమస్యలే అవి

అందులో 55 శాతంమంది ఆడవారు తమ శరీరం సెక్స్‌కి సహకరించటంలేదన్నారు. యోనిభాగంలో లోపించిన ద్రవాలు సమస్యగా మారాయి అన్నారు.

మరో 33 శాతంమంది తాము చురుకుగా వున్నా మగవారిలో చురుకుదనం కరువైందన్నారు.

ఇద్దరిలో ఒకే సమయంలో సమస్య వుంటే ఒకరినొకరు అర్ధం చేసుకోవటం అనేది అంత పెద్ద సమస్యగా లేదు. ఒకరిలో చురుకుదనం వుండి, రెండవ వారిలో ఆ కోరిక తగ్గినప్పుడే ఇబ్బందులొస్తున్నాయి అన్నారు. ఐతే ఆ వయసులో సెక్స్ కోర్కెలు లేవుఅని చెప్పినవారు ఐదు శాతం కూడా లేరు.

యాభైలోకి అడుగుపెట్టినా సెక్స్ కోరికలు సక్రమంగానే వుంటున్నాయి. ఆలోచనలు బాగున్నాయి. సెక్సీ అంశాలను ఇతరత్రా చూసేందుకు అవకాశం దొరికింది. సెక్సీ పుస్తకాలు, ఇంటర్నెట్‌లు బాగా ఉపయోగపడుతున్నాయి.

ఇదివరలోలాగా భయపడకుండా వాటిని చూడగలుగుతున్నారు. దీనికనుగుణంగానే మరో సర్వే ఫలితాలు వచ్చాయి. సర్వే ఫలితాల ప్రకారం 50-70 ఏళ్ళవరకు లైంగికంగా చురుకుగా వ్యవహరించేవారు 70 శాతం వరకు వున్నారు.

వీరిలో 40 శాతం మంది కనీసం ఒకసారి సెక్స్‌ను కోరుకుంటున్నారు. 50 శాతంమంది అంతకన్నా ఎక్కువగానే సెక్స్‌ని కోరుకుంటున్నారు.

సెక్స్‌కి వయసు అడ్డంకి కాదని నేటి మగువలు స్పష్టంచేస్తున్నారు. వయసు పెరిగినా సెక్స్‌లో పాల్గొనటం తమకు శారీరకఆరోగ్యాన్ని పెంచుతున్నదని, మానసికంగా ఉత్తేజంగా వుంటున్నామని చెప్పారు.

ఏ కారణం చేతనైనా 50ల వయసులో సెక్స్‌కి దూరమైనవారిలో అనారోగ్యాలు త్వరితగతిన కనిపిస్తున్నాయి. సెక్స్‌కి, వయసుకు సంబంధించి సమాజంలోవున్న చాలా సందేహాలు అర్ధంలేనివి. ఆనందకర సెక్స్ జీవితం ఆరోగ్యానికి అవసరం.

వయసుతో సెక్స్ కోర్కెలు తగ్గవచ్చు కాని అంతరించిపోవని పరిశోధనలు తెలియచెపుతున్నాయి. అందుకే స్త్రీ, పురుషులిరువురూ తమ లైంగిక అభిప్రాయాలను సరిదిద్దుకోవటం అవసరం.

## ఆరోగ్యానికి అవసరం

ప్రతి వయసులో ఏవో ఒక సమస్యలుంటాయి. అందులో లైంగిక సమస్యలు వుండవచ్చు. సమస్యలన్నింటికీ పరిష్కారం వున్నట్లే లైంగిక సమస్యలకు పరిష్కారం వుంటుంది. మెనూపాజ్ వయసులో తలెత్తే లైంగిక సమస్యలను పరిష్కరించగలిగిన నైపుణ్యం నేడు వైద్యశాస్త్రంలో వుంది.

యోని భాగంలో ద్రవాలకోసం ల్యూబ్రికెంట్స్ వున్నాయి. హార్మోన్‌చికిత్సవుంది. కేవలం కావాల్సింది తమ సమస్య ఏమిటో చెప్పుకోవటమే. అర్ధం చేసుకునే భర్త తోడుంటే ఏ వయసులో అయినా లైంగిక ఆనందానికి అంతుండదు.

డి.సుదర్శన్

# పరదేశి ప్రేమకథ

సీరియల్

హైదరాబాద్‌నుంచి వచ్చారు అని విన్నాడు హోమ్‌గార్డ్. హిందీలో మాట్లాడతారు అని ఊహించాడు కాని స్వచ్ఛమైన బెంగాలీలో మాట్లాడేసరికి ఉబ్బితబ్బిబ్బుపడ్డాడు."అది నా డ్యూటీ.కానీ ఆ లారీవాడు పార పాటుగా గుద్దినట్లు అనిపించలేదు నాకు" అన్నాడు హోమ్‌గార్డ్.

ఉలిక్కిపడ్డారు అందరూ. "ఏం ఎందుకని అలా అనిపించింది" అడిగాడు బెనర్జీ."మొదటిసారి పారపాటున గుద్దితే, రోడ్డు పక్కనపడ్డ ప్రఫుల్ పైకి బండి పోనివ్వాలని ఎందుకు చూస్తాడు?" ఎదురు ప్రశ్నించాడు హోమ్‌గార్డ్.

## గొర్లి శ్రీనివాసరావు

"అదేంటి?" ఆశ్చర్యంగా అడిగింది భారతి.

"అవును మేడమ్. మొదట లారీ సైకిల్‌ని గుద్దగానే ప్రఫుల్‌ఎగిరి దూరంగా రోడ్డుపైన పడ్డాడు ఒకపక్కగా. లారీ గనుక తిన్నగా వెళ్తే ఏమీ ప్రాబ్లమ్ ఉండదు. కానీ లారీ ప్రఫుల్ పడిన వైపుకి పోనిచ్చాడు డ్రైవర్, నేను వెంటనే పక్కకులాగి ఉండకపోతే ఆ లారీ అతని పైనుంచి పోయేది" అన్నాడు హోమ్‌గార్డ్.

చెవులు మూసుకుంది భారతి ఆ అమంగళకరమైన మాటలు వినడానికి మనసురాక.

శర్మిష్ఠ కళ్ళు మరింత పెద్దవయ్యాయి.

ఆ యాక్సిడెంట్ చేసిన డ్రైవర్ ఉంటే మహిషాసుర మర్దిని అవతారం ఎత్తి వాడిని అమాంతం సంహరించేంత ఆవేశం ఆమె కళ్ళల్లో ప్రతిఫలించింది.

అతని మాటలు విన్న పెద్దవాళ్ళందరూ ఆలో చనలోపడ్డారు. ఇప్పుడు ప్రఫుల్‌పైన ఎవరో శత్రుత్వం పెట్టుకుని అతనిపైన ఎటెంప్ట్ చేశారనే అనుమానానికి ఆధారం ఉన్నదని తెలిసింది.

ఇలాంటి ప్రయత్నం మళ్ళీ జరుగుతుందా?

శాంతినికేతన్‌లో ప్రఫుల్ ఉండటం అతనికి శ్రేయస్కరం కాదా! అతన్ని హైదరాబాద్‌కి తీసుకెళ్ళిపోవడమే మంచిదా? తన మనసులో చెలరేగిన ఉప్పెనలాంటి ఆందోళనను అణిచిపెట్టుకుని పర్స్‌లోనుంచి డబ్బు పెట్టి ఉన్న ఒక ఎన్వలప్ కవర్ తీసి హోమ్‌గార్డ్ చేతికి ఇచ్చింది భారతి. "తప్పుగా అనుకోవద్దు. కానీ ఒక తల్లిగా నాకు నువ్వు పుత్రభిక్షపెట్టావు.

ఇది ప్రతిఫలంగా అనుకోవద్దు. నా కృతజ్ఞతకు చిన్ని రూపం అంతే" అంది భారతి.

"ఎందుకమ్మా ఇంత డబ్బు" అన్నాడు హోమ్‌గార్డ్ సిగ్గుపడుతూ.

"ప్లీజ్ నిరాకరించవద్దు" అంది భారతి అతని మాటలకు అడ్డువస్తూ. మౌనంగా ముందుకి వంగి ఆమె కాళ్ళకు నమస్కరించి, "వస్తానమ్మా" అని చెప్పి వెళ్ళిపోయాడు హోమ్‌గార్డ్.

"ఈ విషయం ఏమిటో కొద్దిగా కనుక్కోవాలి మీరు" అంది భారతి, బెనర్జీతో.

"తప్పకుండా! నేను కనుక్కుంటాను. దీని వెనుక మనకు తెలియని విషయాలు ఏమి ఉన్నాయో" అన్నాడు బెనర్జీ.

అవినీష్‌కి అంతా అయోమయంగా అనిపించింది. లారీడ్రైవర్‌ని పోలీసులు పట్టుకోగలిగితే విషయం సాల్వ్ అయిపోతుంది అనుకున్నాడు.

మళ్ళీ సాయంత్రంవరకు విజిటింగ్ అవర్స్ ఉండవు. ప్రఫుల్‌కి డైట్ ఇంటిదగ్గరనుంచి తెచ్చి ఇవ్వవచ్చు అని చెప్పారు డ్యూటీ డాక్టర్.

భారతి, ప్రఫుల్‌కి కావలసినవిధంగా ఆహారం తయారుచేస్తానని చెప్పింది.

మదన్ మోహన్, భారతి ఇంటికి వెళ్ళారు.

అవినీష్, బెనర్జీ, శర్మిష్ఠలు కాలేజీకి వెళ్ళారు.

రీతూ, సోహిణీలు క్లాస్ తర్వాత కారిడార్‌లో కాస్త ఏకాంతంగా కూర్చున్నారు. శర్మిష్ఠదగ్గర నందిని,దేబ్‌జానిలతో మాట్లాడుతూ వాళ్ళకి కాస్త దూరంగా కూర్చుని ఉంది.

అందరూ ప్రఫుల్ విషయమే మాట్లాడుకుంటున్నారు. శర్మిష్ఠ తనకు హోమ్‌గార్డ్‌ద్వారా తెలిసిన విషయాన్ని బయటకు చెప్పలేదు.జనం ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలని అనుకుంది.

ఆమె స్నేహితుల వరకు ఆమెకు ప్రఫుల్‌పైన అభిమానం ఉన్న విషయం తెలుసు. అతను ఆమె ఇంట్లోనే పెంట్‌హౌస్ అద్దెకు తీసుకున్న విషయం వాళ్ళకి తెలియదు. ప్రఫుల్ తల్లిదండ్రులు వచ్చారని తెలుసు. అంతకుమించి వివరాలు తెలియవు.

శర్మిష్ఠను ఆమె స్నేహితురాళ్ళు ఓదార్చారు. ప్రఫుల్ పరిస్థితి మెరుగైందని తెలుసుకుని ఆనందించారు. సోహిణి రీతూని తనతో తీసుకువెళ్ళి విడిగా కూర్చోబెట్టుకుని మాట్లాడటం వాళ్ళు గమనించారు

### రమ్య రోల్

సినిమాల్లోనే కాదు వెబ్‌సిరీస్‌లోని అవకాశాలూ తారలకు ఉత్సుకతను పెంచుతున్నాయి.

ఈ మధ్యే విడుదలైన 'లవ్ సోనియా' ఫేమ్ మృణాల్ ఠాకూర్ నెట్‌ఫ్లిక్స్ సిరీస్‌లో ఏకంగా శివగామి పాత్రకు ఎంపికయింది.

'ది రైజ్ ఆఫ్ శివగామి' పుస్తకం ఆధారంగా తీస్తున్న సిరీస్‌కు మృణాల్ బాగా సూటవుతుందనేది చిత్ర నిర్మాతల అభిప్రాయం. ఈ పాత్రకోసం సంప్రదించినప్పుడు తాను ఒకటికి రెండుసార్లు ఆలోచించనే లేదంటున్నది మృణాల్. ఇంతమంచి అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పింది.

గాని పెద్దగా పట్టించుకోలేదు.

"రీతూ నిన్నొక మాట అడుగుతాను, నువ్వు నాకు నిజంచెప్తానని ఒట్టు వేస్తావా?" అడిగింది సోహిణి.

"ఏమడుగుతావు?" అంది రీతూ.

"ముందు నువ్వు నాకు ఒట్టు వేయి" అంది తన కుడి అరచేతిని ఆమె ముందుకి చాపుతూ.

"అలాగే" అంటూ ఆమె చేతిలో చేయి వేసింది. ఆ చేతిని అలాగే పట్టుకుని "ఈ ఒట్టు తప్పకూడదు. ఇది మీ అమ్మపైన ఒట్టు" అంది సోహిణి.

చటుక్కున తన చేయి లాక్కోవడానికి ప్రయత్నించింది రీతూ. వదలలేదు సోహిణి.

"రీతూ నిజం చెప్పడంవల్ల మనం చేసిన పొర పాట్లు ఏమైనా ఉంటే భగవంతుడు క్షమిస్తాడు" అంది గంభీరంగా!

"అడుగు" అంది కాస్త ఇబ్బందిగా ముఖం పెట్టి.

తన మొబైల్ తీసి వాట్సప్‌లో వచ్చిన ఒక మెసేజ్ తీసి రీతూకి చూపించింది సోహిణి. "ఈ పిక్ నువ్వు తీసిందే కదూ?" అని అడిగింది.

కొంచెంసేపు నోరు మెదపలేదు రీతూ. తర్వాత "అవును" అంది మెల్లగా!

"నాకు మొత్తం విషయం చెప్పు. ఏమీ దాచకు. ప్లీజ్" అంది సోహిణి.

ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు నిండాయి. అది చూసి మనసు కరిగిపోయింది రీతూకి. తనకు తెలిసినంత వరకూ మొత్తం చెప్పింది. "బిప్లవ్‌కి శర్మిష్ఠ అంటే చాలా క్రేజ్!" అని ముగించింది.

"అయితే ఇదంతా బిప్లవ్ చేయించాడంటావా?" అడిగింది సోహిణి.

"ఐ డోన్ట్ నో" అంది రీతూ నిజాయితీగా!

"కనుక్కో... ఎందుకంటే ఇలాంటి ప్రయత్నాలు మళ్ళీ జరగకూడదు కదా!" అంది సోహిణి.

"అలాగే, కనుక్కుంటా" అంది రీతూ.

"పద శర్మిష్ఠ దగ్గరకు వెళ్దాం" అంది సోహిణి.

వాళ్ళిద్దరూవెళ్ళి తమ ఫ్రెండ్స్‌తో పాటు కూర్చున్నారు. "ఇక్కడ మేమంతా ఆ పరదేశికి జరిగిన యాక్సిడెంట్ గురించిన విషయాలు మాట్లాడుతూ ఉంటే మీరిద్దరూ ఏంటి రహస్యాలు మాట్లాడుకుంటున్నారు" అంది నందిని.

"అతనికి క్షేమం కలగాలని అమ్మవారి గుడిలో పూజలు చేయించాలనుకుంటున్నాం. అందరం వెళ్దామా?" అడిగింది సోహిణి.

"ఎక్కడికి వెళ్దాం కంకాళీ మాత మందిర్‌కా?" అడిగింది దేబ్‌జాని.

"అవును. రేపు ఉదయాన్నే వెళ్దాం. మీరంతా వస్తారా మరి?" అడిగింది సోహిణి. శర్మిష్ఠ కొద్దిగా తటపటాయించింది. తక్కిన అమ్మాయిలంతా, "మేం వస్తాం"అన్నారు.

తనొక్కతే రాలేను అని చెప్తే బాగుండదు. కానీ ఇంట్లో ఆంటీ వాళ్ళు ఉన్నారు. హాస్పిటల్‌లో ప్రఫుల్ ఉన్నాడు. వీళ్ళను వదిలి తను ఎక్కడికీ వెళ్ళలేదు.

"మీరు వెళ్ళండి.నా తరుపునకూడా అమ్మవారికి దణ్ణం పెట్టుకోండి. ఒక మాల కొని అమ్మవారికి వెయ్యండి" అంటూ డబ్బులు తీసిఇచ్చింది శర్మిష్ఠ.

"అదేంటి, నువ్వు అందరికంటే ముందు బయల్దేరతావు అనుకున్నానే" అంది నందిని.

"లేదు. శర్మిష్ఠను ఇబ్బందిపెట్టకండి.

## జరిగిన కథ 12

ప్రఫుల్‌కి యాక్సిడెంట్ చేయించిన అలోక్ మరికొంత డబ్బు కావాలని దత్తు దగ్గర పేచీ పడతాడు. మదన్‌మోహన్, భారతి కొడుకును చూసేందుకు శాంతినికేతన్‌కి చేరుకుంటారు. అలోక్ పేచీపెట్టడంతో మరికొంత సొమ్మును ముట్టచెబుతాడు బిప్లవ్.

ఐసియులో వున్న ప్రఫుల్,తల్లిదండ్రులను గుర్తుపడతాడు. అతని తలకు చేసిన సర్జరీ సక్సెస్ అవుతుంది. యూనివర్సిటీ చీఫ్ లైబ్రేరియన్ అవనీష్ చటోపాధ్యాయ, శర్మిష్ఠ తండ్రి. వాళ్ళింట్లోనే ప్రస్తుతం ప్రఫుల్ వుండేది.

వాళ్ళ కోరికపై ప్రఫుల్ తల్లి తండ్రి మదన్ మోహన్, భారతి వాళ్ళింటికి వెళ్తారు. భార్య ప్రమద్వరని పరిచయం చేస్తాడు అవనీష్

ప్రఫుల్‌ని రక్షించిన హోమ్‌గార్డ్ వచ్చి మదన్ మోహన్, భారతిలను కలుస్తాడు. తర్వాత జరిగింది చదవండి.





## నిద్రపట్టలేదు

ఇంతకుముందు 'అదుగో' అన్న నభా నటాశ్ ఇప్పుడు 'నన్ను దోచుకుందువటే' అంటున్నది. నిజానికి ఇంకా 'అదుగో' విడుదల కాకపోవడంతో ఇదే తన తొలి సినిమా అవుతుంది.

"కన్నడలో తొలి సినిమా చేశా. అప్పుడు పరిచయం అయినప్పుడు చాలా భయపడ్డాను. ఇప్పుడంత భయం లేదు కాని, ప్రేక్షకులు ఎలా రిసీవ్ చేసుకుంటారోనని ఆందోళనచెందాను. వారంరోజులపాటు నిద్రపట్టలేదు. సుధీర్‌బాబు ఓ నిర్మాతగా ఫీలవకుండా ఓ నటుడిగా నన్ను బాగా గైడ్ చేశారు" అని చెప్పింది.

ఆమెకు కుదరడంలేదు. కుదిరితే మనం అనుకున్నట్లు ఆమె అందరికంటే ముందుగా బయల్దేరేది" అంది సోహిణి.

మరుసటిరోజు కంకాళీమాత గుడికి వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు ఆడపిల్లలంతా.

తర్వాత క్లాసు బంక్‌చేసి ఇంటికి వెళ్ళిపోయింది శర్మిష్ఠ. ఇంటికి వెళ్ళి భారతి ఆంటీకి వంట చేయడంలో హెల్ప్ చేయాలి అనుకుంటూ.

ప్రఫుల్‌కి శత్రువులు ఎవరు అన్నది స్టూడెంట్స్‌లో ఎవరైనా ఊహాగానాలు చేస్తుంటే అవి తనకు తెలియాలనే ఉద్దేశ్యంతో ఆమె క్లాసుకి వెళ్ళితనకు తెలిసినవాళ్ళని కలిసి వాళ్ళ మాటలన్నీ వింది. తనంతట తానుగా ఎవరికీ పోలీసులకు అనుమానాలు ఉన్నాయని చెప్పలేదు.

సైలెంట్‌గాఅబ్జర్వ్ చేస్తే తనకు ఏమైనా సమాచారం తెలియవచ్చు అనుకుంది. సోహిణికి చాలా భయం వేసింది. ఆమెకు కలిగిన అనుమానం నిజం అవడంతో ఆమె భయం హెచ్చింది.

ఒక అమ్మాయి ప్రేమకోసం ఇద్దరు అబ్బాయిలు కొట్టుకోవడం ఆ క్యాంపస్‌లో కొత్త విషయం కాదు. కానీ ప్రేమలో తనకు పోటీ అవుతాడేమో అన్న ఒకే కారణంతో లారీ పెట్టి మనిషిని గుద్దించేటంత మూర్ఖత్వం, దుర్మార్గం కూడా ఉంటాయి అనే చేదు నిజం ఆమెకు షాక్ ఇచ్చింది.

ప్రఫుల్ ఎవరిని ప్రేమిస్తాడో అతని ఇష్టం. శర్మిష్ఠకు అతనికి కొంతవరకు కలిసిందని తనకు తెలుసు. కాని అతనంటే అభిమానం ఆపుకోలేకపోతోంది. అతను తనను ఇష్టపడ్డా, పడకపోయినా కూడా అతనంటే తనకు ప్రేమ ఉంటుందని ఆమె మనసు గట్టిగా చెప్తోంది.

అతనికి ప్రమాదం జరుగుతుందంటే తను చూస్తూ ఊరుకోలేదు.

ఎంత రిస్క్ అయినా అతన్ని కాపాడుకోవడానికి ప్రయత్నించాలి అనుకుంది సోహిణి.

అప్పుడు తమ బంధువులలో వీర్ భూమ్‌లో ఉన్న ఒకరు గుర్తుకువచ్చారు ఆమెకి.

శర్మిష్ఠ ఇంటికి వెళ్ళేసరికి భారతి వంట పూర్తయింది. ప్రమద్వరతో మాట్లాడుతూ ఆమె సాయం తీసుకుని అన్నం, పప్పు, నెయ్యి బాగా ఉడికించిన కాయగూరలు రెడీ చేసింది భారతి.

శర్మిష్ఠ వంటింట్లోకి వస్తుంటే, "అప్పుడే క్లాసెస్ అయిపోయాయా" అంది భారతి ఆశ్చర్యంగా.

"లేదు ఆంటీ ఈరోజు క్లాసులు లేవు నాకు. మీకు వంటలో సాయం చేస్తాను" అంది శర్మిష్ఠ.

ప్రమద్వర నవ్వింది. "నాకెప్పుడన్నా కొంచెం సాయం చెయ్యమన్నా ఏదో చదువుకోవాలి, ఎగ్జామ్స్ ఉన్నాయి అంటావు. ఏమైనా బలవంతపెడితే మీ నాన్నకు నాపైన ఫిర్యాదులు కూడా చేస్తావు. ఇదేంటి



**మంచివారు రాజకీయాలపట్ల నిరాసక్తత కనబరిస్తే దుర్మార్గులు అధికారంలోకి వస్తారు.**

*-సంబిత్ పాత్ర, బి.జె.పి. అధికార ప్రతినిధి*

నీ అంతట నువ్వే ఆంటీకి సాయం చేస్తానంటున్నావు" అంటూ ఆరా తీసింది.

"పో అమ్మా. గెస్టులతో పనిచేయిస్తారా ఎవరైనా?" అంది మాట మారుస్తూ.

"ఓ అలాగా. నేను సాయం చేద్దామన్నా ఆంటీ ఒప్పుకోలేదు. ప్రఫుల్‌బాబుకి ఎలా ఉంటే ఇష్టమో ఆమెకు తెలుస్తుంది కదా అని నేనుకూడా మరీ బలవంతపెట్టలేదు" అంది.

"కాస్త టేస్ట్ చూస్తావా" అడిగింది భారతి.

"ఊ ఊ" అంటూ చెయ్యి చాపింది శర్మిష్ఠ.

ఒక చిన్నగిన్నెలో తను వండిన పదార్థాలు వేసి శర్మిష్ఠకి ఇచ్చింది భారతి.

అవి తిని, "అమ్మా చాలా బాగుంది, నువ్వు కూడా టేస్ట్ చూడు" అంటూ ఇచ్చింది శర్మిష్ఠ.

"నేను టేస్ట్ చేశాను. చూడు అన్నం, పప్పులోనే ఎంత టేస్ట్ ఉందో. అమ్మ ప్రేమ అంటే టేస్ట్ అదే నచ్చేస్తుంది. అందుకే ప్రఫుల్‌బాబుకి అమ్మ చేతి వంట, ఈ పూట. సాయంత్రం వంట నువ్వు చేద్దువుగానిలే" అంది ప్రమద్వర.

గిన్నె ఖాళీచేసి పక్కన పెట్టింది శర్మిష్ఠ. ఆమె ఆ రోజు బ్రేక్‌ఫాస్ట్ చేయలేదని భారతికి, ప్రమద్వరకి తెలుసు.ఆ ఇద్దరి తల్లులకు శర్మిష్ఠ మనసులో ప్రఫుల్ ఉన్నాడన్న విషయం చూచాయగా అర్థంఅయింది.

అది పరిస్థితులవల్ల ఏర్పడ్డ ఇష్టమా లేక మరొకటా అనేది వాళ్ళకు తెలియదు, వాళ్ళు కూడా పెద్దగా పట్టించుకోలేదు.

వాళ్ళిద్దరి వయసుకి జరిగేది జరగకమానదు.జరగనిది జరగనే జరగదు అనే మెచ్యూరిటీ వచ్చేసింది. ప్రఫుల్ కోసం తయారుచేసిన లంచ్ బ్యాగ్‌లో పెట్టుకుని కార్‌లో హాస్పిటల్‌కి బయల్దేరారు అందరూ.

ప్రఫుల్‌ని చూడడానికి ముగ్గురూ లోపలికివెళ్ళారు. అతన్ని ఆ రోజు సాయంత్రానికి స్పెషల్ రూమ్‌కి షిఫ్ట్ చేస్తామని చెప్పారు డాక్టర్లు. ఐసియులో ఉండవలసిన అవసరంలేదని, అతని కండిషన్ స్టేబుల్‌గా ఉందని, చాలా చక్కగా కోలుకుంటున్నాడని చెప్పారు.



ఆటగాళ్ళకు ఆటగాళ్ళే ప్రేరణ, విమర్శలకు అతీతంగా ఆటమీద దృష్టిపెట్టి సొంత ఆటను విశ్లేషించుకోవాలి.
-సచిన్ టెండూల్కర్, క్రికెటర్

ప్రఫుల్ తల్లిదండ్రులను, శర్మిష్ఠను చూసి నవ్వాడు. వాళ్ళతో మాట్లాడాడు. అతని వాయిస్ నీరసంగా ఉన్నా, అతని అలర్ట్‌నెస్ బాగానే ఉంది. శర్మిష్ఠతో కనులతోనే పలకరింపులు అయ్యాయి.

భారతి స్పూన్‌తో అతనికి అన్నం తినిపించింది. పక్కనే ఉన్న శర్మిష్ఠ ఆమెకు గిన్నె పట్టుకోవడానికి కూరలు వడ్డించడానికి సాయం చేసింది. ప్రఫుల్ యాక్టివ్‌గా ఉండడం చూసి ఆమె మనసంతా సంతోషంతో నిండిపోయింది.

"ఆంటీ నీకోసం చాలా చక్కగా వండారు కదా. నేను టేస్ట్ చేశాను. నాకు చాలా నచ్చింది" అంది ప్రఫుల్‌తో బెంగాలీలో.

"అమ్మా, నువ్వు వీళ్ళతో బెంగాలీలో మాట్లాడుతున్నావా. చూడు ఈ అమ్మాయి ఇప్పుడు నాతో బెంగాలీలో మాట్లాడుతోంది" అన్నాడు ప్రఫుల్ నవ్వుతూ.

అప్పుడు తన పొరపాటు గ్రహించింది శర్మిష్ఠ. చిన్నగా నవ్వుతూ, "అయినా నువ్వు ఎందుకు బెంగాలీ నేర్చుకోకూడదూ. తేలికగానే వస్తుంది. నాలుగురోజులు మాట్లాడి చూడు" అంది బెంగాలీలో.

"ఇక నా పని అయిపోయింది. అమ్మా నువ్వు నాకు బెంగాలీ నేర్పించకపోతే నాకు చాలా కష్టం" అన్నాడు ప్రఫుల్.

భారతి కూడా నవ్వేసింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి."ఏమైందమ్మా. ఎందుకు ఆ కన్నీళ్ళు?" అడిగాడు ప్రఫుల్ ఆందోళనగా!

"ఏమీలేదురా కన్నా! మీ ఇద్దరూ ఇలా సరదాగా మాట్లాడుతూ ఉంటే ఎంత పెద్దప్రమాదం నుంచి నువ్వు బయటపడ్డావో గుర్తొచ్చి ఒకేసారి భయం, ఆనందం కలగలిపి వచ్చాయి.

అవి ఆనందబాష్పాలే. ఆ దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నా"అంది భారతి.

"ఆంటీ ఇక్కడ కంకాళీమాత ఆలయం మీకు తెలుసా. అది శక్తిపీఠం" అంది శర్మిష్ఠ. "విన్నాను,కానీ చూడలేదు" అంది భారతి.

"ప్రఫుల్‌కి నయమైంది కదా! మనం వెళ్ళి పూజ చేయిద్దామా" అడిగింది శర్మిష్ఠ.

"ఓ అలాగే!" అంది భారతి.

"అయితే రేపు వెళ్దాం. మా ఫ్రెండ్స్ అంతా ప్లాన్ చేశారు. వెళ్ళి అందరూ పూజచేయాలి అని" అంది.

"వాళ్ళందరూనా?" అడిగింది భారతి. ప్రఫుల్‌కి ఆడపిల్లల్లో అంత ఫాలోయింగ్ ఎలా వచ్చింది. అసలు అమ్మాయిలతోనే మాట్లాడడు కదా అని ఆశ్చర్యపోయింది భారతి.

"పరదేశీ న్యూ అడ్మిషన్‌కి ఇలా జరిగిందని మా ఫ్రెండ్స్ అంతా బాగా ఏడ్చారు. ఇప్పుడు ప్రఫుల్ ఆరోగ్యంకోసం అమ్మకు పూజలు చేయించాలి అనుకుంటున్నారు" అంది.

"సో స్వీట్. మీ మనసులు రసగుల్లాల కంటే మధురం" అంది భారతి మనస్ఫూర్తిగా!

మేరీ, ఆమె స్నేహితులు క్యాంపస్‌లో ఎక్కడ తిరిగినా వాళ్ళ వెనక వెనకే తిరుగుతున్నారు అలోక్ గ్యాంగ్. ఇదివరకు బాగా దూరం నుంచి వాళ్ళను గమనిస్తూ, కామెంట్ చేయడం, గట్టిగా నవ్వడం చేసేవాళ్ళు.

ఇప్పుడు చెత్తకామెంట్లు వినబడేలాగా చేస్తున్నారు. మేరీ స్నేహితురాళ్ళకు భయం మరింత ఎక్కువయింది. వాళ్ళను చూస్తూనే వణికిపోతున్నారు. మేరీ పైన ప్రెజర్ ఎక్కువయింది.

అలోక్‌కి అపాలజీ చెప్పి సంధి చేసుకోమని ఆమె స్నేహితురాళ్ళు మరీమరీ చెప్పసాగారు.

దానితో మేరీవాళ్ళు క్యాంపస్ బయటకు వెళ్ళడం మానుకున్నారు. ఏమైనా కావాలంటే వేరే ఫ్రెండ్స్ ద్వారా తెప్పించుకుంటున్నారు. తమకు తాము ఒక బందిఖానాలో ఉన్న ఫీలింగ్ కలగసాగింది వాళ్ళకి.

అలోక్ ఉదయాన్నే తన ఫ్రెండ్స్‌కి డిక్లేర్ చేశాడు. "ఈరోజు మీకు సూపర్ సీన్ చూపిస్తాను, రెడీగా

ఉండండి'' అంటూ.

"ఏంటి అలోక్‌దా, ఏం సీన్ చూపిస్తావు. సెన్సార్ కటింగ్స్ ఉంటాయా?'' అడిగారు మిత్రులు.

"నో కటింగ్స్. సెన్సార్ కాకుండానే చూద్దురుగాని. హాట్‌హాట్ సీన్. తొందరగా తయారవండి'' అన్నాడు అలోక్. తన గ్యాంగ్‌ని వెంటబెట్టుకుని, అమ్మాయిల హాస్టల్ ముందు కాపు కాశాడు.

అమ్మాయిలు బ్రేక్ ఫాస్ట్‌ముగించుకుని క్లాసులకు గుంపులు గుంపులుగా వెళ్తున్నారు.

తమకు కావలసినవాళ్ళకోసం ఎదురుచూస్తూ అలోక్ గ్యాంగ్ ఒక చెట్టుకింద బైఠాయించారు.

"అలోక్‌దా, అంతా ఓపెన్‌గానే ఉంటుందా'' అడిగాడు మరాండీ.

"నీకు ఓపెన్‌గా ఉంటేనే ఇష్టం కదా!'' అన్నాడు ప్రసేన్ జిత్.

"అరే అమదర్ శాంతినికేతన్. ఇక్కడ అంతా ఓపెన్ సిస్టం. మనకు అందుకే ఓపెన్ ఇష్టం'' అన్నాడు సమర్‌జిత్.

అందరూ గొల్లున నవ్వారు. కొందరు అమ్మాయిలు వాళ్ళని పట్టించుకోకుండా వెళ్ళారు. మరికొందరు వాళ్ళను పురుగులను చూసినట్లు జుగుప్సాకరంగా చూసి వెళ్ళారు. కానీ అలోక్ గ్యాంగ్‌కి మాత్రం వాళ్ళ అటెన్షన్ ఏదో విధంగా తమ మీదకు వచ్చింది అంతే చాలు అనుకున్నట్లున్నారు, పొంగిపోయారు!

మేరీ తన స్నేహితురాళ్ళతో హాస్టల్ నుంచి బయల్దేరింది. కానీ ఆమె స్నేహితురాళ్ళు ఆమెను ఆపారు. "చూడు మేరీ, అలోక్ గ్యాంగ్ మనకోసమే అక్కడ తిష్టవేసినట్లున్నారు'' అంది ఈశా.

"ఇదే నీకు మంచి ఛాన్స్. వెళ్ళి అతనికి అపాలజీస్ చెప్పెయ్. ఇక్కడితో ఈ గొడవ సమసిపోతుంది. మా మాట విను. నీకు భయంలేదు అన్నది మేమందరం ఒప్పుకుంటాం. కానీ మాకు భయం ఉంది.

మా కోసం నువ్వు ఈరోజు అతనికి అపాలజీస్ చెప్పాల్సిందే. లేదంటే మేము నీతో కలిసి నడవం. మేమంతా వెళ్ళి నీకూ, మాకూ ఏ సంబంధం లేదని జరిగినదానికి మేమంతా బాధపడుతున్నామని చెప్పేస్తాం'' అంది కాయ్‌లా.

అలా వాళ్ళు చర్చించుకుంటూ ఉంటే సావిత్రి వచ్చింది. "ఏంటి ఏదో సీరియస్ డిస్కషన్‌లా ఉందే'' అంది ఆసక్తిగా.

"ఏముంది, మామూలే. కాకపోతే నన్ను ఒంటరిగా వదిలేస్తామంటున్నారు వాళ్ళ మాట వినకపోతే'' అంది మేరీ.

అందరి ముఖాల్లోకి పరిశీలనగా చూసింది సావిత్రి. అందరూ కృతనిశ్చయంతో ఉన్నట్లు కనిపించారు. ఆమె తమ మాట వినకపోతే ఆమెను ఒంటరిగా వదిలేయడానికే సిద్ధం అన్నట్లు కనిపించారు.

"మరి నువ్వేమి నిర్ణయించుకున్నావు'' అంది సావిత్రి. "తప్పు చేసినవాడిని క్షమించమనే ప్రసక్తి లేదు. నా ప్రాణం పోయినా'' అంది మేరీ.

"వీళ్ళు ప్రాణాలు తీయరు. అవమానిస్తారు. మన మానం మర్యాద మంట కలిసినతర్వాత మనంతట మనమే చచ్చిపోతే బాగుండు అనే పరిస్థితి కల్పిస్తారు. ఇలా ఇదివరకు జరగలేదు అనుకున్నావా?'' గట్టిగా అడిగింది వీణా.

ఆమెవైపు చురుకుగా చూసి "మానం, అవమానం అనేవి మనకు మనం వేసుకునే శిక్షలు.

మన మైండ్ సెట్ మారాలి. శరీరానికి గాయం చేయగలరేమోగానీ నా మనసుని ఎవరూ తాకనైనా తాకలేరు'' అంది మేరీ స్థిరంగా.

గట్టిగా చప్పట్లు చరిచి అభినందించింది సావిత్రి.



నేను వయసులో పెద్దవాడిని అయ్యాను అంటున్నారు... కాని కొత్త విషయాలు నేర్చుకునేందుకు వయసు అడ్డంకి కాదు.

-యువరాజ్‌సింగ్, క్రికెటర్

"ఎంత చక్కగా చెప్పావు. నీకింత మెచ్యూరిటీ ఎలా వచ్చిందో. నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది నిన్ను చూస్తుంటే. నువ్వెక్కడ నేర్చుకున్నావు ఇదంతా'' అడిగింది సావిత్రి.

"మేము బుద్ధిస్టులం. బుద్ధభగవానుడి బోధలే నన్ను ప్రభావితంచేశాయి'' అంది మేరీ.

"అదంతా ఆపు. మేము చెప్పినట్లు చేస్తావా లేదా?'' అడిగారు ఆమె మిత్రులంతా ఒక్కసారే.

"సారీ. నేను అలా చెయ్యలేను'' అంది మేరీ.

"అయితే ఈరోజు నుండి మేము నీతో కలిసి తిరగం. గుడ్ బై'' అంటూ విసవిసా నడిచి వెళ్ళిపోయారు ఆమె మిత్రులు.

తనను వదిలి అలా వెళ్ళిపోతున్న స్నేహితురాళ్ళను అలాగే చాలాసేపు చూసింది. ఆమె కళ్ళల్లో సన్నటి నీటిపొర ఏర్పడింది. వెళ్తున్న అమ్మాయిలు మసక మసకగా కనిపించారు. తల విదిలించి ఆ కన్నీళ్ళను కళ్ళల్లోనే అదిమిపట్టింది.

"ఓకే, నేను ఒంటరిగా ఉండడానికి అలవాటు ఉన్నదాన్నే. బై'' అంటూ బయల్దేరింది మేరీ.

"ఓ ఓ, అంత తొందరేంటి. నేను కూడా చాలా వరకు ఒంటరిగానే ఉంటా. నేను నీతో కలిసి నడిస్తే నా ఒంటరితనం ఏమీ చెడదని నా నమ్మకం. మరి నీకేమైనా అభ్యంతరమా?'' అడిగింది సావిత్రి.

చిన్నగా నవ్వింది మేరీ. "థ్యాంక్స్'' అంది. ఇద్దరూ కలిసి నడవడం మొదలుపెట్టారు. శాంతినికేతన్‌లో టాగోర్ కోరిన స్వేచ్ఛావాతావరణం ఎప్పుడూ ఉండాలని నా ఆకాంక్ష. ఈ యూనివర్సిటీ మన దేశానికి గర్వకారణంగా ఉండాలని టాగోర్ ఆశించారు.

ఆయన జీవితకాలంలో అలాగే ఉంది. తర్వాత కొద్దికొద్దిగా ఆ స్ఫూర్తి కొరవడి స్వార్థపరులు స్వలాభాపేక్షులు ఎక్కువయ్యారు. దీన్ని 'విశ్వభారతి' అని ఎందుకంటారో తెలుసా?'' అడిగింది సావిత్రి.

"ఎందుకు?'' అంది మేరీ. **ఇంకా ఉంది**

## షూటింగ్ స్ట్రగుల్

అతి తక్కువ కాలంలో టాలీవుడ్‌లో బిజీ అయిపోయిన పూజాహెగ్డే ఇటు తెలుగులో, అటు హిందీలో సినిమాలకోసం షటిల్ కొడుతూ అష్టకష్టాలు పడుతున్నది. ఓ వైపు హైదరాబాద్‌లో జూనియర్ ఎన్టీఆర్, ప్రభాస్‌ల చిత్రాలు, ఇంకో పక్క హిందీలో అక్షయ్‌కుమార్‌తో సినిమా కోసం జైసల్మేర్‌లో షూటింగ్.

దీంతో హైదరాబాద్-జైసల్మేర్‌ల నడుమ షటిల్ కొట్టడం పూజాహెగ్డేకు కష్టమైపోతోంది. ఈ రెండు ప్రదేశాల నడుమ ఉన్నది ఒకే ఫ్లైట్ కావడంతో ఎక్కువ సమయం పడుతున్నదని, ప్రైవేట్ జెట్ ఏర్పాటుచేసుకున్నది.

అయితే, అది మిలటరీ ప్రదేశం కావడంతో ఉదయం 11 గంటల నుండి సాయంత్రం ఆరింటి దాకా అనుమతించరు. ఆమె మేనేజర్ అష్టకష్టాలు పడుతూ ఏర్పాట్లుచేస్తున్నాడట. ప్రైవేట్ జెట్‌కు లక్షలాది రూపాయలు చెల్లిస్తున్నారు!!



# పైకప్పు

సింహప్రసాద్
సెల్ : 98490 61668



"హాంసినీ, త్వరగా రెడీ అవ్వు పార్టీకు వెళ్దాం"

"బర్త్ డే పార్టీకా!" గబుక్కున అంది మెరుస్తోన్న కళ్ళతో. ఏడేళ్ళ హంసినికి పుట్టినరోజు వేడుకలంటే ఎంతో ఇష్టం. ఎందరో పిల్లల్తో కలిసి ఆడిపాడవచ్చని ఆశపడుతూంటుంది.

"కాదు గృహప్రవేశానికి" నెక్ టై కట్టుకుంటూ వచ్చి అన్నాడామె తండ్రి మనోజ్ కుమార్.

"అది మామూలు గృహం కాదు, రాజభవనం. ఆ మాటకొస్తే దేవేంద్రభవనం.

మీ నాన్నే డిజైన్ చేశారు. ఆయన గొప్ప చూపించు కోవడానికి మనల్ని తీసుకెళ్తున్నారు" భర్త కంట ఓరగా చూస్తూ ఓరకంట నవ్వుతూ అంది సునంద.

"ఎన్నో గొప్పగొప్పభవనాలు డిజైన్ చేసిన ఆర్కిటెక్ట్‌ని. ఎన్నో అవార్డులూ, సన్మానాలూ అందుకున్న వాడ్ని. నేనేంటో డబ్బా కొట్టుకోవాల్సిన పనిలేదు" ఉక్రోషపడ్డాడు మనోజ్‌కుమార్.

"ఊరికే మిమ్మల్ని ఉడికించడానికన్నాను. నిజం గానే ఉడికిపోతున్నారు" నొచ్చుకుంది.

"భవనరూపశిల్పిగా నా స్థాయి సమున్నతమైంది. అమరావతిలో కొన్నిరకాల భవనాలకి నేను ఆకృతు లిచ్చిన సంగతి నీకూ తెలుసుగా. అఫ్‌కోర్స్ ఆ ఘన తంతా కన్సల్టెంట్ ఖాతాలోకి వెళ్ళిందనుకో"

"ఓకే. మీరు గ్రేట్ ఆర్కిటెక్ట్. ఒప్పుకుంటున్నాను. డాడీకి జేజేలు చెబుదామా హంసినీ"

"నేను చూడలేదుగా" బుంగమూతిపెట్టి అంది.

"చూడక్కర్లేదు. ఆ హంసభవన్ చాలా గొప్పగా ఉంటుంది. అందులో అడుగుపెట్టిన ప్రతీవాడూ మహారాజు లేక మహారాణిలా ఊహించుకుని తీర తారు. తాజ్‌మహల్ వంక ఎంత అద్భుతానందంతో చూస్తారో అచ్చం అలాగే చూస్తారు" కించిత్తు గర్వంగా అన్నాడు తలెగరేసి మరీ.

"తాజ్‌మహల్ సమాధి మీద కట్టారు కదా డాడీ. ఇందులోనూ సమాధులుంటాయా?"

"ఛాఛా... కోట్లకు పడగెత్తిన కుబేరులుంటారు. వారి బాత్‌రూమ్ మన ఇల్లు అంత ఉంటుంది తెలుసా?" అన్నాడు మనోజ్‌కుమార్.

"బాపురే!" అరచేతుల్తో బుగ్గలు నొక్కుకుంటూ అంది హంసిని.

"ఆ చిత్ర విచిత్రాలన్నీ చూసి డాడీని అపర'మయుడు' అని పొగిడేద్దాం. త్వరగా తెములు మరి" అంది సునంద.

మనోజ్, సునంద కారు ముందు సీట్లో కూర్చోగా హంసిని ఒక్కతే వెనుకకూర్చుంది. డోర్ గ్లాస్ కిందికి దించి బయటికి ఆస క్తిగా చూడసాగింది హంసిని.

రోడ్డుకిరుపక్కలా డేరాల్లాంటి ఇళ్ళు ఉన్నాయి. వాటి ముందు ఎన్నోరకాల మట్టి బొమ్మలు, ప్లాస్టిక్ పూల కుండీలు, ప్లాస్టరాఫ్ పారిస్‌తో చేసిన రకరకాల డెకరేటివ్ పీస్‌లు, దేవుళ్ళు మరియు జంతువుల రకరకాల బొమ్మలున్నాయి. అవి తయారుచేసిన కళా కారుల నివాసం ఆ డేరా ఇళ్ళల్లోనే.

## ₹ 9,999 బహుమతి కథ

కొన్నింటిలో ఫినిషింగ్ చెయ్యని వినాయ కుడి విగ్రహాలున్నాయి. వినాయకచవితికి ఎన్నోరకాల ఎన్నోసైజుల విగ్రహాలుతయారు చేస్తారు. ఆ సీజన్లోవచ్చే ఆదాయమేవారికి ముఖ్య జీవనాధారం. ఏడాదిలో ఆర్నెల్లు వాటి పనిమీదే ఉంటారు.

మిగతాప్పుడు చిన్నచిన్న బొమ్మలు తయారుచేస్తారు. వేరేవి కొని తెచ్చి అమ్ముతుంటారు. వారిలో ఎక్కువ మంది బెంగాల్, బీహార్ రాష్ట్రాల నుంచి వలస వచ్చినవారే ఉన్నారు.

"ఏసీ చల్లదనం పోతోంది, డోర్ వేసెయ్ హంసినీ" సునంద చిరుకోపంగా అంది.

"నా ఫ్రెండ్ కనిపిస్తుందేమోనని చూస్తున్నా మమ్మీ..." అంది హంసిని.

"ఈ అలగాజనంలో నీ ఫ్రెండ్ ఉందా?" ఆశ్చర్య పోయాడు మనోజ్‌కుమార్.

"మల్లిక చాలా మంచిది డాడీ. వినాయకచవితికి నాకు బుజ్జి మట్టి వినాయకుడ్ని ఇచ్చింది. గుర్తులేదా డాడీ? ఎంతో బావుందని మెచ్చుకున్నావు కదా? వాళ్ళు అదిగో అక్కడే ఉంటారు..." అంటూ ఒక డేరా ఇంటి వైపు చూపించింది.

"వాళ్ళ స్థాయి ఏంటి మన స్థాయి ఏంటి. వాళ్ళతో స్నేహం ఏంటి" విసుక్కున్నాడు.

"వాళ్ళు చాలా మంచోళ్ళు. వాళ్ళింట్లోకి తీసు కెళ్ళింది మల్లిక. వాళ్ళకి మనలా గదులూ కిచెనూ బాత్‌రూములూ లేవు డాడీ.

పాపం అక్కడే వండుకుంటారు.అక్కడే పడు కుంటారు. ఫ్యాన్లు కూడా లేవు"

"చాలు చాల్లే... ఇంకెప్పుడూ వెళ్ళకు. అలాంటి వాళ్ళకి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది"

కల్పించుకుంటూ అంది సునంద. "వినాయక చవితికి ఆ పిల్ల హంసినికి పరిచయమైంది. ఊరికే ఓ బొమ్మ ఇచ్చేసరికి ఫ్రెండ్ అంటోంది. నెలవురోజుల్లో

వచ్చి ఇక్కడ ఆ పిల్లతో ఆడుకుంటూ ఉంటుంది. మన చుట్టుపక్కలన్నీ పెద్ద బంగళాలేగా. ఆడుకోవ డానికి పిల్లలెవరూ బయటికి రారు..."

"వీడియో గేమ్స్, ఇండోర్ గేమ్స్ ఆడుకోమను. రోడ్డుపక్క పిల్లల్తో స్నేహం ఏంటి. డ్యామ్ ఇన్సల్ట్!" ముఖం వికారంగా పెట్టుకుని అన్నాడు.

తండ్రి మాటలకు నొచ్చుకుని మౌనంగా విండో గ్లాస్ వేసేసింది హంసిని. ఒకచోట కారాపి దిగుతూ, "దిగండి" అన్నాడు. "అదిగో అదే నేను సృష్టించిన అద్భుతం" ఆనందోద్విగ్నుడవుతూ కాస్త దూరంలో ఉన్న హంసభవనాన్ని చూపించాడు మనోజ్‌కుమార్.

హంస ఆకారంలో ఉన్న ఆ భవనాన్ని చూసి ఆశ్చ ర్యానందాలతో ఉక్కిరిబిక్కిరయ్యింది సునంద.

"వావ్ ఎంత బావుందో! ఢిల్లీలోని లోటస్ బిల్డిం గ్‌లా దీని గురించీ దేశమంతా గొప్పగా చెప్పుకుం టుంది. కంగ్రాట్స్" షేక్‌హ్యాండ్ ఇచ్చి మరీ అభినం దించింది.

"చూశావా హంసినీ. నీ డాడీ ఎంత గ్రేట్ ఆర్కి టెక్టో. నీ కళ్ళతో నువ్వే చూడు. నేనెంత అత్యద్భుత భవన రూపశిల్పినో, ఎంత ఫేమస్ పర్సనో కొంచెం పెద్దయ్యాక నీకు అర్థమవుతుందిలే.

ఒకటి మాత్రం గుర్తుంచుకో. షాజహాన్‌లాంటి రాజు ఇప్పుడుండుంటే నాకు నిలువెత్తు ధనం ఇచ్చే వాడు!" కూతురితో గర్వంగా చెప్పాడు.

"అందులో పిచ్చుకలకీ, పావురాలకీ గూళ్ళు కూడా ఉన్నాయా డాడీ" అంది హంసిని.

"అదేంటలా అడిగావు?" సునంద అంది.

"హంసలా ఉంది కదా మమ్మీ. అందులో పక్షు లకూ గూళ్ళూ ఉంటే బావుండనిపించింది. లేవా?" నిరాశగా అడిగింది హంసిని.

"ఉహూ... అది మహా ధనవంతుల భవంతి. వాళ్ళే ఉంటారు..."

"లోపలికెళ్ళిచూస్తే మూర్ఛబోతావు. బాహుబలి లోని రాజభవనంకన్నా రిచ్‌గా ఉంటుంది. పద చూపిస్తా..." కించిత్తు నిరుత్సాహంగా అన్నాడు మనోజ్‌కుమార్.

"చిన్నపిల్ల. మీ గొప్ప దానికేం తెలుస్తుంది. అక్కడి కొచ్చిన సిటీ ప్రముఖులంతా మిమ్మల్ని పొగడ్తలతో ముంచెత్తుతారుగా. అప్పుడు తెలుసుకుంటుంది లెండి..." అంది సునంద.

తలాడిస్తూ అన్నాడు. "కరక్టే. చిన్నపిల్ల. తనకేం తెలుస్తుందిలే" మనోజ్‌కుమార్.

తిరిగి కారెక్కారు. "హంస తెల్లగా ఉంటుందికదా డాడీ. ఈ బిల్డింగు గోల్డు కలర్లో ఉందేమిటి?"

కూతురి ప్రశ్నకు తండ్రీ తల్లీ కూడా ఉలిక్కిపడ్డారు. ఆ చిన్నారి పరిశీలనాశక్తికి అబ్బురపడ్డారు.

"నిజమేగాని ఇది నిజం హంసకాదు. స్వర్ణహంస. అమృతసర్‌లోని బంగారు దేవాలయంలాగా తన భవనం గురించంతా గొప్పగా చెప్పుకోవాలని ఆ రంగు వేయించారు సుందర్ మెహతా గారు. ఆయన సిటీలోని ప్రముఖ బంగారు, వజ్రాల వ్యాపారి"

అర్థమైనట్టు తలాడించింది హంసిని.

భవనం దగ్గర కారు దిగారు. ప్రాంగణమంతా రకరకాల కార్లతో నిండి ఉంది. భవనాన్ని పూలతో రంగు రంగుల విద్యుద్బల్బుల తోరణాలతో అలంక రించారు. రిచ్‌లుక్‌తో కళ్ళు తిప్పుకోలేనట్టుగా ఉంది స్వర్ణ హంసభవన్. ఇల్లంతా గృహప్రవేశానికి వచ్చిన ఖరీదైన అతిథులతో కిటకిటలాడుతోంది.

వారి వేషభాషల్నీ ఒంటిమీది నగల ధగధగల్నీ అబ్బురంగా చూడసాగింది హంసిని.

మెహతా మనోజ్‌ని సాదరంగా ఆహ్వానించారు.

"ఒక వండర్ హౌస్‌ని ఆవిష్కరించావ్. యూ ఆర్ గ్రేట్. నా కలని సత్యం చేశావు" అంటూ అభి నందించారు. చుట్టూ ఉన్న వారికి పరిచయం చేసి, అతడెంత గొప్ప ఆర్కిటెక్టో వివరించారు.

మనోజ్ దంపతుల ముఖాలు వికసించాయి. మనోజ్ అయితే ఏకంగా గాలిలో తేలిపోసాగాడు. "ఇంటీరియర్స్ ఎలా ఉన్నాయో చూడు. మిసెస్ రమణి చేశారు" అన్నారు మెహతా.

"లంచ్ చేసే వెళ్ళండి" అనీ అన్నారు. ఇంట్లో అడుగడుగునా పరచుకున్న అందాలని ఇంతింత కళ్ళతో చూశారు మనోజ్, సునంద, హంసిని.

అద్భుత డిజైన్‌తో ఉన్న ఫాల్స్ సీలింగ్, రంగుల లైట్లు, షాండ్లియర్స్, శిల్పాకృతుల్లోని స్తంభాలు, గోడలకు తైలవర్ణ చిత్రాలు,

గోడమూలల్లో గాజుబల్లలమీద విసూత్నశిల్పాలు, పూలకుండీలు, ప్లాస్టిక్ మొక్కలు... జిగేల్‌మని మెరుస్తున్నాయి. మైమరిపిస్తున్నాయి.

"మైసూర్ మహారాజా ప్యాలెస్‌లా ఉంది. చాలా గొప్పగా డిజైన్ చేశారు" భర్తని మెచ్చుకుంది సునంద.

"డ్రాయింగ్ రూమే కాదు, కిచెన్, డైనింగ్ హాల్, బెడ్ రూమ్స్, బాల్కనీ ప్రతీదీ ఓ అద్భుతమే అనిపిస్తుం దంటే నమ్మండి"

"థ్యాంక్యూ. బిల్డింగ్ ఆకృతే కాదు చాలా రకాల ప్రయోగాలు చేశాను. ఉదాహరణకి ఇదిగో ఈ కిటికీ ప్రక్కన వర్టికల్‌గార్డెన్‌కు అవకాశం కల్పించాను చూడు. ఇది బయటి శబ్ద, వాయుకాలుష్యం లోపలికి రాకుండా నియంత్రిస్తుంది. దాంతో రూమ్‌లోని ఆక్సిజన్‌స్థాయి పెరిగి ఆరోగ్యకారకమవుతుంది.."

"గ్రేట్. నిజంగా మీరు గ్రేట్ ఆర్కిటెక్టే" అభినం దించింది. కొందరు అతిథులొచ్చి, 'ఈ తరహా బిల్డింగ్‌కి ఎంత స్థలం కావాలి. ఎంత ఖర్చవుతుంది' అంటూ మనోజ్‌ని ఆరాతీశారు.

అత్యధికులు మాత్రం "మీ భవంతే ఓ మ్యూజి యం. చాలా గొప్ప బిల్డింగ్ కట్టారు.

నభూతో నభవిష్యతి" అంటూ మెహతాని పొగడ్తలతో ముంచెత్తుతున్నారు.

ఆయన కూడా, ఆర్కిటెక్ట్ చేత ఎన్నిరకాల ప్లాన్లు గీయించాడో, ఎన్ని మార్పు చేర్పులు సూచించాడో చెప్పుకొస్తున్నారు. అంతేకాదు. మార్బుల్స్ రాజస్థాన్ నుంచీ, అద్దాలు బెల్జియం నుంచీ, ఆర్ట్ పీసెస్ ఇంకేదో దేశం నుంచీ ఎంత కష్ట పడి తెప్పించాడో ఏకరువు పెడుతున్నారు.

ఆయన ధోరణికి బాగా నిరుత్సాహపడ్డాడు మనోజ్. తన కష్టాన్ని, ప్రతిభని, గుర్తింపుని, గౌరవాన్ని ఎవరో దొంగిలించినట్లు బాధపడ్డాడు.

"అలా ఉన్నారేంటి?" సునంద అడిగింది.

"నన్నెవరో దారుణంగా మోసగించినట్టుగాఉంది"

"అదేమిటి? మీకు ఇవ్వాల్సిన డబ్బు ఎప్పుడో ఇచ్చే శారుగా!" అంది సునంద.

"డబ్బు కాదు... అదే ముఖ్యమూ కాదు. కనీసం మన హంసిని నా గురించి గర్వపడే క్షణాలు ఎదురవు



తాయనుకున్నాను. ప్చ్...!"

సానుభూతిగా చూసిందామె. పొడుగాటి డైనింగ్ టేబుల్ మీద ముప్పై రకాల ఆహార పదార్థాలున్నాయి. అయినా అయిష్టంగా భోంచేసి బయటికొచ్చారు.

వెళ్తున్నట్టు మెహతాకి చెప్పగానే, "ఓకే" అంటూ అతిథుల గొడవలో పడిపోయారాయన. మరింత డీలాపడ్డాడు మనోజ్.

కారు ఎక్కాక అడిగింది హంసిని. "ఈ ఇంట్లో ఎంతమంది ఉంటారు డాడీ"

'మెహతాగారు, ఆయన భార్య, కొడుకూ"

"ముగ్గురికి ఇంత పెద్ద ఇల్లు ఎందుకు డాడీ. పాపం మల్లిక వాళ్ళకి వేరేగా కిచెనూ, బాత్‌రూమ్ కూడా లేవు" అంది హంసిని

"వాళ్ళకీ వీళ్ళకీ పోలికేంటి. వీళ్ళు ఆగర్భ శ్రీమంతులు. వాళ్ళు నిష్ఠదరిద్రులు" అసహనంగా అన్నాడు మనోజ్. హంసిని మరి మాట్లాడలేదు.

రెండోజుల్నుంచి గాలీవానా నగరాన్ని ఊపేసి వదిలిపెట్టింది. ఎన్నో ఇళ్ళూ చెట్లూ కూలాయి. బస్తీల్ని మురుగునీరు ముంచెత్తింది. ఆ దృశ్యాలు టీవీలో చూసి కదిలిపోయింది హంసిని.

గబుక్కున సైకిల్ బయటికితీసింది. మల్లికా వాళ్ళు ఉండే ప్రదేశానికెళ్ళింది.

డేరా ఇళ్ళన్నీ కూలిపోయాయి. బొమ్మలూ విగ్రహాలూ చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. కొన్ని నీళ్ళలో మునిగిపోయాయి. మల్లికా, పిల్లలూ బిక్కుబిక్కుమంటూ ఉన్నారు. పెద్దవాళ్ళు గాలివాననీ, తమ దురదృష్టాన్నీ నిందించుకుంటూ ఎలాగోలా మళ్ళీ డేరాఇళ్ళని నిలబెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

"మా ఇల్లు కూలిపోయింది" దగ్గరికొచ్చి ఏడుస్తూ చెప్పింది మల్లిక.

"ఎక్కడ పడుకుంటారు?"చెట్లవంక చూపించింది. కన్నీళ్ళు పొంగిరాగా గిరుక్కున వెనుదిరిగింది. వేగంగా సైకిల్ తొక్కుకుంటూ ఇంటికెళ్ళింది. తిన్నగా తండ్రి దగ్గరకెళ్ళింది హంసిని.

"మల్లికా వాళ్ళకి బుల్లి ఇల్లు కట్టియ్యి డాడీ. పాపం వాళ్ళు ఉండటానికి చోటులేదు"

"నేను ఆర్కిటెక్ట్‌ని. పెద్ద పెద్దవాళ్ళకి పెద్ద సంస్థలకి భవనాల, భవనసముదాయాల డిజైన్స్ రూపొందించి ఇస్తాను. గొప్పగొప్ప కట్టడాలు నిర్మిస్తాను. అంతేతప్ప పేదవాళ్ళకీ అనాకానీ వాళ్ళకీ కాదు. నా స్థాయి నీకు అర్థంకావట్లేదు..."

"వాళ్ళకెవరు ఇళ్ళు కట్టిస్తారు?"

"అలాంటి అలగాజనానికి చౌక ఇళ్ళు ప్రభుత్వం కట్టించి ఇవ్వాలి తప్ప, అది మన పనికాదు"

"బుల్లి కిచెనూ,బుల్లి బాత్‌రూమ్ ఉండేలా చక్కగా డిజైన్ చేసియ్యి డాడీ. పాపం, మల్లికా వాళ్ళు రోడ్డున పడ్డారు డాడీ. ఎప్పుడు వాన ముంచెత్తినా వాళ్ళలాగే అవస్థపడుతూ ఉంటారంట. ప్లీజ్ డాడీ..."

కూతురి మాటలకు మనోజ్‌లో ఆలోచన రగిలింది. ప్రకృతి బీభత్సానికి ఇళ్ళు కోల్పోయిన నిరుపేదలందరికీ త్వరలో ఇళ్ళు కట్టించి ఇస్తామంటూ ముఖ్యమంత్రి చేసిన ప్రకటన మెదడులో మెరిసింది. "ప్లీజ్ డాడీ. వాళ్ళకోసం బుల్లి ఇల్లు కట్టియ్యి డాడీ..."

"చిన్నపిల్ల అయినా పెద్దమాట చెప్పింది. ప్రతీ వారికీ తిండీ బట్టతోపాటు ఒక గూడూ అవసరమే కదండి. అది పెద్దదా చిన్నదా అన్నది కాదు.

తల దాచుకోవడానికి తలపైన ఒక ఇంటికప్పు ఉంటేచాలు. మీరిన్నాళ్ళూ శ్రీమంతుల కోసం ఎన్నో భవంతులు నిర్మించారు. ఈసారి పేదవారికి చౌకలో ఇళ్ళు ప్లాన్ చేసివ్వండి" సునంద అంది.

ఆమెవంక సాలోచనగా చూశాడు. ఒక నిశ్చయానికొచ్చి తలపంకించాడు మనోజ్. బోలెడు సంబరపడిపోయింది సునంద.

"విన్నావా హంసినీ. మీ డాడీ నీ ఫ్రెండ్‌లాంటివాళ్ళ కోసం చిన్న చక్కని ఇళ్ళ ప్లాను గీసిస్తారట"

"నిజమా డాడీ?" అపనమ్మకంగా అడిగింది హంసిని. కూతురి తలనిమురుతూ కనురెప్పలు మూసి తెరచి నవ్వాడు. మరుక్షణం "నా ఫ్రెండ్‌కి చెబుతాను" అంటూ తుర్రుమంది.

మూడే మూడురోజుల్లో చౌకగృహాల సముదాయానికి డిజైన్ తయారుచేసుకెళ్ళి ముఖ్యమంత్రిని కలిశాడు మనోజ్‌కుమార్.

తక్కువ ఖర్చుతో తక్కువ సమయంలో పక్కాగా ఉండేలా ఆ ఇళ్ళ నమూనా ముఖ్యమంత్రికి బాగా నచ్చింది. వెంటనే ప్రభుత్వ ఇంజనీర్లతో అధికారులతో చర్చించి దాన్ని అమలుచేయడానికి నిర్ణయించారు. అసెంబ్లీ ఎన్నికలు రాబోతున్నందుకు గృహనిర్మాణ కార్యక్రమం వేగంగా సాగింది.

మరి 6 నెలలు తిరక్కుండా నగరంలో అయిదు చోట్ల గృహసముదాయాలు నిర్మించి పేదలకు ఇచ్చారు. అంతా మూకుమ్మడిగా గృహప్రవేశాలు చేశారు. వారిలో మల్లిక కుటుంబమూ ఉంది. మిత్రురాలి కళ్ళల్లోని ఆనందం చూసి పొంగిపోయింది.

"నువ్వు నిజంగా గ్రేట్ డాడీ" అంటూ తండ్రిని వాటేసుకుంది హంసిని.చిన్నారి కూతురి మాటలకు మొత్తం ప్రపంచ మంతా వచ్చి అభినందించినంతగా పొంగిపోయాడు మనోజ్‌కుమార్.

ఆ తర్వాత కొద్దిరోజులకే 20,000 మందికి పైగా ఆశ్రయం పొందుతున్న చౌకగృహసముదాయాలకి రూపకల్పన చేసినందుగ్గాను అతడికి ప్రతిష్ఠాత్మక ప్రిట్జ్‌కోర్ పురస్కారం లభించింది.

"ఈ ఘనత నాది కాదు, నీదే హంసినీ" అన్నాడు కూతుర్ని ఎత్తేసి గిర్రున తిప్పుతూ మనోజ్. ఉత్తమ ఆర్కిటెక్ట్‌గా గుర్తింపు లభించినందుకు అతడిలోని కళాకారుడు సంతృప్తుడై పొంగిపోయాడు. లక్షలు ఆర్జించినప్పుడు కలగని అపురూప అనుభూతి అది!

## ఏమా మాటలు?

ఓ పక్క హాటు, ఘాటు ఫొటోషూట్లు, ఇంకోపక్క వేడి ఆవిర్లు కక్కే స్టేట్‌మెంట్లతో ప్రస్తుతం బాలీవుడ్ భామ భూమిపడ్నేకర్ అదరగొట్టేస్తున్నది.

నటించిన సినిమాలు మూడే మూడు అయినప్పటికీ బోల్డంత ఫామ్‌లోకి వచ్చేసింది. 'సంకీర్ణియా' సినిమాలో ప్రస్తుతం నటిస్తున్న భూమి ఈ మధ్య ఓ ఇంటర్వ్యూలో సంచలన వ్యాఖ్యలు విసిరింది.తన జీవితంలో ప్రేమకు చోటులేదని, సెక్స్ మాత్రమే ఉంటుందంటూ ఘాటైన జవాబు చెప్పి అవాక్కుపరిచింది. ఈ వ్యాఖ్యలకుతోడు ఫొటోషూట్స్‌తో పిచ్చెక్కిస్తోంది. ఏమిటబ్బా ఈవిడ స్ట్రాటజీ...



వివిధ కారణాలవల్ల దేశంలో మూడవ ప్రత్యామ్నాయం ఏర్పడే అవకాశం లేదు.

-బృందా కారత్, సి.పి.ఎమ్. నేత

# హెల్త్ బిట్స్



Courtesy : GRIHA SHOBA

## తల్లినిబట్టే కూతురు

తల్లి ఆయుర్దాయం మెరుగ్గా వుంటే ఆ లక్షణం కూతుళ్ళకు కూడా వస్తుందట. తల్లి ఆరోగ్యంగా వుంటే ఆమె సంతానంలో

ఆడపిల్లలు ఆరోగ్యంగా గుండె జబ్బులు, డయాబెటిస్, పక్షవాతం, ఎముకల బలహీనత వంటివి రాకుండా వుంటారట.

తల్లి 90 ఏళ్ళు బతికితే కూతురు అంతే ఆయుర్దాయం కలిగివుండే అవకాశం ఇరవైఐదుశాతం అధికం. తల్లిదండ్రులు ఇరువురూ దీర్ఘాయుష్కులైతే వారి కూతుళ్ళు దీర్ఘాయుష్కులయ్యే అవకాశం ముప్పై ఎనిమిది శాతం అధికం.ఇది జన్యుపరంగా వచ్చే లక్షణం అని చెప్పలేకపోతున్నారు.

తల్లి ఎక్కువకాలం బతికిందంటే ఆమె ఆరోగ్యకర అలవాట్లను కలిగి వుంటుంది. చక్కటి ఆహారపదార్థాలు తయారుచేయగలరు.

అటువంటి పోషకపదార్థాలు తీసుకోవటం, తిండి, నిద్ర అలవాట్లువంటివి అమ్మను చూసి ఆడపిల్లలు నేర్చుకుంటారు. అందువల్లనే వారు కూడా ఎక్కువ సంవత్సరాలు జీవించగలుగుతారన్నది వివరణ. ◆

## స్మార్ట్‌ఫోన్‌తో కంటిచూపుకి దెబ్బ

స్మార్ట్‌ఫోన్ వాడకంలో గంటలు గంటలు గడుపుతున్నారా! అయితే మీరు త్వరత్వరగా అంధత్వం వైపు అడుగులు వేస్తున్నట్టే లెక్క.

స్మార్ట్‌ఫోన్ నుండి వచ్చే నీలంకాంతి ప్రభావం కళ్ళమీద ఎలా వుంటుందనే దాని మీద అధ్యయనం చేశారు.

స్మార్ట్‌ఫోన్ కాదు, ల్యాప్‌టాప్ వంటి ఇతర ఎలక్ట్రానిక్ పరికరాలనుండి వచ్చే ఆ నీలపుకాంతిని కనుగుడ్డు లేదా లోపలికార్నియా నిరోధించలేవు.అలాగే తిరిగి వెనక్కి పంపలేవు.

నేరుగా రెటీనా మీదపడే ఆ కాంతి రెటీనాని దెబ్బతీస్తుంది.

కంటిచూపు సక్రమంగా వుండాలంటే 'రెటైనల్ మాలిక్యూల్స్' నిరంతర సరఫరా జరగాలి. ఆ మాలిక్యూల్స్ కంటి లోపల తయారవుతాయి.

స్మార్ట్‌ఫోన్ వంటి వాటినుండి వచ్చే నీలపు కాంతి ప్రభావాన కంటిలోపలి క్రాంతి గ్రాహకాలను రెటైనల్ మాలిక్యూల్స్ చంపేస్తాయి.

కాంతిగ్రాహక కణాలు ఒకసారి మరణిస్తే తిరిగి ఏర్పడవు. అవి శాశ్వతంగా పోయినట్లే. అంటే కంటిచూపు ఆ మేరకు తగ్గిస్తాయి.

అందుకే చీకటిగదిలోవుండగా ఎలక్ట్రానిక్ వస్తువులను వాడవద్దన్నది కంటి వైద్యుల సలహా. చదువుకునే సమయాన్ని, కుటుంబ సభ్యులతో గడిపే సమయాన్ని హరిస్తున్న స్మార్ట్‌ఫోన్‌ని దూరంగా ఉంచడమే మంచిది. ◆



Courtesy : HEALTH



## అది క్యాన్సర్ కాదు

నెలవారి బహిష్టుసమయంలో అప్పుడప్పుడు స్తనాలలో నొప్పిరావచ్చు. అలా నొప్పి అనిపించగానే రొమ్ముక్యాన్సరేమోనని కంగారుపడనక్కరలేదు.

స్తనాలకి ఇన్‌ఫెక్షన్ సోకితే ఉబ్బినట్టుగా అవుతాయి.

ముట్టుకుంటే నొప్పి, స్వల్ప జ్వరం వస్తాయి. గుండె సంబంధిత, నాడీ సంబంధిత మందుల ప్రభావాన కూడా స్తనంలో బాధ రావచ్చు.

స్తనాల సైజు అధికమయినా,స్తనాలు పట్టు కోల్పోయి జారినట్టు అయినా స్తనాలలో, వాటితోపాటుగా భుజం, వీపు, మెడ భాగాలలోనూ తరచుగా నొప్పులు వస్తాయి.

ఛాతీభాగంలోని ఇతర కణజాలాలు, ఎముకలు ఇతరత్రా ఏవైనా ఇబ్బందులను ఎదుర్కొంటుంటే వాటి ప్రభావం స్తనాలమీద వుంటుంది.

ఊపిరితిత్తులు, గుండె సమస్యలవల్ల కూడాస్తనాలు భారమనిపిస్తాయి.

అటువంటి నొప్పులు, సలుపు ఎదురైనప్పుడు స్తనాలకు వేడి కాపడం లేదా బాధానివారిణి తైలాలతో మర్దన చేయడం చాలా అవసరం. దానివల్ల కొంత ఉపశమనం ఉంటుంది.

# ఫిట్‌గా వుండండి

'పోషకాలు' అన్నపదం చుట్టూ బోల్డన్ని అభిప్రాయాలు అల్లుకుపోతుంటాయి. మంచి ఆహారపు అలవాట్లు ఏవి, కానివి ఏంటి అన్న కథనాలు సిద్ధాంతాలు అనేకం వినిపిస్తుంటాయి.

వీటిపై ఎప్పటికప్పుడు విస్తృత పరిశోధనలు సాగుతుంటాయి. అవి ఒకదానికొకటి పొంతనలేనివి అవుతున్నాయి. ఓ పరిశోధన కార్బొహైడ్రేట్లు మంచివే అని చెప్తుంటే, మరోపరిశోధన చెడ్డవి అంటుంది. ఇంకొకటి అత్యవసరాలు అంటుంటుంది. ఫలితంగా వినేవారికి ఏవి చెడు అనే డైలమా తప్పడం లేదు.

## క్యాలరీలన్నీ ఒక్కటే :

క్యాలరీల లెక్క అనేది క్యాలరీల సోర్స్‌ను బట్టి వుంటుంది. రిఫైండ్ కార్బొహైడ్రేట్స్ నుంచి లభించే క్యాలరీలు అధిక గ్లైకమిక్ ఇండెక్స్ కలిగి, అధిక ఇన్సులిన్‌తో వుంటాయి.

ఫ్యాట్లు, ప్రొటీన్లు నుంచి లభించే క్యాలరీ లతో పోల్చితే సంతృప్తి స్కోర్‌తక్కువ. అన్ని క్యాలరీల శక్తి సామర్థ్యం ఒకేరకంగా ఉన్నప్పటికీ బరువుపై లేదా బరువుతగ్గే ప్రక్రియపై ఒకే ప్రభావాన్ని చూపవు.

ఆహార పదార్థాల ఆధారంగా క్యాలరీల ప్రభావం శరీరంలోజీవక్రియప్రక్రియలో విభిన్నంగా ఉంటుంది. ఉదాహరణకు ఫ్యాట్స్, కార్బొహైడ్రేట్స్, ప్రొటీన్ క్యాలరీలను పోల్చలేం. ఇవన్నీ విభిన్నంగా, కొన్ని ఇతర వాటి కంటే మరింత కడుపు నింపేవిగా ఉంటాయి.

## బరువు తగ్గాలంటే...

పండ్లనుంచి లభించే క్యాలరీలు ఇతర కార్బొహైడ్రేట్స్‌కంటే ప్రాధాన్యంకలవిగా వుంటాయి. అంటే మనం తీసుకునే ఆహారపదార్థాల రకాన్ని బట్టి క్యాలరీల కౌంట్ ఆధారపడి వుంటుందన్నమాట.



Courtesy : HARPER'S BAZAAR

చాలామంది బరువు తగ్గాలనుకునేవారు చేసే పని భోజనాన్ని మానేయడం. దీనివల్ల మూడ్ స్వింగ్స్ ఎక్కువవుతాయి. ఫలితంగా తర్వాతి ఆహార వ్యవహారాల్లో వ్యత్యాసాలు వచ్చేస్తాయి. బరువు తగ్గాలన్న లక్ష్యాల సాధనలో తిండి మానేయడం లేదా ఉపవాసాలు వుండడం సులువైన ప్రత్యామ్నాయంగా భావిస్తుంటారు. కాని ఇది సరైన ఆప్షన్ కాదు.

ఫిట్‌నెస్ గోల్స్ పెట్టుకోవడం అన్నివిధాలా ఉత్తమ చర్య. దీనివల్ల ఎంత త్వరగా బరువు తగ్గుతారో, అంతే శీఘ్రంగా మళ్ళీ బరువు పెరుగుతారు కూడా. శారీరక పనితీరు, స్ట్రక్చర్ ప్రభావితం అవుతాయి.

## ఫ్యాట్స్, కార్బ్స్ వద్దు :

బరువు తగ్గాలనుకునేవారు ఫ్యాట్స్, కార్బొహైడ్రేట్స్ తినకూడదన్నమాట తరచూ వింటుంటాం. గ్రెయిన్ ఉత్పత్తులు ముఖ్యంగా బ్రెడ్, పాస్తా, రైస్ తినొద్దని అనేకమంది పదేపదే చెప్తుంటారు.

కాని గ్రెయిన్స్ వాటంతటఅవి హానిచేసేగుణంతో వుండవు. వాటిని ప్రాసెస్ చేసినప్పుడు వాటిలోని పోషకవిలువలు తగ్గిపోతాయి. లేదా పూర్తిగా కోల్పోతాయి. అసలు భారతీయ ఆహార మార్గదర్శకాల ప్రకారం ధాన్యాలు రోజువారీ ఆహారంలో భాగం కావాలి. బ్రౌన్‌రైస్, పూర్తిస్థాయి గోధుమ, బ్రెడ్, సెరల్, పాస్తాలు తీసుకుంటుండాలి.

ఇవి ఐరన్, పీచు, ఇతర ముఖ్యమైన పోషకాలను అందిస్తుంటాయి. అయితే అనేకమంది రిఫైండ్ లేదా వైట్‌బ్రెడ్‌లను పూర్తిస్థాయి వీట్ బ్రెడ్ స్థానే తింటుంటారు. హోల్‌వీట్ పాస్తా బదులు రిఫైండ్ పాస్తా తింటారు. ఇది సరికాదు.

పూర్తిస్థాయి ధాన్యాలను వాడడాన్ని అలవాటు చేసుకోవాలి. అలాగే, అన్ని కొవ్వులూ చెడ్డవి కావు. ఫ్యాట్ అనేది దీర్ఘకాలంగా బ్యాడ్ ఫుడ్ లేబుల్‌తో ఉంది. కాని నేడు దేశవ్యాప్తంగా న్యూట్రిషనిస్టులు కొవ్వుకుగల చెడుట్యాగ్‌ను తొలగిస్తున్నారు.

జుట్టు, చర్మం, మలబద్ధకం లేదా రోగనిరోధక శక్తి తదితర విషయాల్లో ప్రయోజనకరమైనదిగా పేర్కొంటున్నారు. సరైన ఆయిల్ ఛాన్సులు అంటే కోల్డ్‌ప్రెస్డ్ ఆయిల్స్, నెయ్యి ఆరోగ్యవంతమైన ఫ్యాటియాసిడ్ గలవిగా గుర్తింపు పొందుతున్నాయి.

ఫ్యాట్స్‌లో రెండు రకాలుంటాయి. సాచురేటెడ్ ఫ్యాట్, ట్రాన్స్-ఫ్యాట్‌లు. ఇవి చాలా పదార్థాల్లో వుంటాయి. ట్రాన్స్ ఫ్యాట్స్ సాధారణ ఉష్ణోగ్రతలో సాలిడ్‌గా వుంటాయి. మార్క్‌రైన్, బటర్, వనస్పతి వంటివి ఈ కోవలోకి వస్తాయి.

ఇవి గుండె ఆరోగ్యానికి మంచివి కావు. మేలు చేసే డైటరీ ఫ్యాట్స్ చాలా భాగం అన్‌సాచురేటెడ్.

## చిరుతిండ్లు మంచివా!

అని అనుకుంటారు. కాని, ఆరోగ్యపూరితమైన తక్కువ క్యాలరీలుగల చిరుతిండ్లు ఆకలిని దూరంగాఉంచడానికి మంచిమార్గం. ఆకలిని దూరంగా వుంచి, శారీరక కొవ్వును, రక్తంలో చక్కెరస్థాయిలను తగ్గిస్తాయి. తక్కువ క్యాలరీలు, ఎక్కువపీచు లేదా ప్రొటీన్‌పదార్థాలు తినడంవల్ల సంతృప్తికరమైన భావన ఇచ్చి, తదుపరి భోజనంపట్ల ఆత్రుతను తగ్గిస్తాయి. ఫలితంగా బరువు తగ్గుతారు. కొవ్వు కరుగుతుంది.

బ్రేక్‌ఫాస్ట్, లంచ్, డిన్నర్‌లకు అదనంగా మిడ్, మార్నింగ్, ఈవినింగ్ స్నాక్స్ తీసుకోవడంవల్ల చిన్నచిన్న భోజనాలను ఎక్కువసార్లు తీసుకున్నట్లయితే, బరువుతగ్గడంలో రక్తంలో చక్కెరస్థాయిల్ని తగ్గించడంలో ఎసిడిటి సమస్యల నివారణలో ఉపకరిస్తుంది. ఫైబర్ ఎక్కువగావుండే పండ్లు, కూరగాయులు ఎక్కువగా తింటుండాలి. ప్రాసెస్డ్ చేసిన స్నాక్స్ తినవద్దు.



Courtesy : AAROGYA SANJEEVANI

వీటిని మోనో అన్‌సాచురేటెడ్ ఫ్యాటి యాసిడ్స్‌లేదా ముఫా, పాలి అన్‌సాచురేటెడ్ యాసిడ్స్ లేదా పుఫాగా పేర్కొంటారు. కనోల ఆయిల్, ఆలివ్ ఆయిల్, పీనట్ ఆయిల్, నట్స్, సీడ్స్, అవకాడోలు ముఫాకు మంచి ఆధారాలు. ఒమెగా 3 ఫ్యాటి యాసిడ్స్ పుఫా కిందకు వస్తాయి. ఇవి ఎక్కువగా సల్మాన్, సార్డినెస్ వంటి చేపల్లో వుంటాయి.

బ్లడ్ ప్రెషర్ తగ్గించి అసంబద్ధ హార్ట్‌బీట్స్ నుంచి రక్షిస్తుంటాయి. కొబ్బరి నూనె హై సాచురేటెడ్ ఫ్యాట్ కలిగివుంటుంది. ఆహారంలో చేర్చుకోతగ్గ ఆరోగ్యవంతమైనఛాయిస్.యాంటిఏజింగ్ ఆహారం. బహుళ ప్రయోజనాలు దక్కుతాయి. రోగనిరోధక వ్యవస్థను మంచి కండిషన్‌లో వుంచుతుంది. అనేక ఇన్‌ఫెక్షన్లు, వ్యాధులనుంచి పరిరక్షించే పునాదివంటివి.

## వ్యాయామం ముఖ్యం

సాధారణ దృష్టితో చూస్తే ఇది వాస్తవం. అయితే వయస్సు, జీవనశైలి దృష్ట్యా చూస్తే, అభిప్రాయాన్ని కొన్నిసార్లు మార్చుకోవాలనిపిస్తుంది.

వయస్సు పెరిగేకొద్దీ జీవక్రియ సన్నగిల్లుతుంది. యవ్వనంగా ఉన్నప్పటి మాదిరి కొవ్వును కరిగించలేకపోతారు. అంతేకాకుండా ఆహారం, ఇతర ఆరోగ్య పరిస్థితులు బరువుతగ్గడంపై గుర్తించతగినంత ప్రభావంచూపుతాయి. బరువుపెరగడమనేది ఎంత తింటున్నారు, ఏం తింటున్నారు? అనే అంశాలపై ఆధారపడి వుంటుంది. అలాగే శారీరక చురుకుదనం ముఖ్యమయిన అంశం కాగలదు.

ఎంతైనా తినొచ్చని, దీన్ని కరిగించుకోవచ్చని సాధారణంగా భావిస్తారు. కాని ఇది అన్నివేళలా సాధ్యపడదు. అధిక వ్యాయామాలవల్ల శరీరం కొవ్వుకంటే ఎక్కువగా కండరాలను కోల్పోతుంటుంది.

జీవక్రియ నెమ్మదించినప్పుడు బరువు పెరగవచ్చు లేదా బరువు తగ్గలేకపోవచ్చు. ఏ బరువు తగ్గించుకునే కార్యక్రమం అయినా ఆహార పద్ధతులు, సరైన శారీరక చురుకుదనం కలగలిసి ఉన్నప్పుడే కోరిన ఫలితాలు దక్కుతాయి.

సన్నగా వున్నవాళ్ళను చూడగానే ఆరోగ్యవంతులనో, అనారోగ్యం ఉందనో, బొద్దుగా వుంటే ఆరోగ్యవంతులనో ఏదోక అభిప్రాయాలను వ్యక్తంచేసేస్తుంటారు. కాని, ఏ పుస్తకాన్నీ కూడా దాని కవర్ పేజీచూసి ఏవిధంగా జడ్జి చెయ్యకూడదో, మనిషి రూపాన్నిచూసి ఆరోగ్య స్థితిగతులను అంచనావెయ్యకూడదు.

సగటున శరీరంలో కండరాల మాస్ కంటే ఫ్యాట్ మాస్ ఎక్కువగలవారు సన్నగా వుంటారు. నిజానికిది, స్థూలకాయులకంటే హానికర ఆరోగ్యస్థితి.

## సన్నగా వుంటే ఆరోగ్యమా!

స్కిన్‌ఫ్యాట్ గలవారు జీవక్రియపరంగా స్థూలకాయుల కింద లెక్క. వీరికి కొవ్వు వారి శరీరభాగాలపై పేరుకుపోయి వుంటుంది. ఈ పరిస్థితి శారీరక భాగాల పనితీరును అడ్డుకుని ప్రభావం చూపి, తీవ్ర అనారోగ్యానికి దారితీస్తుంది. సన్నగా వున్న వ్యక్తులకు దీర్ఘకాలిక రుగ్మతలు ఉండవచ్చు. అధిక బరువున్న వాళ్ళు శారీరకంగా ఆరోగ్యంగానే వుంటారు.

శారీరక బరువు రెండురకాలుగా వుంటుంది. శరీరంలో ఎంత కొవ్వు వుంది, కండరాలు, ఎముకల బరువు ఎంత అన్నవి ప్రధాన విషయాలు. కాబట్టి, బరువు చూసుకుని ఆరోగ్యాన్ని జడ్జి చేసుకోకూడదు. పూర్తి బరువుకంటే ఫ్యాట్ వెయిట్‌పై కన్నేయాలి.

**కె.సౌజన్య**



Courtesy : STYLE BAZAAR

# నాకు మహా ఇష్టం





ముంబయిలో పుట్టి, పెరిగిన మహారాష్ట్ర అమ్మాయి రియా సుమన్. కాలేజీలో చదువుకునే సమయంలోనే తెలుగు 'మజ్ను' అవకాశం తలుపు తట్టింది. అలా అనుకోకుండా 'మజ్ను'లో నటించిన రియా ప్రస్తుతం 'పేపర్‌బాయ్'లో ధరణిగా ఫుల్‌లెంగ్త్‌లో నటించింది.

సినిమాలపట్ల మోజుతో పెరిగిన ముంబయి భామ పెద్దగా కష్టపడకుండానే, అనుకోకుండా అవకాశాలు పొందింది. ఆమెతో ఇంటర్వ్యూ.

**నటన అనేది మీ ఎజెండాలో ఎప్పుడూ వుండేదా?**

నటించాలన్న కోరిక ఉంది. కాలేజీ రోజుల్లోనే వచ్చిన అవకాశానికి నో చెప్పలేకపోయాను. అయితే చదువుకు ఆటంకము రాకూడదన్న షరతుతో మొదటి సినిమా 'మజ్ను' చేశా.

**'మజ్ను', 'పేపర్‌బాయ్' వంటి చిత్రాలను ఎంచుకోవడంలో మీకున్న ప్రాధాన్యం ఏంటి?**

నేను ముంబయిలో కాలేజీలో ఉన్నప్పుడు 'మజ్ను' అవకాశం వచ్చింది. సిటీలో ఆడిషన్ జరుగుతున్నదని తెలిసి, ఓ ఛాన్స్ తీసుకున్నాను.

అవకాశం వచ్చింది. ముంబయి వెలుపల తొలి ఎసైన్‌మెంట్. నా షూటింగ్ డేట్స్ ఎక్కువ లేవని, నా కాలేజీ షెడ్యూల్స్‌కు ఇబ్బందిరాదని నిర్మాత కన్విన్స్ చేశారు.

'మజ్ను' సినిమా తర్వాత కాలేజీలో బిజీ అయి, సినీ ఆఫర్లు అందుకోలేకపోయాను. కాలేజీ చదువు అయ్యాక వచ్చిన మొదటి ఆఫర్ 'పేపర్‌బాయ్'. సంతోషంగా ఒప్పుకున్నాను.

**తెలుగు సినిమాలకే ప్రాధాన్యమా?**

'మజ్ను' ప్లాన్ చేసుకోలేదు. 'పేపర్ బాయ్' మంచి సినిమా. అంతే కాని, ఇక్కడ భాషా ప్రాధాన్యాలేవీ లేవు.సినిమాకు ప్రాంతీయ, భాషా సరిహద్దులు లేవని నేను విశ్వసిస్తాను. అన్ని భాషల సినిమాలూ చూస్తాను. మా నాన్న, నేను ముంబయి ఫిల్మ్ ఫెస్టివల్‌లో రెగ్యులర్‌గా సినిమాలు చూస్తాము.

**'పేపర్‌బాయ్స్' గురించి మీరు ఏం తెలుసుకున్నారు?**

మనచుట్టూ వున్నవాళ్ళను మనం పరిశీలించం, పరిగణనలోకి తీసుకోం. పేపర్‌బాయ్, పోస్ట్‌మ్యాన్, మిల్క్‌మ్యాన్ ఎవరైనా కానీయండి.

ఈ సినిమాద్వారా పేపర్‌బాయ్ మనస్సు గుర్తించగలిగాం.





**మీరు పుస్తకాలు చదువుతారా?**

సినిమాల్లోకి రావడానికి ముందు వీలైనన్ని పుస్తకాలు చదివేదాన్ని. హిందీ నవలలంటే నాకు ఇష్టం. ప్రేమ్‌చంద్ నా ఫేవరేట్ రైటర్. స్ఫూర్తికోసం, సినీ మాధ్యమాన్ని బాగా అర్థంచేసుకోవడంకోసం సినిమాలు చూడడం మొదలుపెట్టాను.

దాంతో పుస్తకాలు చదవడం కొంత తగ్గింది. మళ్ళీ షూటింగ్‌లు, ప్రయాణాలతో మధ్యలో ఖాళీ దొరికితే చాలు పుస్తకాలు చదివేస్తున్నా.

**హీరోతోకలిసి సైకిల్‌పైకూర్చుని ఇంటింటికీ తిరుగుతూ పేపర్లు వేయడం ఎలా ఉంది?**

(నవ్వేస్తూ) ఇది సినిమాలో చూసినంత రొమాంటిక్‌గా వుండదు. మేము సైకిల్‌ను బ్యాలెన్స్ చేసుకోవాలి, కొంత కెమిస్ట్రీ చూపాలి.

యాంగిల్‌లో, స్పీడ్‌గా పేపర్ విసరాలి. అదే సమయంలో ఎక్స్‌ప్రెస్ చేయాలి. మార్నింగ్ లైట్ క్యాచ్ చేయాలి. ఇన్ని ఇబ్బందుల్తో చేయాలన్నమాట.ఐనా మేము బాగా సాధించగలిగాము.

**నటనలో ఏదైనా అనుభవం వుందా?**

నాకు సినిమా, నటనలంటే ఇష్టం. మోడలింగ్ ఆలోచన లేదు. హీల్స్‌తో నడుస్తూ, ఫ్యాషన్ ర్యాంప్స్ చెయ్యలేను. మేనేజ్‌మెంట్ స్టడీస్‌లో డిగ్రీ చేశాను. ముంబయి కాలేజీలో డ్రామా, థియేటర్ చేశాను. అనుపమ్ ఖేర్ నిర్వహించే యాక్టింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో చిన్నపాటి కోర్స్ చేశా.

**'పేపర్‌బాయ్' బాగా చేశానన్న సంతృప్తిఉందా?**

చాలా వుంది. నా పాత్రధారణకి నేను పూర్తిగా న్యాయంచేశాననే నేను భావిస్తున్నాను. మంచి సినిమా చేశామన్న సంతృప్తి నాకు ఉంది.

ఈ అవకాశం ఇచ్చిన దర్శక నిర్మాతలకు నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను... అంటూ ముగించింది రియా సుమన్.

**అయినపూరి సుజాత**

సీరియల్

# ఉషస్సు

కె.కె.భాగ్యశ్రీ



ఎల్లప్పుడూ తనకోసమే జీవించి, తనఉన్నతే లక్ష్యంగా తనకు సహాకరించిన తన ప్రాణంలో ప్రాణమైన తన అర్ధభాగాన్ని కోల్పోయినందుకు కన్నీరుమున్నీరుగా విలపించింది.

తన సర్వస్వం తననుంచి దూరమయ్యాక గుండె ఇంకా ఎందుకు బద్దలవ్వలేదో అని ఆక్రోశించిన ఆమెకు ఎదురుగా బిక్కముఖం వేసుకుని తననే చూస్తూ దీనంగా నిలబడ్డ తన కూతురు ఎనిమిదేళ్ళ అభిజ్ఞ కనబడింది.

అభం శుభం తెలియని ఆమె ముద్దుమోము చూశాక తాను ఇంకా ఎందుకు జీవించాలో అర్థం అయ్యింది. తేజస్వికి ప్రతిరూపమైన తన మనసుకి ఎనలేని ఆనందాన్నిచ్చే ఆ చిన్నారి అభ్యుదయమే తన ముందున్న గమ్యం అని గ్రహించిన సుహాసిని గుండెరగిల్చే కన్నీళ్ళను దిగమింగుకుని తనకూతురి చిరునవ్వులే ఆ అగ్నిని చల్లార్చే పన్నీటి జల్లులని భావిస్తూ ధైర్యంగా ముందడుగు వేసింది.

ఆ కష్టసమయంలో ఆమెకు చేదోడువాదోడుగా ఉంటారు అనుకుంటే కూతురికొచ్చిన కష్టం చూసి తల్లడిల్లిన ఆ ముసలిగుండెలు ఆకస్మికంగా ఆగిపోయాయి. తల్లిదండ్రుల మరణంతో ఏకాకిగా మిగిలిన సుహాసినికి అభిజ్ఞే ప్రపంచమైంది.

ఆమె తోడిదే లోకమైంది. తేజస్వి పోయాక ఎందరో ఆమెను పెళ్ళి చేసుకునేందుకు ముందుకొచ్చారు. కొలీగ్స్, బంధువర్గంలోని వారు... ఇలా అనేకమంది ఆమె చెయ్యి అందుకునేందుకు పోటీ పడ్డారు. కాని, తన బతుకులో వెన్నెల నింపిన తేజస్వి స్థానాన్ని ఎవరికీ ఇచ్చేందుకు అంగీకరించ లేదు సుహాసిని. తన ప్రాణసఖుడికి ఎవ్వరూ కూడా ప్రత్యామ్నాయం కాబోరని భావించి వారి ప్రపోజల్స్‌ని సున్నితంగా కాదంది.

అభిజ్ఞలో తన తేజూని చూసుకుని ప్రశాంతంగా గడుపుతూ ఉంటే... అనుకోని విధంగా ఈ ఉపద్రవం వచ్చిపడింది. ఇది తననే తీరాలకి చేరుస్తుందోనని ఒకటే కంగారుగా ఉంది సుహాసినికి.

"ఇంకా రెడీ కాలేదా అమ్మా.. ఆల్‌రెడీ మూవీకి టికెట్స్ కూడా బుక్ చేసేశాను. సెవెన్ థర్టీకి షో... అప్పుడే ఫైవ్ ఫిఫ్టీన్ అయిపోయింది. పద త్వరగా రెడీ అవు" అంటూ అబిజ్ఞ పిలిచే వరకు తేజస్వి స్మృతుల్లో ఓలలాడింది సుహాసిని.

స్నానంచేసి చక్కగా తయారై ఇద్దరూ ఇల్లు విడిచారు.

గుడికెళ్ళి దర్శనం చేసుకుని అలా ఐనాక్స్‌కి వెళ్ళారు. వీళ్ళు వెళ్ళేసరికి అప్పుడే టైటిల్స్ మొదలైనాయి. సీట్ నంబర్స్ చూసుకుని కూర్చున్నారు తల్లీ కూతురు.

థియేటర్‌లో జనం పలచ పలచగా ఉన్నారు.

"సినిమా అంత హిట్ కాదనుకుంటా... చూడు హాలు సగం కూడా నిండనేలేదూ.." అందిసుహాసిని కూతురితో.

అభిజ్ఞ నవ్వుతూ "అమ్మా, అప్పుడే మూవీ రిలీజై పదిహేనురోజులైంది. మొదట్లో రోజుకి ఐదారు షోస్ వేసేస్తారు. మూడు స్క్రీన్స్ ఉన్నాయి కదా!

జనం అంతా ఎప్పుడో చూసేశారు. అందుకే హాలు ఖాళీగా ఉంది. అంతేకాని, మూవీ హిట్ కాకపోవడం ఏమీకాదు" సమాధానం చెప్పింది. '

'అవునా! ఏమోనమ్మా! నాకీ సంగతులేమీ పట్టవు! అయినా ఇన్నాళ్ళూ నువ్వు చూడలేదా?

మీ సుష్మతో కలిసి ఎప్పుడో చూసేసి ఉండాలే నువ్వూ!" అంది సుహాసిని.

"లేదమ్మా... సుష్మ ఎవరో చుట్టాలతో కలిసి వెళ్ళిందట... అందుకే నాకు చూడడం కుదరలేదు" అంది సుష్మతో తప్ప వేరే ఇతర ఫ్రెండ్స్‌తో సినిమాకి వెళ్ళడం అలవాటులేని అభిజ్ఞ చెప్పింది స్క్రీన్ మీద దృష్టిపెడుతూ.

"అందుకే... అమ్మకి ఛాన్స్ ఇచ్చావులా ఉంది" నవ్వింది సుహాసిని.



## జరిగిన కథ 7

సుహాసిని చాలా మంచిదని తనని విచారించిన ఎస్.ఐ. ధనుంజయ్, కానిస్టేబుల్ సోమయాజులకు చెబుతాడు అప్పలకొండ. తన చిన్నాన్న తనకేమన్నా బహుమతులు పంపితే ఇంట్లో మాత్రం అది సుహాసిని కొని ఇచ్చినట్లుగా చెబుతుంటుంది సుష్మ. అది పెద్ద తప్పుగా భావించదు అభిజ్ఞ.

భర్త పోయాక కంపెనీ వ్యవహారాలన్నీ చూడటం మొదలుపెడుతుంది వైశాలి. భర్త పర్సనల్ కప్‌బోర్డు లాక్ ఓపెన్ చేయాలంటే దాని 'కీ' తనవద్ద లేదని పి.ఎ.మణి, వైశాలితో చెబుతాడు. హత్యకేసులో ఇన్వెస్టిగేషన్ ముందుకు సాగడంలేదని ధనుంజయ్‌మీద మండిపడతాడు సి.ఐ. లోహితుడు.

భర్త తేజస్వి గురించిన జ్ఞాపకాలు సుహాసినిని చుట్టుముడతాయ్. అతడు తను ప్రేమించుకోవడం, పై చదువులు తనుచదవాలంటే అత్తమామలు ఒప్పుకోకపోవడం తేజస్వి, సుహాసినిని చదివించి ఓ కాలేజీలో లెక్చరర్ అయ్యేందుకు సాయపడటం అన్నీ గుర్తుకొస్తాయ్ ఆమెకు. ఇక చదవండి.

తనూ నవ్వేసి "సరేలే... మూవీ స్టార్ట్ అయింది. చూద్దామా!" అంది అభిజ్ఞ.

మరి మాట్లాడలేదు సుహాసిని.విరామ సమయంలో "అమ్మా ఆకలేస్తోంది. ఏమన్నా తినడానికి తెస్తానుండు" అంటూ లేచింది అభిజ్ఞ.

"ఇందాక సీటు దగ్గరకి ఆ కుర్రాడు ఆర్డర్ కోసం వచ్చినప్పుడు చెప్పుండాల్సింది.." అంది సుహాసిని.

"ఎందుకమ్మా... మూవీ చూస్తూవుంటే డిస్టబెన్స్. నేను వెళ్ళి పట్టుకొస్తాగా!" అంటూ చకచకా మెట్లు దిగి బయటకెళ్ళింది అభిజ్ఞ.

మందంగా వెలుగుతున్న లైట్లకాంతిలో అక్కడక్కడ కూర్చున్న జనాలని పరికిస్తున్న సుహాసిని ఒక్కసారిగా ఉలికిపడింది.

వాళ్ళకి మూడువరసల ముందుగా ఉన్న కార్నర్ సీట్‌లో కూర్చున్న యువతీయువకులపైన చూపు నిలిపింది తదేకంగా. వాళ్ళు చాలా క్లోజ్‌గా మూవ్ అవుతున్నారు. దాదాపు ఒకరిమీదకి ఒకరు ఒరిగిపోయినట్లుగా కూర్చున్నారు.

తలలు దగ్గరగా చేర్చి గుసగుసలాడుకుంటున్నట్లుగా ఉంది వారి వాలకం.

వారిలో అమ్మాయి... సుష్మ... అబ్బాయిని సుహాసిని ఇదివరకెప్పుడూ చూడలేదు. ఆ అబ్బాయి ఎవరై ఉంటాడూ అని ఆలోచిస్తూనే సుష్మని పలకరిద్దాం అనుకుంది... కాని అంతలోనే విరమించుకుంది.

తాను ఆమెని గమనించానని తెలిస్తే సుష్మ గిల్టీగా ఫీలవుతుంది. ఆమెను ఇరకాటంలో పెట్టినందువలన తనకొచ్చిన లాభం ఏమీలేదు. ఆమె పర్సనల్స్ గురించి తనకిఅనవసరం... అనుకుంటూ వాళ్ళమీద నుంచి చూపు మరల్చుకుంది.

ఇంతలో చేతిలో వెజ్ కర్రీ పఫ్స్, మిల్క్ మెయిడ్ పల్ప్ ఆరెంజ్ బాటిల్స్ ఉన్న ట్రేతో లోపలికి వచ్చింది అభిజ్ఞ. వాటిని తల్లికి అందించి, తన సీట్లో కూర్చుంది ఆమె. తాను సుష్మని చూసిన విషయం కూతురిని అడుగుదామా అనుకుని తిరిగి సినిమా మొదలవడంతో అది సమయం కాదని ఆగిపోయింది సుహాసిని.

అయినా ఇది తనకి అప్రస్తుతమైన విషయం. దీనిగురించి కూతురితో చర్చించేందుకు ఇది సమయం కాదు. కాని సుష్మ వైఖరి చూస్తేఎందుకో అనుమానాస్పదంగా అనిపిస్తోంది.



## హద్దుంటే అద్భుతం

తన కోపమే తన శత్రువు అన్న కొటేషన్ తనకు నచ్చదంటున్నది కాజల్ అగర్వాల్. పైగా కోపం కూడా మంచిదేనంటున్నది.

"కోపం ఉద్వేగంలో ఓ భాగం. కోపాన్ని దారిలో పెట్టాలన్నా కుదరడంలేదు. కొన్నిసార్లు కోపమూ మేలేచేస్తుంది. ఏదోఒక కారణంచేత ఓడిపోయినప్పుడు మనపై మనకు కోపం వస్తుంది.

ఆ కోపమే మన తప్పులు తెలుసుకునే అవకాశాన్ని నేర్పుతుంది. ఇటువంటి సందర్భాలలో మనలోని ప్రతికూలతలు బయటపడుతుంటాయి. అయితే కోపానికీ హద్దుండాలి.

ఓ స్థాయిని అస్సలు దాటకూడదు" అంటూ సుదీర్ఘ ఉపన్యాసం ఇచ్చింది. వై....?

---

ఆమె తల్లిదండ్రులకి ఈ విషయం తెలుసో లేదో... ఎందుకైనా మంచిది. సమయం వచ్చినప్పుడు కూతురిని కాస్త హెచ్చరించాలి... అనుకుని సినిమా చూడడంలో లీనమైంది. సినిమా పూర్తయ్యాక సుష్మ కోసం చూస్తే ఆమె కనబడలేదు. ముందే దాటేసినట్లుంది అనుకుంది సుహాసిని.

"రెస్టారెంట్‌కి వెళ్దామా!" అడిగింది అభిజ్ఞ.

"నాకాకలిగా లేదు అభీ... నువ్వేమన్నా తిను.."

"నాదీ సేమ్ కండిషన్ అమ్మా... ఇంటికెళ్ళిపోదాం పద" స్కూటీ స్టార్ట్ చేసింది అభిజ్ఞ.

"అవును... ఇందాక తిన్నవి ఇంకా త్రేన్పులొస్తూనే ఉన్నాయి. పళ్ళు తినేసి, కాసిన్ని పాలచుక్కలు తాగేస్తే కడుపు ఫ్రీగా ఉంటుంది" కూతురి వెనక ఎక్కి కూర్చుంది సుహాసిని. ఇంటికొచ్చాక కూడా సుష్మకి సంబంధించిన ఆలోచనలు వీడలేదు సుహాసిని మదిని. ఎందుకో ఆమె ఆ అబ్బాయితో అంతచనువుగా మూవ్ అవడం జీర్ణించుకోలేకపోతోంది ఆమె మది.

అసలు... సుష్మని చూస్తే ఎప్పుడూ ఏదోసందేహం మెదులుతూనే ఉంటుంది.

అది ఎందుకో సుహాసినికే తెలియదు. కొందరినిచూస్తే తమ ప్రమేయం లేకుండానే వారి మీద ఏదో అభిప్రాయం మదిలో ముద్రపడిపోతుంది. సుష్మని అభిజ్ఞతో సమానంగా చూసినా ఎందుకో ఆమెలో ఏదో 'అతి' కనబడుతుంది సుహాసినికి. అది ఎందుకో ఆమెకే తెలియదు. సుష్మకి, ఆ అబ్బాయికి ఉన్న స్నేహం ఎటువంటిదో ఆలోచిస్తూ ఆ రాత్రి కలత నిద్రపోయింది సుహాసిని.

"ఏమిటి సార్... అలా దిగులుగా కూర్చున్నారూ!" ఫ్లాస్క్‌లోనుంచి టీ కప్పులోకి పోసి ధనుంజయ్‌కి అందించాడు సోమయాజులు.

అభావంగా అతడివైపు చూసి "బుర్ర పిచ్చెక్కిపోతోంది యాజులుగారూ! ఈ సత్యకుమార్ కేసు తలనొప్పిగా మారింది. ఏ ఆధారాలూ దొరకడంలేదు. అతడి ఫోన్ ట్రేస్ చేసినా ఫలితం లేకపోయింది" అంటూ కప్పు అందుకున్నాడు ధనుంజయ్.

"ఒకవేళ అతడికి వేరే పర్సనల్ ఫోన్ నెంబర్ ఏదైనా ఉండేమో!" అనుమానం వెలిబుచ్చాడు సోమయాజులు. ధనుంజయ్ ముఖంలోకి వెలుగొచ్చింది. "అవునుస్మీ... నాకా థాట్ రానేలేదు" అన్నాడు సోమయాజులు వైపు మెచ్చుకోలుగా చూస్తూ.

"ఇప్పుడు అందరూ రెండో, మూడో నెంబర్స్ మెయింటెన్ చేస్తున్నారు కద సార్.. అందులోనూ ఈయన బిజినెస్ మ్యాన్. ఖచ్చితంగా వేరే పర్సనల్ నెంబర్ ఉండి తీరుతుంది.

నాకు తెలిసి ఇలాంటి బిజీ బిజినెస్ పీపుల్ అఫీషియల్ వ్యవహారాలకి వేరే నెంబర్, వ్యక్తిగతంగా వేరే నెంబర్ వాడుతూ ఉంటారు. ఈ విషయమై వైశాలి గారిని అడిగితే తెలిసిపోతుంది" అని ఉత్సాహంగా సూచించాడు సోమయాజులు.

**మన గుండె ఒక గుడి. దేవుణ్ణి ప్రతిష్ఠించవలసింది అక్కడే. మంచి ఆలోచనలు ఆయనకు మనం అర్పించే పుష్పాలు. మంచి పనులు పూజ. మంచి మాటలు పాటలు. ప్రేమ నైవేద్యం.**

"యు ఆర్ కరెక్ట్ యాజులుగారూ.. మంచి హింట్ ఇచ్చారు. వెంటనే వెళ్ళి వైశాలిగారిని అడుగుదాం" అంత వేడి టీ ఒక్క గుక్కలో తాగేసి హుషారుగా కుర్చీలో నుంచి లేచి బయటికి నడిచాడు ధనుంజయ్ సోమయాజులుతో సహా.

"ఫోన్ చేసి అడిగితే సరిపోతుందేమో సార్" బైక్ ఎక్కి కూర్చోబోతున్న సోమయాజులు సందేహంగా అడిగాడు. "ఫోన్లో ఎన్నని అడుగుతాం యాజులు గారూ... ముఖాముఖి అయితే చర్చించేందుకు బాగుంటుంది" మరో మాటకు తావివ్వకుండా బైక్ స్టార్ట్ చేశాడు ధనుంజయ్.

"అమ్మగారు ఇంటిదగ్గర లేరు సార్" గేటు దగ్గరే చెప్పేశాడు వైశాలి ఇంటి వాచ్‌మాన్.

"ఎక్కడికెళ్ళారు?" అడిగాడు సోమయాజులు.

"వారం రోజుల్నుండి అమ్మగారు ఆఫీసుకి వెళ్తున్నారు సార్" వినయంగా చెప్పాడు వారెవరో తెలిసిన వాచ్‌మాన్. "ఓకే.. థాంక్ యూ" అంటూ సత్యా ఇండస్ట్రీస్‌వైపుగా బైక్ పోనిచ్చాడు ధనుంజయ్.

అక్కడికి నాలుగు కిలోమీటర్ల దూరంలో సిటీ ఔట్ స్కర్ట్స్‌లో ఉంది ఆ కంపెనీ. అది ఒక ఆటోమొబైల్ కంపెనీ. వివిధ రకాల వాహనాలకి స్పేర్‌పార్ట్స్ తయారుచేసి అమ్ముతూ ఉంటారక్కడ.

కేవలం వాళ్ళ స్వంత తయారీని మాత్రమే కాక ప్రముఖ బ్రాండెడ్ కంపెనీల స్పేర్ పార్ట్స్‌ని కూడా మార్కెట్ చేస్తూ ఉంటారు.

కాలుష్యానికి కాస్త దూరంగా, ప్రశాంత వాతావరణంలో ఉన్న ఆ కంపెనీని చూసి ఆశ్చర్యపోయాడు ధనుంజయ్. గేటుదగ్గరున్న సెక్యూరిటీకి ఐడెంటిటీ చూపించి లోపలికి వెళ్ళారు.

గేటు దగ్గరనుంచి లోపలికి దాదాపు ఒక కిలోమీటర్ దూరం ఉంటుంది. చక్కని సిమెంట్ రోడ్డుకి ఇరుపక్కలా నాటిన రకరకాల చెట్లు. పచ్చదనంతో పాటు పర్యావరణానికి దోహదపడే విధంగా చల్లని గాలిని పంచుతున్నాయి.

కంపెనీ బిల్డింగ్‌కి చుట్టూ చిన్న సైజు పూలతోట పెంచారు. రంగురంగుల పూలబాలలు కళ్ళకూ, మనసుకూ కూడా విందు చేస్తున్నాయి.

ఆహ్లాదకరమైన ఆ వాతావరణాన్ని చూసి సత్యకుమార్ అభిరుచిని ప్రశంసించకుండా ఉండలేకపోయాడు ధనుంజయ్.

అప్రయత్నంగా వైశాలి మాటలు గుర్తొచ్చాయి. తన భర్త సౌందర్యారాధకుడంటూ ఆమె చేసిన వ్యాఖ్య తలపులలో మెదలగానే.... అవును... సత్యకుమార్ నిజంగానే సౌందర్య పిపాసి. అది ఈ తోట చూస్తేనే తెలుస్తోంది.

పూలన్నా, సుమసుకుమారులయిన స్త్రీలన్నా అతడికి బహు మక్కువ' అనుకున్నాడు ధనుంజయ్ తనలో తనే.

అతడేదో అంటున్నట్లుగా వినిపించిన సోమయాజులు "ఏంటి సార్" అన్నాడు ధనుంజయ్ భుజంమీదుగా ముందుకు వంగుతూ.

"ఏం లేదు యాజులుగారూ... ఏదో గుర్తొస్తేనూ" సన్నగా నవ్వాడు ధనుంజయ్.

నాలుగంతస్తుల ఆ ఆఫీసు భవంతి ముందు బైక్ ఆపాడు. సోమయాజులు నెమ్మదిగా దిగాడు. ధనుంజయ్ కూడా దిగి బైక్ ఓపక్కగా పార్క్ చేసి ఆ బిల్డింగ్ లోపలికి అడుగుపెట్టాడు.

సెంట్రలైజ్డ్ ఏసి చేయబడిన ఆ భవనంలోకి కాలు పెట్టగానే చల్లగా తాకింది కండిషన్లో పెట్టబడిన గాలి. లోపలంతా మోడ్రన్‌గా ఇంటీరియర్ డిజైన్ చేయబడి అత్యాధునికంగా ఉంది. రిసెప్షన్ దగ్గరకివెళ్ళి అక్కడ కూర్చున్న అమ్మాయి దగ్గరకి వెళ్ళి తానెవరో చెప్పి లోపలికి పంపమన్నాడు ధనుంజయ్.

ఆమె ఇంటర్‌కమ్‌లో మణిని పర్మిషన్ అడిగి 'వెళ్ళండి సార్... మేడమ్ మిమ్మల్ని రమ్మన్నారు" చెప్పింది వినయంగా. సత్యకుమార్ రూమ్‌లోకివెళ్ళారు ఇద్దరూ. చక్కగా అధునాతనమైన ఫర్నిచర్‌తో, చుట్టూ గాలికి చిన్నగా ఎగురుతున్న లేతరంగు పరదాలతో అలంకరించబడిన ఆ గది కూడా సత్యకుమార్ టేస్ట్‌ని ప్రతిబింబిస్తోంది.

"అర్ధాయుష్షుతో పోయాడుకాని, జీవితాన్ని వర్ణభరితం చేసుకొని, ఆనందించే మనస్తత్వం ఉన్నవాడు" జాలిగా అనుకున్నాడు ధనుంజయ్.

"నమస్తే ఎస్సై గారూ... రండి" సాదరంగా ఆహ్వానించింది వైశాలి వాళ్ళని చూసి.

"నమస్తే మేడమ్... ఎలా ఉన్నారు?" అడిగాడు ధనుంజయ్ పలకరింపుగా నవ్వి.

"ఎలా ఉంటాను... బలవంతంగా ప్రాణం తీసుకునే ధైర్యంలేక, ఇలా జీవచ్ఛవంలాగా బతుకీడుస్తూ" పేలవంగా నవ్వింది వైశాలి. ఆమె కళ్ళలో నీళ్ళూరాయి. చనిపోయిన భర్తని తలచుకుని కాబోలు...

"సారీ మేడమ్..." అపాలజిటిక్‌గా చెప్పాడు ధనుంజయ్. "ఇట్స్ ఓకే... ఏమిటిలా వచ్చారు? ఎనీ ప్రోగ్రెస్?" అడిగింది వైశాలి హ్యాండ్ కర్చీఫ్‌తో తడి కళ్ళని సుతారంగా ఒత్తుకుంటూ. విశాలమయిన ఫాలభాగాన కనీకనిపించకుండా పెట్టుకున్న చిన్ని బిందువులాంటి నల్ల స్టిక్కర్... కోల్పోయిన ఆమె సౌభాగ్యాన్ని చాటిచెప్తోంది.

భర్తమీద బెంగతో ఆమె ఎంతగా అల్లాడుతున్నదీ పాలిపోయిన ఆమె ముఖం చెప్తోంది. లేత కోరారంగు బెంగాల్ కాటన్ చీరలో అఫీషియల్ లుక్‌తో ఎంతో హుందాగా కనిపిస్తోంది.

అయినా సౌభాగ్యం కొరవడిన మోములో ఏదో దీనత్వం కొట్టొచ్చినట్లుగా గోచరిస్తోంది.

స్త్రీకి కట్టుకున్నవాడే సర్వస్వం కదా! అతడిని కోల్పోయాక ఆమె నిజంగానే నిర్భాగ్యురాలు... అనుకున్నాడు ధనుంజయ్ ఆమెవైపు చూస్తూ.

"ఏమీ లేదు మేడమ్... మీరు అనుమానించారని సుహాసిని గారిని ఇంటరాగేట్ చేశాము.

బట్ ఆమె అసలు సత్యకుమార్‌గారితో తనకి పెద్ద పరిచయమే లేదని చెప్తున్నారు... ఆమెఉంటున్న చోటుకెళ్ళి ఎంక్వయిరీ చేశాము. అక్కడున్న సెక్యూరిటీ ఆమె చాలా మర్యాదస్తురాలని, ఎవరినీ నొప్పించే మనస్తత్వం ఆమెకు లేదని చెప్తున్నాడు.

సత్యకుమార్ గారు అక్కడికెళ్ళిన మాట వాస్తవమే కాని, ఖచ్చితంగా సుహాసిని గారి ఇంటికి వెళ్ళారని ఖచ్చితమైన ఆధారాలు లేవు... అసలు... అతడు అక్కడికి వెళ్ళేసరికి ఆమె కాలేజీకి వెళ్ళిపోతుందని సెక్యూరిటీ చెబుతున్నాడు" విరామం కోసమని ఆగాడు ధనుంజయ్.

"మరి! అక్కడున్న రిజిస్టర్‌లో ఆయన సుహాసిని ఇంటికే వెళ్ళారని నోట్ చేశారు కదా!" అయోమయంగా అడిగింది వైశాలి. "అదే అర్థంకావడంలేదు మేడమ్... పైగా సుహాసిని గారు కూడా చెప్పారు...

ఆరోజు షాపింగ్‌మాల్‌లో పరిచయమైన తరువాత సత్యకుమార్ గారిని తన అపార్ట్‌మెంట్ గేటుదగ్గరే మళ్ళీ చూశానని, ఆయనంతట ఆయనే పలకరిస్తే మొహమాటానికి మాట్లాడి వెళ్ళిపోయానని ఆవిడ కన్ఫర్మ్‌గా చెప్తున్నారు.

అంతకుమించి ఆయన్ను కలవడంకాని, మాట్లాడడం కాని చేయలేదని ఆవిడ చెప్పారు"

వైశాలి ముఖం వెలవెలబోయింది. మరి సుహాసిని ఇంటికి కాకపోతే తన భర్త అక్కడికి ఇంకెందుకు వెళ్తున్నట్లు! అక్కడ ఆయనకి వేరే ఇతర పరిచయస్తులున్నారా? అలాంటప్పుడు రిజిస్టర్‌లో వాళ్ళపేరు రాయక సుహాసిని పేరు, ఫ్లాట్ నెంబరూ ఎందుకు రాసినట్లు! ఇదేదో గజిబిజి గందరగోళంలా అనిపిస్తోంది చూడబోతే.

"మీరు అనవసరంగా సుహాసిని గారిని సస్పెక్ట్ చేస్తున్నారేమో మేడమ్..." ధనుంజయ్ పరిశీలనగా వైశాలి ముఖంలోకి చూశాడు.

"మేబి... కాని, ఆ రోజు నేను విన్నదాన్ని బట్టి తనని సందేహించక తప్పలేదు. నా భర్తని అంత దారుణంగా చంపాల్సిన అవసరం ఎవరికుంటుందీ అని ఆలోచిస్తున్నా!" వైశాలి నొసలు ముడిపడింది ఒక్కసారి.

"బాగా గుర్తు చేసుకోండి మేడమ్... సార్‌మీద ద్వేషం ఉన్న వ్యక్తులెవరన్నా మీ దృష్టిలో ఉంటే మాకు చెప్పండి" అన్నాడు ధనుంజయ్.

"ఇంపాజిబుల్... నాకు తెలిసి సార్‌కి శత్రువులు లేరు. ఆయన్ని అందరూ ఇష్టపడతారే తప్ప ఎవరూ ద్వేషించరు" నమ్మకంగా పలికింది వైశాలి.

భర్తమీద ఆమెకు గల విశ్వాసానికి అబ్బురపడ్డాడు



కమ్యూనిస్టులు సిద్ధాంతాలను ఏనాడో గంగలో కలిపారు.... ఇప్పుడు వారికి సిద్ధాంతం అంటూ ఏదీ లేదు.

-నాయిని నరసింహారెడ్డి, తెలంగాణ మంత్రి

## వెబ్‌సిరీస్‌కే మొగ్గు

డిజిటల్ ప్లాట్‌ఫారమ్స్ ఆఫర్ చేస్తున్న అవకాశాలపట్ల ఎగ్జయిట్ అవుతున్నానంటున్నది అనుష్క శర్మ. "డిజిటల్ మాధ్యమం చాలా ఎగ్జయిటింగ్ వేదిక అయింది. పరిశ్రమలోనివారికి ఎన్నో అవకాశాలు లభిస్తాయి.

సినిమాలో వర్క్ వుట్ కాని అనేక అంశాల్ని ప్రేక్షకులూ తెలుసుకునే అవకాశం లభిస్తున్నది.నాకు డిజిటల్ స్పేస్ అంటే ఇష్టం. సినిమాలకంటే వెబ్ సిరీసే ఎక్కువగా చూస్తుంటాను.

త్వరలో డిజిటల్ కంటెంట్ నిర్మించాలన్న ప్లాన్‌లో వున్నాం" అని చెప్పింది.



ధనుంజయ్. "మీరే చెప్పారుకదా మేడమ్... ప్రతి వ్యక్తిలోనూ మనకి తెలియని ఇంకో కోణమేదో ఉండవచ్చునని. బహుశా ఆ కోణంలో నుంచి చూస్తే ఎవరన్నా... కనిపించవచ్చేమో!" చిన్నగా నవ్వాడు సత్యకుమార్.

వైశాలి అతడిని ఖండించలేదు. ఏదో ఆలోచనలో పడినట్లుగా టేబుల్ మీద చిన్నగా వేళ్ళతో తడుతూ ఉండిపోయింది. ఇంతలో ఆ గదిలోకి మణి వచ్చాడు ఏదో పని మీద. అక్కడ కూర్చుని ఉన్న ఎస్సై ధనుంజయ్‌ని, సోమయాజులుని గమనించి సంశయంగా వైశాలివైపు చూశాడు.

వైశాలి క్లుప్తంగా వారిని పరిచయం చేసింది.

"ఎస్సైగారూ... ఈయన మణి... మా వారికి కుడి భుజం అనదగ్గ నమ్మకస్థైన వ్యక్తి. మా కంపెనీ ఇంత బాగా రన్ అవడం వెనక ఈయన కృషి ఎంతైనా ఉంది" చెప్పింది మణిని ధనుంజయ్‌కి పరిచయం చేస్తూ. "గ్లాడ్ టూ మీట్ యు..." చేయిచాచాడు ధనుంజయ్. మణి అతడి చేతిలో చేయి కలిపి కరచాలనం చేశాడు.

చూడడానికి పద్ధతిగా ఉన్న మణి ధనుంజయ్‌కి నచ్చాడు. నుదుట నిలువుగా తీర్చిదిద్దిన తిరు నామం, తమ యజమానురాలి పట్ల అతడు కన బరుస్తున్న గౌరవం... ఇవన్నీ మొదటి పరిచయం లోనే అంచనా వేశాడు.

ఇతడిని కూడా ఇంటరాగేట్ చేస్తే ఏమన్నా విష యం దొరకవచ్చు... అనుకున్నాడు ధనుంజయ్.

"మణిగారూ... దయచేసి ఒక్క పదినిమిషాలు బయటికి వెళ్తారా? నేను పిలిచేవరకు మళ్ళీ రావద్దు ప్లీజ్" చెప్పింది వైశాలి అధికారం ఉట్టిపడేస్వరంతో.

"అలాగే మేడమ్" అన్నాడు మణి వినయంగా.

"ఆ... వీళ్ళకి మంచి కాఫీ పంపించండి" వెళ్ళ బోతున్న మణితో చెప్పింది వైశాలి. అలాగేనంటూ తల ఊపి వెళ్ళిపోయాడు మణి.

"మీరు శత్రువుల విషయం ప్రస్తావించారు కాబట్టి మీకో విషయం చెప్పితీరాలి. మావారికి బంధువులంటే అంతగా గిట్టదు.

వారి ఉనికిని సహించలేకపోయేవారు. మా మామగారు తన స్వంత తమ్ముడి వలన పొందిన పరాభవమే అందుకు కారణం.

చిన్నతనంలోనే మా మామగారి తల్లిదండ్రులు చనిపోతే... తనకున్నదంతా ఊడ్చిపెట్టి తమ్ముడిని ఎంతో శ్రద్ధగా సాకారట మా మామగారు.

తీరా ఆయన ప్రాజ్ఞుడైనాక కుటుంబాన్ని గాలి కొదిలేసి తన దారి తాను చూసుకున్నాడట. ఆ తరు వాత పిల్లలని పెంచడానికి మా మామగారు నానా అగచాట్లు పడ్డారట.

మా వారు తన స్వశక్తిని నమ్ముకుని ఈ కంపెనీని ప్రారంభించి, తన కాళ్ళమీద తాను నిలబడి పది మందికి ఉపాధి కల్పించారు.

చెల్లెలికి పెళ్ళిచేసి, అత్తవారింటికి పంపారు. కేవలం తన స్వంత ప్రతిభతో అంచెలంచెలుగా ఎదిగి ఈ స్థాయికి చేరుకున్నారు.

చెరువులో నీళ్ళుచేరినప్పుడు కప్పలు కుప్పలుగా చేరడం సహజమే కదా! సరిగ్గా ఇక్కడా అదే జరిగింది. ఎప్పుడైతే మా ఆయన ఆర్థికంగా ఎదిగారో అప్పుడు మా ఇంటికి రాకపోకలు ప్రారంభించారు మా చిన్న మామగారు. మావారికి అది నచ్చలేదు.

కష్టకాలంలో తమ కుటుంబాన్ని గాలికొదిలేసి స్వార్థపూరితంగా ప్రవర్తించిన ఆయన తాను డబ్బున్నవాడు కాగానే బంధుత్వాలు కలుపుకొని మళ్ళీ మా ఇంటకాలుపెట్టడం ఆయన సహించ లేకపోయారు.

ఏనాడో తెగిపోయిన చుట్టరికాలు తిరగతోడుకుని తనతో సంబంధం పెట్టుకోవడం తనకు ఇష్టంలేదని, ఇంకెప్పుడూ మా ఇంటిగడప తొక్కవద్దని చాలా ఘాటుగా హెచ్చరించారు.

దానితో మా చిన్నమామగారు తోకతొక్కిన తాచే అయ్యారు. ఆస్తి రాగానే మా ఆయనకి కళ్ళు నెత్తి కెక్కాయని, అందుకే పెద్దవాడన్న గౌరవం లేకుండా అలా పేలిపడుతున్నారని, ఇంకా ఇలాగే... నానా దుర్భాషలూ ఆడి ఆయన్తో గొడవపెట్టుకున్నారు.

ఒళ్ళు మండి మావారు ఆయన్ని మెడపట్టి బయ టకి గెంటేశారు. అందరిముందూ జరిగిన ఈ పరా భవానికి మా చిన్నమామగారు అవమానంతో రగిలి పోయారు.

'నన్ను ఇంతగా ఇన్సల్ట్ చేసిన నీ అంతు చూస్తా' నని ప్రతిజ్ఞ చేసి మా ఇంట్లో నుంచి వెళ్ళిపోయారు. ఇది జరిగి సుమారు ఒక ఏడాదౌతోంది. అప్పటినుంచి ఆయన మా కళ్ళకి కనిపించలేదు. కాని, ఇప్పుడు జరిగినదాన్నిబట్టి చూస్తే ఆయనే మా వారిని చంపిం చాడేమోనని అనుమానం వస్తోంది.

ఇంకా ఉంది



పాకిస్తాన్ ప్రభుత్వం నడవటానికి అవసరమైన డబ్బు ప్రభుత్వం దగ్గర లేదు. దేశం తీవ్ర ఆర్థిక సంక్షోభంలో వుంది.

-ఇమ్రాన్‌ఖాన్, పాకిస్తాన్ ప్రధాని

# ఓల్డ్ ఈజ్ గోల్డ్



ఒక సమస్యను పరిష్కరించామనుకునేలోగా పరిష్కరించిన సమస్య నుండి మరో కొత్త సమస్య తలెత్తుతుంటుంది.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత మానవ ఆరోగ్యంమీద దృష్టి పెట్టారు. పలురకాల రోగాలు, పరిష్కారం కనిపించని ప్రాణాంతక వ్యాధుల బారి నుండి మనిషిని రక్షించాలనుకున్నారు. అందులో విజయం సాధించారు.

ఆరోగ్యం మెరుగుపడింది, అర్ధాంతర మరణాలు ఆగాయి, ఆయుర్దాయం పెరిగింది. మనిషి ఎక్కువ కాలం జీవించగలుగుతున్నాడు.

అరవైల్లోకి వచ్చేసరికి జనాభా ఎదుగుదలను ఒక సమస్యగా గుర్తించి దాని పరిష్కారంకోసం కుటుంబ నియంత్రణ పథకాలను అమలుచేశారు.

అదీ విజయవంతమయింది. బహు సంతానం పోయి ఒకరిద్దరితో సరిపెట్టుకున్నారు.

జనాభా ఎదుగుదలను అరికట్టగలిగారు. రెండు కీలక సమస్యల్ని పరిష్కరించామని ప్రపంచ సంస్థలు గర్వపడుతుండగా ఆ రెండు సమస్యలనుండి మరో సమస్య ముందుకొచ్చి నిలబడింది. అదే వయసు మళ్ళినవారి సమస్య.

వయోధికుల సమస్య అంతర్జాతీయ సమస్యగా మారుతున్నదని 1982లో ప్రపంచ వయోధికుల సమావేశం నిర్వహించి 'ఇంటర్నేషనల్ ప్లాన్ ఆఫ్ యాక్షన్ ఆన్ ఏజింగ్'పై ఒక తీర్మానం చేశారు.

వయోధికులకు ఎదురవుతున్న సమస్యలు శారీరక, మానసికపరమైనవి. సంరక్షణ చాలా కీలకం. సంక్షేమం, ఆదరణ అంశాలు కూడా ఆలోచించాల్సినవి. వీటన్నిటినీ కలిపి ఐక్యరాజ్యసమితి 1991లో వయోధికుల సమస్యలపై ఒక కార్యాచరణకు సంబంధించిన ఒక సిద్ధాంత పత్రాన్ని ఆమోదించింది.

ఆ తీర్మానం ప్రకారం ప్రపంచ వయోధికుల దినోత్సవం జరిపి వారి సమస్యలను అన్ని దేశాల వారూ గుర్తించేలా చేయాలన్నారు.

1990లో ఐక్యరాజ్యసమితి **అక్టోబర్ 1ని అంతర్జాతీయ వృద్ధుల దినోత్సవంగా** ప్రకటించింది.

1991 నుండి ఆ దినోత్సవాన్ని ప్రపంచం జరుపుకుంటున్నది. వృద్ధుల దినోత్సవంనాడు విశ్వవ్యాప్తంగా పెద్దల్ని గౌరవించే పలు కార్యక్రమాలు నిర్వహిస్తారు.

ప్రభుత్వాలు తమ దేశ సీనియర్ సిటిజన్స్‌కి సంబంధించిన కొత్త విధానాలు, ప్రోత్సాహకాలు ప్రకటిస్తుంటాయి. ఈ దినోత్సవ సందర్భంగా పలు సభలు, సదస్సులు నిర్వహిస్తూ వయోధికుల సమస్యలు, సంక్షేమం, పరిరక్షణలపై వివిధ స్థాయిలలో చర్చించటం జరుగుతుంది.

సమాజ సంక్షేమంకోసం, అభివృద్ధికోసం కృషి చేసిన పలువురు సీనియర్ సిటిజన్స్‌ని పురస్కారాలతో సత్కరిస్తారు. తరాంతరం అనేది పెద్ద సమస్య. పాత తరంవారికి, కొత్త తరంవారికి మధ్య ఎడం పెరుగుతున్నది. ఒకప్పుడు ఇంట్లోని పెద్దల నీడలో పిల్లలు పెరిగేవారు. మనుమలు, మనుమరాళ్ళదే లోకంగా తాతలు వుండేవారు.

అది కొత్త తరం, పాతతరం మధ్య ప్రేమానుబంధాలు పెరగటానికి దోహదం చేసేది. కాని క్రమంగా ఉమ్మడి కుటుంబాలు పోయి చిన్న కుటుంబాలు, చిన్న ఇళ్ళలో పెద్దలకు స్థానం తగ్గిపోయింది.

వయోధికులు ఇంటిలోని వసతులకు అడ్డంకి అయ్యారు. వారి నీడ పిల్లలమీద పడటానికి ఇష్టపడటంలేదు. పెద్దల మాటలు చాదస్తంగా పరిగణించి వారిని దూరంగా వుంచుతున్నారు.

వయసు పెరిగి ఒంటరివారవుతున్నారు వయోధికులు.తరాల మధ్య అంతరం తగ్గించకపోతే వయోధికుల బాధ్యతనుండి కుటుంబాలు తప్పించుకుంటాయి. అప్పుడు మానవతా దృక్పథంతో వయోధికుల భారం సామాజిక కార్యకర్తలు లేదా ప్రభుత్వం భరించాల్సివస్తుంది.

ఇది ఆర్థికపరమైన భారమే కాదు, సమాజంలో మానసిక అనారోగ్యం పెరుగుదల అంశం అవుతుంది. వయోధిక జనాభా పెరుగుదలవల్ల ఉత్పన్నమయ్యే సవాళ్ళను ఎలా అధిగమించాలనేది నేటి ప్రపంచ సమస్య. వయోధికుల రెండవ ప్రపంచ మహాసభ 2002లో మ్యాడ్రిడ్‌లో జరిగింది.

21వ శతాబ్దంలో సరికొత్త సవాలుగా వయోధికుల సమస్యను గుర్తించారు. సమాజంలోని అన్ని వయసులవారికీ ఆరోగ్య, ఆర్థిక అవకాశాలు సమానంగా కల్పించాలన్న తీర్మానం ఆమోదించారు.

వయసులో వుండగా వారు చేసిన సేవలను గుర్తించి, వయసు మళ్ళినవారిని ఆదరించాల్సిన,వారి సంక్షేమం ఆలోచించాల్సిన ఆవశ్యకతను గుర్తుచేశారు. జనాభా పెరుగుదల ఒక రకమైన సమస్య అయితే, వయోవృద్ధుల జనాభా పెరుగుదలతో సరికొత్త సమస్యలు, సవాళ్ళు ఎదురవుతున్నాయి.

వాటిని అర్థంచేసుకునే తీరిక కొత్తతరానికి కనిపించటంలేదు. తామూ ఒక సమయానికి వయోవృద్ధులవుతామన్న ఆలోచన వారికి వుండటంలేదు.

ఒకప్పుడు తమ పెద్దలను చూసుకోవటం సామాజిక బాధ్యత.కుటుంబంలో నిర్లక్ష్యానికి గురైన పెద్దలు కనిపిస్తే సమాజమంతా ఏకమై పిల్లలకు బుద్ధి చెప్పేది. అటువంటి సామాజిక ఒత్తిడి నేడు లేదు. ఫలితంగా సామాజిక బాధ్యత స్థానంలో చట్టపరమయిన బాధ్యతగా తీసుకురావాల్సివచ్చింది.

తమను పట్టించుకోని పిల్లలమీద కోర్టుకు ఎక్కే అవకాశం పెద్దలకు కల్పించారు. తల్లిదండ్రులను నిర్లక్ష్యం చేసేవారిని శిక్షించే చట్టం వచ్చింది.

అత్త-మామలను కూడా చూసుకోవాల్సిన బాధ్యత మీదే అంటూ యువతీ యువకులకు దిశానిర్దేశనం చేసింది న్యాయస్థానం. దేశవ్యాప్తంగా ఎల్డర్స్ క్లబ్స్‌ని ఏర్పాటుచేస్తున్నారు. సీనియర్ సిటిజన్స్ హక్కుల గురించిన ప్రచారం చేస్తున్నారు. ఆ క్లబ్‌ల ఆశయాలు, నిర్వహణ ఉదాత్తంగా వుండాలని నిర్ణయించారు.

వృద్ధుల దినోత్సవంనాడు సీనియర్ సిటిజన్స్, పెన్షనర్స్ అసోసియేషన్లు పలుసంక్షేమ, స్ఫూర్తిదాయక కార్యక్రమాలను చర్చించి, చేపట్టనున్నారు.

ఆర్.డి.ఎస్.ప్రకాష్

# కదిలే బొమ్మల కబుర్లు

Review 

## నన్ను దోచుకుందువటే

### సరదా... సరదా ప్రేమకథ

విషయం పాతదే కావచ్చు. కానీ విశ్లేషణ కొత్తగా ఉండాలి. అప్పుడే ఆసక్తిగా ఉంటుంది. అందులోనూ పాతవాటినే కొత్తగా ప్రెజెంట్ చేస్తున్న కాలం ఇది.

సినిమా కూడా ఇందుకు మినహాయింపు కాదు. నిన్నటివరకు చూసిన సినిమాలు వేరు. ఇప్పుడు చూస్తున్న సినిమాలు వేరు. ఈ కాలం కుర్రాళ్ళకు నచ్చేలా, మన కళ్ళ ముందున్న ప్రపంచం ఎలా ఉందో అలా, మెలోడ్రామాను పక్కనపెట్టి నాటకీయతను దరిచేరనివ్వకుండా పక్కా క్యాజువల్‌గా ఉండే సినిమాలు తయారవుతున్నాయి.

అయితే ఇందుకోసం కొత్త సబ్జెక్ట్‌కోసం కిందా మీదా అయిపోనడం లేదు.

పాత విషయాలనే కొత్తగా చెప్పాలని, చూపించాలని అనుకుంటున్నారు. ఈ వారం విడుదలైన 'నన్ను దోచుకుందువటే' ఈ కోవకు చెందిన సినిమానే.

కెరీర్‌మాత్రమే ప్రాణం, కెరీర్‌లో ఉన్నత శిఖరాలు అధిరోహించాలి, ఆ క్రమంలో పని, పని, పని తప్ప వేరే ధ్యాసలేని కుర్రాడు, తన అవసరంకోసం ప్రేమలో పడితే... అన్నది సినిమా కాన్సెప్ట్.

హీరో సుధీర్‌బాబు నటించి, నిర్మించిన ఈ సినిమాతో ఆర్ ఎస్ నాయుడు దర్శకుడిగా పరిచయం అయ్యాడు. నభా నటేష్ హీరోయిన్‌గా పరిచయం అయిన ఈ సినిమా కథేంటంటే...

కార్తీక్ (సుధీర్‌బాబు) ఓ ఐటి కంపెనీలో మేనేజర్. మహాస్ట్రిక్ట్. కిందవాళ్ళను పని పని అంటూ రాచి రంపాన పెడుతుంటాడు. మాట్లాడితే ఊస్టింగ్

నన్ను దోచుకుందువటే



అంటుంటాడు. అలాంటి వ్యక్తికి పెళ్ళి సమస్య అవుతుంది. తండ్రి (నాజర్) తన బావమరిది కూతురిని చేసుకోమంటాడు. దాన్ని తప్పించుకోవడం కోసం ఎవర్నో ప్రేమించా అంటాడు.

సిరి అనే అమ్మాయి పేరు చెబుతాడు. అయితే చూపించు అంటే షార్ట్ ఫిలింస్‌లో హీరోయిన్‌గా నటించే మేఘన (నభా నటేష్)ను లవర్‌లా నటించమని తెరపైకి తెస్తాడు. కానీ అంతలోనే మేఘన అంటే విపరీతంగా ఆకర్షితుడై ఉద్యోగాన్ని నిర్లక్ష్యం చేసే పరిస్థితి వస్తుంది. అప్పుడు తన దారి మళ్ళీ





### ఎంతో పరిణతి

'నర్తనశాల'లో బాగా నటించిందన్న మంచి మార్కులు పొందిన యామినీ భాస్కర్ 'భలే మంచి చౌక బేరమ్' అనబోతున్నది.

"నిజానికి 'నర్తనశాల' కంటే ముందే చేసిన సినిమా ఇది. ఒక్కో సినిమాలో కొత్త విషయాలు నేర్చుకుంటున్నాను. అన్నిరకాల పాత్రలూ చేయాలన్నది నా కోరిక. ఇప్పటికి తమిళంతో కూడా కలిపి నాలుగు సినిమాలు చేశాను. వృత్తిపరంగానూ, వ్యక్తిగతంగానూ కూడా ఎంతో పరిణతి సాధించాను. నా దృష్టిలో కథ బావుంటే అన్నీ బావున్నట్లే" అంటోంది. ◆

గుర్తుకువచ్చి మేఘనకు దూరమవుతాడు.

కానీ మళ్ళీ మేఘన లేకుండా ఉండలేనని గుర్తుకు వచ్చి, దగ్గర కావాలనుకుంటే, ఆమె అతనికి దూరం జరిగే పరిస్థితి వస్తుంది. ఇలా రకరకాల ఒత్తిడులకు గురైన కార్తీక్-మేఘనల ప్రేమ చివరకు ఏ తీరానికి చేరింది అన్నది మిగిలిన సినిమా.

ముందే చెప్పుకున్నట్లు కొత్త కథ. కొత్త క్యారెక్టర్లు కావు. కానీ దర్శకుడు తీసిన తీరు కొత్తగా ఉంది. ఇంకా చెప్పాలంటే, ఈ జనరేషన్‌కు తగినట్లు ఉంది. ఈ జనరేషన్‌కు ఎక్కువగా పట్టే సాఫ్ట్‌వేర్, షార్ట్ ఫిలిమ్ నేపథ్యాలు తీసుకోవడంతోనే దర్శకుడు చాలా వరకు కొత్తదనం సాధించేశాడు.

ఈ రెండు రంగాల్లో ఎక్కడ ఫన్ జనరేట్ అవుతుందో చూసుకుంటూ ముందుకు సాగాడు. అందువల్లసినిమా ఆద్యంతం నవ్వులు పూయిస్తూఉంటుంది. దీనికి అదనపు బలంగా తండ్రీకొడుకులమధ్య అనుబంధం, అక్కడ ఒకటి రెండు చిన్న ట్విస్ట్‌లు.

అమ్మేసిన పొలందగ్గర ఎందుకు కూర్చుంటున్నాడన్న విషయంలో కొడుకు ఆలోచన వేరు.

కొడుకు ఎందుకు అంత కష్టపడుతున్నాడు, అమెరికాపై మోజు ఎందుకు పడుతున్నాడన్న దాంట్లో తండ్రి యోచన వేరు.

ఈ రెండు పాయింట్లు అసలు కీలకమైనవి. మిగిలినదంతా పాత కథనే,కొత్తగా చెప్పడం. అయితే దర్శకుడు ఈ రెండు పాయింట్లనే, మరింత బలంగా ప్రెజెంట్ చేసివుంటే ఇంకా బాగుండేది.

అమ్మ లేక నాన్న నవ్వు వెలసిపోయిందికానీ, ఆస్తి లేక కాదు అన్న పాయింట్, అమెరికా కాదు లక్ష్యం నాన్నకు దగ్గరగా ఉండడం అన్నది కీలకం అన్న పాయింట్ రెండూ కూడా మరింత బలంగా చెపితే సినిమా మరింత హత్తుకునేది.

సినిమా తొలిసగం అంతా చకచకా సాగిపోతుంది. దర్శకుడికి వున్న సెన్సాఫ్ హ్యూమర్ చాలా బాగా వర్కవుట్ అయింది.

సినిమాను ఆద్యంతం చలాకీగా, తేలికపాటి హాస్యంతో నడిపాడు దర్శకుడు. సినిమా ద్వితీయార్థం లోకి ప్రవేశించాక, నడక కాస్త నెమ్మదించింది. పెద్దగా కాన్ఫ్లిక్ట్ లేని కథను ముందుకు సాగ తీయడానికి, ఆఫీసు వ్యవహారాలు, హీరోయిన్ తల్లి వ్యవహారాలు అన్నీ తీసుకువచ్చాడు.

దాంతో సినిమాను కాస్త సాగదీసినట్లు అయింది. ఐతే హీరోయిన్, హీరో తండ్రి, హీరో, హీరో తండ్రి ఇలా వీళ్ళ నడుమ రెండు ప్రీక్లైమాక్స్ ఎమోషన్ సీన్లు రన్‌చేసి, క్లైమాక్స్ మాత్రం తేలిక పాటి హాస్యంతో ముగించాలన్న ఆలోచన బాగుంది.

మేనకోడలు చెప్పే ట్విస్ట్, తండ్రీ కొడుకులమధ్య ట్విస్ట్‌లు కానీ మరింత బలంగా చెప్పి వుంటే సినిమాకు ఇంకా ఎక్కువ మార్కులు పడేవి. కానీ దర్శకుడికి ఫన్ జనరేషన్‌లో వున్న స్టామినా అక్కడ అంతగా వున్నట్లు కనిపించలేదు.

సినిమా ఆద్యంతం తేలికపాటి హాస్యం పరుచుకోవడం, చలాకీ అయిన కొత్త హీరోయిన్ నటన ప్లస్‌పాయింట్లుగా నిలిచాయి. అయితే ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలి. హీరోయిన్ క్యారెక్టర్ కానీ, తొలి సగంలో హీరో, హీరోయిన్ల ట్రాక్ కానీ పూర్తిగా వేరే సినిమా నుంచి వేరుగా లేపేసినట్లు కనిపిస్తాయి.

'గజిని' సినిమాలో ప్రకటనల్లో నటించే హీరోయిన్- ధనవంతుడైన పారిశ్రామిక వేత్తల ట్రాక్‌నే ఇక్కడ ఇలా మార్చినట్లు కనిపిస్తుంది. ఆ ట్రాక్‌లో వచ్చే సన్నివేశాలు అన్నీ 'గజిని' సినిమా ట్రాక్‌ను పదే పదే గుర్తుచేస్తాయి.

సినిమాలో సుధీర్‌బాబు బాగా చేశాడు. తన ప్రయత్న లోపం ఎక్కడా లేదని అనిపించలేదు. కొత్త హీరోయిన్ నభా మంచి పేరు తెచ్చుకుంటుంది.

మిగిలినవారంతా ఓకె. సినిమాటోగ్రఫీ బాగుంది. నేపథ్య సంగీతం బాగుంది. కానీ పాటలు మరీ అంత క్యాచీగా లేవు. అక్కడ వినడానికి కూడా జస్ట్ అంతంత మాత్రం అనిపించుకుంటాయి.

టోటల్‌గా ఓ కొత్త దర్శకుడి నుంచి కాస్త మంచి అవుట్‌పుట్టే వచ్చింది అనిపించుకుంటుంది.

ఫ్యామిలీతో చూసేయచ్చు... ఎంజాయ్ చేసేయచ్చు అనిపించుకుంటుంది ఈ సినిమా.

**ప్లస్‌పాయింట్స్...**
సున్నితమైన కామెడీ
హీరోయిన్

**మైనస్‌పాయింట్స్...**
సెకండాఫ్‌లో కాస్త డ్రాగ్

**పంచ్‌లైన్**
'దోచుకున్నట్లే'

## బ్యాలెన్స్ చేస్తా

ఆరేళ్ళనాడు టాలీవుడ్‌కు టాటా చెప్పి బాలీవుడ్ చెక్కేసి అరడజనుసినిమాల్లో నటించిన ఇలియానా తెలుగువైపునకు తొంగిచూడనేలేదు.

ఇన్నేళ్ళ తర్వాత ఇప్పుడు 'అమర్ అక్బర్ ఆంటోని'లో నటిస్తూ, ఇకమీదట సౌత్,నార్త్‌లను బ్యాలెన్స్ చేస్తానంటున్నది. బాలీవుడ్‌లో ఓ మల్టీ స్టారర్ చిత్రానికి పచ్చజెండా ఊపిందట. మొత్తానికిఇంకోమారు రెండుచోట్లాఊపందుకోవాలన్న ప్రయత్నాల్లో నిండా మునిగివున్నట్లుంది. ◆



## నటిగా ఎదిగాను

బొద్దుబొద్దుగా నిలువెత్తు, నిఠారైన అందాలతో విందుచేసే బాలీవుడ్ భామ హ్యూమాఖురేషి తాను నటిగా ఎదిగానని చెప్తోంది. హద్దులు దాటే అందాల ప్రదర్శనతోపాటు, ప్రతిభలో తీసిపోనని నిరూపించుకుంటున్నది. ఇక, కమర్షియల్స్‌కు కొదవలేదు.

"నటిగా ఎదిగానని నమ్ముతున్నాను.సాధన, అనుభవాలతోనే ఇది సాధ్యపడుతుందన్నది నా అభిప్రాయం. జయాపజయాలకు భయపడను.

కష్టపడి పనిచేయగలను కాని, ఫలితాన్ని నిర్ణయించలేను కదా" అంటున్నది. ◆





## మళ్ళీ ఊపిరి

'చినదాన నీకోసం' అంటూ తెలుగు వారికి ధూమ్ ధామ్‌గా పరిచయం అయ్యి ఆపైన వరస సినిమాలతో బిజీ అయిన మిస్తీ చక్రవర్తి పోసోగా స్లో అయిపోయింది. చేసిన సినిమాలేవీ ఆశించిన ఫలితాలు పొందలేకపోయాయి.

దీంతో మిస్తీ చక్రవర్తిని దాదాపు మరిచి పోతున్నారనే చెప్పుకోవాలి.

ఈ దశలో మంచి గుర్తింపు ఏదో ఒకనాడు రాకపోతుందా అన్న నిరీక్షణలో మొత్తానికి 'బుర్రకథ' అవకాశం పొంద గలిగింది. మరోమారు ఆశలపందిరి అల్లిక ఆరంభించింది. ◆

## ఎలా ఆడుతున్నాయి?

- 'శైలజారెడ్డి అల్లుడు' ఫస్ట్ వీక్‌లో 17 కోట్లవరకు వసూలు చేసింది. ఇంక అక్కడితో ఆగిపోయినట్లే. కొనుక్కున్న వాళ్ళకి దాదాపు పాతికశాతంవరకు నష్టాలు వచ్చే అవకాశం కనిపిస్తోంది.
- 'యు టర్న్' కలెక్షన్లు మరీ అద్భుతంగా లేకపోయినా, ఫరవాలేదు అనే రేంజ్‌లో వున్నాయి. ఆ సినిమా పెట్టుబడి, అమ్మ కాలమేరకు సరిపోతాయి.
- 'సిల్లీ ఫెలోస్' బయ్యర్లకు నష్టాలే మిగి ల్చింది.
- మొత్తంమీద చూసుకుంటే బాక్సాఫీస్ డల్‌గానే వుంది. ◆



## మరో పాట

పాటలతో విందుచేయడం రాయ్‌లక్ష్మి స్పెషా లిటీ. రింగ్... రింగ్, రత్తాలు... రత్తాలు పాటలు ఎంతగా చెవుల్లో రింగవుతుంటాయో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. ఇప్పుడు 'వేర్ ఈజ్ ది వెంకటలక్ష్మి'లో లక్ష్మీరాయ్ ఫుల్‌లెంగ్త్ రోల్ చేస్తున్నప్పటికీ కూడా పాట పవర్‌ను అద్దేశారు.

'పాపా... నీకేదంటే ఇష్టం' అంటూ పాడుతూ ఇంకోసారి రాయ్ గింగిరాలు తిప్పేయబోతున్నది. ఈ సినిమాకు ఈ పాటే ప్రత్యేక ఆకర్షణంటూ ఓ స్టేట్‌మెంట్ కూడా విసిరింది. ◆

## ఆర్థికంగా సేఫ్

ఉత్తరాది, దక్షిణాది ప్రాజెక్టుల్ని విజయవంతంగా బ్యాలెన్స్ చేసుకుం టున్న తాప్సి ఇంకా కొద్దిపాటి వృత్తి పర అభద్రత ఉందంటూ ఇప్పటికే ఫ్రాంక్‌గా ఓ స్టేట్‌మెంట్ ఇచ్చి ఉన్నది. అయితే, తనకు డబ్బు సంపాదించా లన్న తపన అయితే లేదంటున్నది.

"ఈ విషయములో మా నాన్న గారికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. నాన్న నా డబ్బును చాలా జాగ్రత్తగా ఇన్వెస్ట్ చేశారు. కాబట్టి నాకు ఆ రకమైన ఆందోళనలు లేవు.

ప్రతి నెలా, నా పెట్టుబడులనుంచి కొంత డబ్బు అందుతుంటుంది. ఈ విషయంలో నేను సేఫ్. కేవలం డబ్బు కోసమే పనిచేయాల్సిన అవసరం లేదు" అంటున్నది. ◆



## శృతి టాక్ షో



తల్లిదండ్రుల అందా లను, ప్రతిభను పుణికి పుచ్చుకున్న శృతిహాసన్ నటనలో, గానంలో, సంగీత దర్శకత్వంలో ఆల్‌రౌండర్. ఈ ప్రతిభ లకు యాంకరింగ్ కూడా జతచేయబోతున్నదట.

తమిళ బుల్లితెరపై టాక్‌షో చేయబోతున్నదని టాక్. సన్ నెట్‌వర్క్‌తో ఈమేరకు ఒప్పందం కుదిరిం దట. సాదాసీదా షో మాదిరి కాకుండా మ్యూజిక్ లైవ్ పర్‌ఫార్మెన్స్‌తో, సెలబ్రిటీలతో, సరదా సంభాషణలతో రూపొందిస్తున్నారని వినికిడి.

ఈ టాక్‌షోలో పలువురు సెలబ్రిటీలు పాల్గొం టారు. ప్రస్తుతం సినిమాల జోరు తగ్గిందని శృతి బుల్లితెరను ప్లాన్‌చేసిందో, ఏమో!

# చివరి రోజుల్లో...

దాదాపు అర్ధశతాబ్దంపాటు ముంబయి నగరంమీద తన పట్టు ప్రదర్శించి భక్తి కన్నా భయంతో ప్రజలంతా తనకోసం తరలివచ్చేలా చేసుకున్న మరాఠా వీరుడు బాల్‌ఠాక్రే.

జీవితమంతా వివాస్పదమే.ద్వేషాన్ని పెంచే ప్రసంగాలే రాజకీయాన్ని 'పాజిటివ్'గా కాక 'నెగటివ్'గా నడిపిన శివ సైనికుడు.

శివసేన అనే పార్టీ స్థాపించి శివసైనికులనే ఉద్యమకారులనుతయారుచేసి 'హిందూ హృదయ సామ్రాట్' అనే బిరుదు అందుకున్నాడు.

బాల్‌ఠాక్రే బ్రాండ్ రాజకీయాలు చాలా పార్టీలు వ్యతిరేకించేవి. కాని ఎన్నికల్లో గెలుపుకోసం బాల్‌ఠాక్రే ముందు మోకరిల్లేవి. అన్ని జాతీయ పార్టీలు, మహారాష్ట్రలోని ప్రాంతీయ పార్టీలు అన్నీ ఏదో ఒక దశలో బాల్‌ఠాక్రే దీవెనలతో, ఆయనతో పొత్తు పెట్టుకుని గెలిచినవే.

బాల్‌ఠాక్రే పిలుపు ఇస్తే ముంబయి నగరం స్తంభిస్తుంది. ఆయన మాటను కాదని పాకిస్తానీయులు ముంబయి నగరంలో క్రికెట్ పోటీ ఆడలేక పోయారు. మా అబ్బాయి సినిమా 'ఖల్ నాయక్'కి అడ్డంకులు కల్పించవద్దంటూ ప్రముఖ బాలీవుడ్ నటుడు సునీల్ దత్ బతిమలాడుకున్నాడు.

రామ్‌గోపాల్ వర్మ తన సినిమాను ముందుగా, ప్రత్యేక షో వేసి బాల్‌ఠాక్రేకు చూపించి, ఆయన ఓ.కే. చేసిన తర్వాతగాని విడుదలచేసుకోలేదు.

దిలీప్‌కుమార్ అంతటివాడిని కార్గిల్ యుద్ధ నేపథ్యంలో పాకిస్తాన్ నుండి అందుకున్న అత్యున్నత పౌర అవార్డుని తిరిగి వెనక్కి పంపుతారా లేదా అంటూ బెదిరించింది బాల్‌ఠాక్రేనే.

మహారాష్ట్రులకు 'ప్రత్యేక రాష్ట్రం' కావాలంటూ ఒకనాడు భారీగా ఉద్యమం నిర్మించిన కేశవ్ సీతారామ్‌ఠాక్రే కొడుకే బాల్‌ఠాక్రే. కాని ప్రారంభంలో ఆ ఉద్యమాల బాటలో లేడు. బుద్ధిగా ఒక పత్రికలో కార్టూన్లు గీసుకుంటుండేవాడు.

'ఫ్రీ ప్రెస్ జర్నల్' అనే ఇంగ్లీషు పత్రికలో కార్టూనిస్టుగా జీవితం మొదలుపెట్టి ఆ తర్వాత మరాఠా పత్రికల్లోకి, మరాఠా ఆత్మగౌరవం రాజకీయాల్లోకి, వడివడిగా అడుగులు వేసుకుంటూ శివసేన పార్టీకి అధ్యక్షుడు అయ్యాడు.

మహారాష్ట్రలో అధికారంలోకివచ్చారు.ఐతేతాను ఎన్నడూ ఏ పదవి చేపట్టకుండా మొత్తం ప్రభుత్వాన్ని తన గుప్పిట్లో పెట్టుకుని 'రిమోట్ కంట్రోలర్'గా దాపరికం లేకుండా ప్రవర్తించాడు. మరాఠాలకు మాత్రమే ముంబయి నగరం. దక్షిణాది, ఉత్తరాది వారు వెళ్ళిపోవాలంటూ బాల్‌ఠాక్రే చేయించిన దాడులు, విద్వేషాలు రెచ్చగొట్టే ప్రసంగాలు ఆయనంటే జాతీయ స్థాయిలో వ్యతిరేకత పెంచాయి.



బాల్‌ఠాక్రే (1926-2012)

> బాల్‌ఠాక్రే పిలుపు ఇస్తే ముంబయి నగరం స్తంభిస్తుంది. ఒకనాటి మరాఠా పులి ఇప్పుడు వయసుమీదపడి, కోరలు పీకిన పులిగా తయారైంది. ఎప్పటినుండో వెంటాడుతున్న మలబద్ధకానికి, శ్వాసక్రియ సమస్య తోడై ఆసుపత్రిపాలైనా 'పులి ఆసుపత్రిలో వుండటమా' అంటూ వారంరోజుల్లో వెనక్కివచ్చాడు.

ముంబయిలో ఉగ్రవాదుల ముఠాలు పేల్చిన బాంబులతో ఎందరో అమాయకులు బలయ్యారు. ఆ ఉగ్రవాదులకు నైతిక మద్దతునిస్తున్న వర్గాలమీద శివసైనికులు హింసాత్మకంగా విరుచుకుపడ్డారు.

ఆ అల్లర్లకు కారకుడని నిర్ధారించి బాల్‌ఠాక్రే ఎన్నికల్లో ఓటువెయ్యటానికి వీలులేదంటూ ఆరేళ్ళపాటు అనర్హత శిక్ష విధించారు.

1999 నుండి 2005 సంవత్సరంవరకు ఆ శిక్షలోనే వున్నాడు. ఒక ప్రజాస్వామ్య దేశంలో ఓటరుగా అర్హత కోల్పోవటంకన్నా పెద్దశిక్ష ఏముంటుంది.

ఓటింగ్‌కోసం పోలింగ్‌బూత్‌లోకి 2007 సంవత్సరంలో తిరిగి అడుగుపెట్టాడు బాల్‌ఠాక్రే.మారిన కాలంతో బాల్‌ఠాక్రే బ్రాండ్ రాజకీయాలకు కాలం చెల్లటం మొదలుపెట్టింది. ప్రజాస్వామ్యబద్ధం కాని శివసేన పార్టీలో లుకలుకలు మొదలయ్యాయి.

వారసులకు ఒక వయసు వచ్చేసరికి శివసేనమీద ఆధిపత్యం పోరు వచ్చింది. ఎన్నిరకాల సిద్ధాంతాలు వల్లెవేసినా వారసత్వం దగ్గరికి వచ్చేసరికి రక్తం పంచుకుపుట్టినవాడికే అన్న సంకేతం ఇచ్చాడు బాల్‌ఠాక్రే. సోదరుడి కొడుకు రాజ్‌ఠాక్రే పార్టీలో నుండి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత వరసగా సీనియర్ నాయకులు ఒకరి తర్వాత మరొకరు పార్టీ వదిలి ఇతర పార్టీలోకి వెళ్ళిపోయారు. మరాఠాలకే ముంబయి మీద పెత్తనం అనే బాల్‌ఠాక్రే వాదనను వ్యతిరేకిస్తూ ఉత్తరాదిన ఇతర రాష్ట్రాలలో వున్న శివసేన విభాగాలు తిరుగుబాటు చేశాయి.

"మేము నిన్ను హిందూ హృదయ సామ్రాట్‌గా గౌరవించాం... కాని నువ్వు మరాఠా ఆత్మగౌరవమే ముఖ్యమంటే మేము ఒప్పుకోం..." అంటూ బహిరంగ తిరుగుబాటు వచ్చింది.

ఒక్కసారిగా బాల్‌ఠాక్రేకి షాకు. 'సిక్కు, ఖలిస్తాన్ ఉగ్రవాదులకు తేడా లేదు. సిక్కు కాశ్మీర్ తీవ్రవాదులది ఒకటే ధోరణి' అంటూ ఒకనాడు తన పక్కన నడిచినవారే వేలుఎత్తిచూపటం మొదలుపెట్టారు.

'హిట్లర్‌ని అభిమానిస్తున్నా' అన్నాడు. నాజీలు యూదులను చంపినట్టే మన దేశంలో ముస్లిమ్‌లను హింసించటాన్ని సమర్థించాడు. "నేను ముందుగా భారతీయుడిని ఆ తర్వాతే మహారాష్ట్ర వాడిని" అని అన్నందుకు సచిన్ టెండూల్కర్ అంతటివాడిమీద విమర్శలు కుప్పించాడు.

2009 సంవత్సరం నుండి బాల్‌ఠాక్రే మీద ఎదురుదాడి మొదలైంది.గతంలోవున్నంత పలుకుబడి మరాఠా ప్రాంతంలో ఆయనకు లేదని అక్కడక్కడ జరుగుతున్న ఎన్నికలు, వాటి ఫలితాలు తెలియచెపుతున్నాయి. అయినా మరాఠీలను రెచ్చగొట్టే కార్యక్రమాలను మాత్రం ఆపలేదు.

ఎప్పటినుండో వెంటాడుతున్న మలబద్ధకానికి, శ్వాసక్రియ సమస్య తోడై ఆసుపత్రిపాలైనా 'పులి ఆసుపత్రిలో వుండటమా' అంటూ వారంరోజుల్లో వెనక్కి వచ్చాడు. ఇంటిలోనే ఐ.సి.యు. నిర్మించారు. ఇరవై నాలుగుగంటలు వైద్యులు, ఇతర సిబ్బంది కనిపెట్టుకుని వుండే ఏర్పాటుచేశారు.

ఆయన మరణిస్తే ముంబయి ఏమవుతుందనే దానిమీద మీడియాలో కథనాలు రావటం బాల్‌ఠాక్రేని మరింత ఒత్తిడికి గురిచేసింది. ఇంటి చుట్టూ ఓ.బి. వ్యాన్స్‌తో మీడియా హడావుడి.

ఆయన మరణం మేము ముందుగా 'బ్రేక్'చేశామంటే మేము చేశామని చెప్పుకోవాలనే తపన టీ.వీ. ఛానల్స్‌ది.శివసైనికులు ఆ వార్తను ప్రసారం చెయ్యనియ్యకుండా ఓ.బి. వ్యాన్‌లను ధ్వంసంచేశారు.

ఆ తర్వాత నెమ్మదిగా నవంబర్ 17 సాయంత్రం బాల్‌ఠాక్రే మరణం ప్రకటించారు. ఒక్కసారిగా ముంబయి స్తంభించింది. రోడ్లు ఖాళీ అయ్యాయి. తర్వాత అంత్యక్రియలకు ప్రజా సముద్రం వెంట నడిచింది. చరిత్రలో అతిపెద్ద అంతిమయాత్రగా రికార్డు సృష్టించింది.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

→ వై.ముత్యాలరావు, రాయకుదురు

**ఎవరైనా ఇచ్చిందాన్ని 'మహాప్రసాదం' అంటారు ఎందుకు?**

కొంచమే పెట్టారని అర్థం.

→ ఆర్.ప్రశాంతి, విజయనగరం

**దీర్ఘకాలం మన్నేది?**

మన్ను.

→ ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

**బతుకు 'బస్టాండ్' అయ్యేదెప్పుడు?**

బస్సు తప్ప వేరే ట్రాన్స్‌పోర్ట్ లేనప్పుడు.

→ పి.యోబు, ముదునూరు

**శాపనార్థాలు?**

తన గురించి ఇతరుల అభిప్రాయాలు.

→ ఎమ్.రాజారావు, ఆముదార్లంక

**సిపలైన మెడికల్ షాప్ ఓనర్?**

తను కొత్తగాకట్టిన అపార్ట్‌మెంట్స్‌కి 'బి-కాంప్లెక్స్' అని పేరుపెట్టి మురిసిపోయేవాడు.

→ ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

**గోలు లేని జీవితం?**

అడ్డగోలు.

→ ఎమ్.కృష్ణ, కాకినాడ

**వడ్డీ లేని ఋణం?**

చదివింపు.

→ ఆర్.ప్రశాంతి, విజయనగరం

**కలిసున్న జంటను 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' అంటే విడిపోయిన జంటను ఏమంటారు?**

'రోడ్ ఫర్ ఈచ్ అదర్'.

→ టి.వి.రామకృష్ణ, కొత్తపేట

**అతిశుభ్రం?**

పెళ్ళాం 'దుమ్మెత్తిపోసినప్పుడ'ల్లా దులుపుకోవడం.

→ ఎన్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం

**స్నేహం?**

చేయడం 'సులభం', నిలుపుకోవడం 'కష్టం'.

→ ఎన్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం

**ఎన్ని విన్నా తిరిగి చెప్పలేనివి?**

చెవులు.

ఉత్తమ ప్రశ్నకు ₹500 ప్రతి ప్రశ్నకు ₹300 బహుమతి

ఈ కార్టూన్ మీదే






## హ్యాపీ

**మీ** ఆరోగ్యం గురించిన ఒక బాధాకరమైన విషయం, ఒక విషాదకర విషయం నా చేతిలో వుంది. ఏది ముందు చెప్పమంటారు? అడిగాడు డాక్టర్.

బాధాకరమైనదే చెప్పండి ముందు.

మీ మెడికల్ రిపోర్ట్స్ వచ్చాయి.

మీరు 24 గంటలుకన్నా బతకరేమో.

మరి విషాదకర వార్తలో ఏముంది.

ఆ రిపోర్ట్స్ నిన్న వచ్చాయి.

**మా** ఆయనకు మంచి బహుమతి ఇద్దామను కుంటున్నాను... మంచిది ఏదైనా చూపించండి అని అడిగింది షాపువాడిని. వెంటనే ఐదువేలు ఖరీదు చేసే సూట్ తీసి చూపించాడు.

అబ్బా అంత ఖరీదా... ఇంకేమైనా చౌకది చూపించండి అని అడిగింది.

వెయ్యిరూపాయలు ఖరీదుచేసే 'టై' చూపించాడు. అబ్బా అది కూడా ఎక్కువే...ఇంకొంచెం చౌకైనది అని అడిగితే వందరూపాయల ఖరీదు కర్చీఫ్ చూపించాడు. అది కూడా ఎక్కువే అని ఆమె అనేసరికి వెంటనే ఒక అద్దంచేతిలోపెట్టాడు... ఆ షాపతను.

**ఎ**లా గడిచింది వివాహ వార్షికోత్సవం.

పోట్లాటలతోరా...

అదేం... ఈ యానివర్శరీకి ఎక్కడికి తీసుకెళ్ళమంటావు అని అడిగాను మా ఆవిడను.

మునుపెన్నడూ నేను వెళ్ళని చోటుకు తీసుకెళ్ళండి అంది మా ఆవిడ. సరే అని మా అమ్మ దగ్గరకి తీసుకెళ్ళా... ఇంక చెప్పేదేముంది.

**ప్ర**ముఖ మేధావి, ఫిలాసఫర్ ఎప్పుడు స్కాచ్ విస్కీనే తాగేవాడు.

ఎందుకు అలా అని అడిగితే "మొదటి ప్రపంచ యుద్ధం మొదలయ్యేవరకు నాకు తాగే అలవాటు లేదు. ఆ యుద్ధం చేసేందుకు అవసరమైన నిధుల కోసం 'తాను స్కాచ్ తాగటం మానేస్తున్నానని' ఐదవ జార్జి రాజు ప్రకటించాడు. ఆ యుద్ధానికి నిధులు అందకూడదని నేను స్కాచ్ తాగటం మొదలు పెట్టా..." అని అన్నాడు ఆ మేధావి, ఫిలాసఫర్.

**ఛీ** మీరెందుకు పనికి రాకుండా పోయారు... అసలు పడక సుఖమే అందించటంలేదు అంటూ భార్య భర్తతో పోట్లాడింది.

వైద్యుడు అయిన ఆయన దిగాలుగా ఆసుపత్రికి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం తాను అతిగా మాట్లాడాను అనిపించి భర్తకు ఫోన్‌చేసి ఏం చేస్తున్నారు అని అడిగితే "మన నర్స్ నుండి సెకండ్ ఒపీనియన్ తీసుకుంటున్నా" అనే సమాధానం వచ్చింది.

**ఆ**సుపత్రిలో వున్న కాంతంకి క్యాన్సర్ అయితే తనకు ఎయిడ్స్ అని నలుగురికి చెప్పటం ఆశ్చర్యం వేసిన స్నేహితురాలు "ఏంటే ఇది? అలా లేనిది ఎందుకు చెపుతున్నావు" అని అడిగింది.

"నేను పోతే మరొకతెవరు మా ఆయన్ని పెళ్ళాడకుండా వుండేందుకు" అని జవాబిచ్చింది.

మంచి ఆశయంతో, దృక్పథంతో జీవించే వ్యక్తి ఇతరులకు ఆదర్శమవుతాడు.



# ఇప్పటికి 7 భాషల్లో

స్వాతి చినుకులు

వేమూరి బలరామ్

₹125

తెలుగు




₹80

హిందీ




₹275

మలయాళం




₹99

తమిళం



₹99

కన్నడ




₹96

ఇంగ్లీష్




₹80




₹80




₹80

గుజరాతీ (మూడు భాగాలుగా)

ఈ విశ్వరంగస్థలిపైకి ఎందరో వస్తుంటారు, వెళ్తుంటారు. కానీ కొందరు మాత్రమే తమ జీవితాన్ని పరిపూర్ణం చేసుకుంటూ ఇతరులను తమస్సులోంచి తేజస్సులోకి నడిపిస్తారు.

వారు చేసిందల్లా నేనేంటంటూ జీవితాన్ని పరిశోధించి ఆత్మ విశ్లేషణ చేసుకోవడమే. ఈ ఆత్మవిశ్లేషణే ఓ అద్భుతమైన కళ. ఇది అందరికీ సాధ్యంకాని కళ.

The Economy of Human Life పేర ఒక అజ్ఞాత చైనీయ తత్వవేత్త రాసిన మహాగ్రంథం ఇటువంటిదే. మార్కస్ ఆరేలియస్ అనే గ్రీకు సామ్రాట్టు జీవనతత్వాన్ని, గమనాన్ని విశ్లేషిస్తూ తన స్వగతాలన్నీ ఒక గ్రంథంగా సమకూర్చాడు.వేమూరి బలరామ్ స్వాతిచినుకులు ఆ గ్రంథాల కోవలోకి చేరగలజ్ఞానకోశం.తెలుగులో ఈ ప్రయత్నమే అపూర్వం, అద్వితీయం. ఆలోచనా తరంగాలను మచ్చిక చేసుకొని చక్కని తెలుగులో నలుగురికీ తెలియజెప్పిన కలాయుధుడు వేమూరి బలరామ్.

ఈ స్వాతి చినుకులలో తడిసి మనసులు సేదతీరి ఎన్నో సమస్యలకు పరిష్కారాలను పొందినవారున్నారు. వారివారి మానసిక స్థితిగతులనుబట్టి ఒక్కొక్కరికీ ఒక్కొక్కవిధంగా- ఈ స్వాతి చినుకుల నుండి సమాధానాలు లభించడం, సాంత్వన పొందడం మరింత విశేషం.

'స్వాతి చినుకులు' తెలుగులోనేకాక ఇంగ్లీష్, హిందీ, తమిళ,కన్నడ, గుజరాతీ, మలయాళీ భాషలలోకి అనువదించబడి, ఆ యా భాషల పాఠకుల్లోనూ మనోవికాసాన్ని కలిగిస్తూ, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తూ ఎన్నో పునర్ముద్రణలు జరుపుకుంటున్నది. ఈ స్వాతి చినుకులు భాషా, ప్రాంతీయ, జాతీయ సరిహద్దులను దాటి విశ్వమానవులందరికీ వెలుగు ప్రసాదించే 'ఆదిత్య హృదయం'.

స్వాతి బలరామ్‌గారి అక్షరపాత్ర అక్షరాలా అక్షయపాత్ర.

* స్వాతి చినుకులు ఇప్పటికి 7 భాషల్లో తెలుగు, ఇంగ్లీష్, హిందీ, తమిళ, కన్నడ, గుజరాతీ, మలయాళీ భాషలలో వెలువడింది. ✿ అన్ని ప్రముఖ బుక్ షాపులలో లభించును.